

సంపు. ౧౨ యువసంవత్సరము, కార్తికమాసము (నవంబరు ౧౯౩౫) సంఖ్య ౧౧

# కవిపరిచయము

బొడ్డు బాపిరాజు

అంబుజరాగసౌరభములందు చిగిర్చిన గాఢరక్తి భా
వాంబరవీధి స్వర్ణరుచిరాంశువులన్ విరజిమ్మగా నిరా
లంబము స్వీయరాజ్యము సలక్షణరీతుల నేలు నీప్రతా
పంబున కందుకొమ్ము కవిభాస్కర! మావినయప్రియార్ఘ్యముల్.

జలదంపుతెర లొత్తిగిల తొంగిచూచెడి మెరపుమిటారి నీమెచ్చుదాది
చదలేటివెన్నెల పొదల పిసాళించు చుక్కపొలంతి నీటక్కులాడి
కులుకుచూపుల సిగ్గులొలుక ఆకుంచాటుచేయు గులాబి నీచేతిచిలుక
భువనగోళమ్ము కప్పురపుపుంతలుపూయు వెన్నెలపాన్పు నీవిడిదినెలవు
మృదుగళమ్మున మోసు లెత్తించి సకలజగము సమ్మోహనము సేయజాలిన కల
కంఠరాజు నీయాస్థానగాయకుండు-ప్రకృతి యుద నిన్ను జదివించుపాఠశాల.

తలపున్నచో విశ్వుత్తలమంధు లతలు ప్రాకించి క్రొవ్విరు లలరింపగలవు
కోరిక యేయున్న వారాశినట్టింట మిన్నంటుకోట నిర్మింపగలవు.

సెలవైన దిగ్భిత్తికలను తూలికలేక చిత్రపంచయము రచింపగలవు
గురియెక్కల్గిన శృంగారసరకమ్మునను దివ్యనృత్యశాలలె ప్రతిష్ఠింపగలవు
నీకె యభిమత మింత జనించె నేని-దుస్తర క్లేశదగ్ధచిత్తుని వినష్ట
జీవితమునకు నవసుధా సేచనమ్ము-నలిపి నవ్వింపగలకవిస్రష్ట వీవు.

లలితశరీష పేశలపదరాజి పుంఖానుపుంఖముగ తనంతవచ్చు
మలయమందసమీరమధురసుధాభావభర మూహలో సుడిదిరిగిపోవు
నవకాంచనప్రసన్నము లలంకారమ్ము లరమూతకనుగొనలందె మెరయు
కలకలారావసంకులతరంగవ్యూహములు కల్పనలు తలపులకరించు
ఏయమృతవీచికొలువు రాణించుకొననో-పలుకుపలుకున తేనెసోనలను జిలుక
రించు నీవిశ్వమోహన లేఖనీ వి-పంచికాధ్వనుల జగమ్మె పరవశమ్ము.

మిన్నేటివిరిదమ్మి క్రొన్ననవీడ రాయంచల నొకసారి సంచరించు
సంజకెంజాయలో జలకేళిదీర్చు మబ్బుల నొకతేప దోబూచులాడు
చలిగట్టు మంచుతిప్పల నెక్కి జారి యోసరి యొకమారు షికారు చేయు
తెలిదీవితోటబాటల కోరికల్ప్రమానుపూవుల నొకవేళ పుణికిరించు
పాలమున్నీటివెల్లువ పంతమాడి-తరగగుర్రాలను సవారి నెరపు చిన్ని
జాబిలినిసుంగు వెన్నంటి సాగిపోవు-వెనుకముందాడకే నీకవిత్వలక్ష్మి.

పరిపూర్ణచంద్రశుభ్రజ్యోత్స్నలే కాదు, చటుల గాఢధ్వాంతసమితి యొకటి
కమనీయకలకంఠకలగవమ్ములె కావు, పటుఘూకదుస్సహధ్వనులు నొకటి
మధురమందవసంతమలయానిలమె కాదు, వితత హేమంతమారుతము నొకటి
చారుమందస్మితాంకూరదీప్తులె కావు, జీవితాంతవ్యథాశిఖలు నొకటి
విశ్వమోహనసౌందర్యవిభవమెల్ల-కాపురముసేయు నీభావనాపురమ్ము
నందు పాదముంచిన సుకృతాత్ములకును-బొందెతో స్వర్గమిప్పింతువోయి సుకవి!

ఓయి కవినాథ! స్వేచ్ఛాసముజ్జ్వలమ్ము-నీదురాజముద్రిక వెల్గుపాదుకొనిన
చోట నవిరళపూర్ణిమ జ్యోత్స్న వెలయు-పొలయు నిత్యవసంతశోభలు ధ్రువమ్ము!

# "వెక్కిరింపఁబోయి బోర్లాపడుట"

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి

పైసామెతను అసంగతముగా నుదాహరించుచు నన్ను మిక్కిలిగా వెక్కిరించుచు, పిలువనిపేరంటముగా, పనిలేని పాటగా, ఓలేటి—కాదు, వోలేటి-సుబ్బారాయశాస్త్రిలవారు గతమాసపు భారతీ సంచికలో—"ప్రభావతీప్రద్యుమ్నము"అను శీర్షికతో నొకవ్యాసమును ప్రకటించినారంట! ఇదివఱలో భారతి నాకును వచ్చెడిది కాని నే నెన్నఁడుగాని యేవ్యాసమును పంపలేని కారణమునఁ గాఁబోలును సుమారు వత్సరమునుండి యది వచ్చుటలేదు. అందుచే దానిని నేను జూడలేదు. ఏమి తోఁచినదో, ప్రస్తుతము మద్రాసునివాసి, పురాణం సూర్యనారాయణతీర్థులుగారు నాకు సంబంధించిన వ్యాసభాగమును పంపిరి. పత్రికవారికిఁ దోఁచలేదు గాని, తక్కినవి పంపకున్నను ఈసంచికనేని వారే పంపవలసినది. అది యటులుండఁ; ఎట్లయిననేమి? వ్యాసము చేరినదిగదా! చేరుఁగాక. చదివికొను శక్తి యుండవలయునుగదా! రెండుసంవత్సరముల నుండి నేను మిక్కిలి యనారోగ్యముగ నున్నసంగతి యెఱుఁగనివా రెవరు? అట్లగుటచే చదివించి విని, అవగాహన చేసికోవలసి వచ్చినది. తేలిన సారాంశము—

"పూర్వోత్తర విరోధముగా గ్రంథము వ్రాసి పాడుచేసినా రనునదియే." అది ప్రధానము. వెక్కిరింపులు, టక్కులు, టమారాలు, ఇవి తోవాసములు. ముసలివాళ్లను కుఱ్ఱలు వెక్కిరించుటలో తప్పేమి? అది యటు లుండె. విమర్శకులు తమ రెత్తుకొన్న యంశమును స్థిరపఱచుటకై— గ్రంథకర్త, వజ్రనాభుని మనుమలు ముగ్గు రని యొకట, నల్వురని వేఱొకట వ్రాసి, తప్పొప్పుల పట్టికలో సవరణను చూపెను గాని ఆ సవరణ వచనములలో లగించును గాని పద్యములలో లగింపదని కొంత గ్రంథము వ్రాసి తుదకా పద్యములలో సవరింప వీలగునని మూడు నాల్గుగా స్వయముగా సవరించికొని పిమ్మట

'ఈమూఁగురు జామాతల
కామూఁగురుపుత్రకులుమహాబలశాలుల్.'

అనుపద్యము నుదాహరించి యిందు మూఁగురు నలుగురుగా సవరింప వలనుపడ దని మిక్కిలి చింతించిరి శాస్త్రిలవారు. తుదకు పూర్వోత్తరగ్రంథవిరోధమును జూపించినట్లు దృఢనిశ్చయులై శాస్త్రిలవారు—

"పూర్వోత్తరవిరోధ మొదవకుండఁ,
బలుక నేర్చుట బహుతపఃఫలము గాదె!"

అని యుదాహరించి అట్టి తపఃఫలము లేని వేంకటశాస్త్రిగారు ఇట్టి గ్రంథరచనకు దిగరాదని తమయాశయ మన్నట్లు తేల్చినారు. ఇట్లు తేల్చి—

శాస్త్రులుగారు "ఈమూఁగురు జామాతల" అను కందపద్యమును, ఆప్రాంతమందలి వచనములను పరిశీలింపలేదేమో ?" అని యొకవాక్యము వ్రాసి, "ద్వితీయ ముద్రణము నందైనను జూడకపోవుట చాల యాశ్చర్యము."

అని మిక్కిలిగా నక్కజపడినరు. అక్కజపడి యంతతోఁ గూడ విరమింపనే లేదు; ఇంకను గొంతగ్రంథము పెంచి యీ పూర్వోత్తరవిరోధము కుదురదని తేల్చిరి. ఒకటిరెండు మాటలలోఁ దేల్పవలసిన యంశమున కింతగ్రంథము పెంచుటేలొకో యని నే నక్కజపడుచున్నాను. విమర్శకులగు వోలేటి శాస్త్రులవారో? "ద్వితీయ ముద్రణమునందైనను జూడకపోవుట చాల యాశ్చర్యము." అని ముక్కుపై వ్రేలిడికొనుచున్నారు.

ఇది యిట్లుండె, ఈ నాటకము మొదట శ్రీ చెలికాని లచ్చారావుగారు తమ యాజమాన్యమునఁ బ్రకటించు పత్రికయందు ప్రకటించుట కారంభించినారు. ప్రథమాంకము ముగియకుండఁగనే, తిరుపతి శాస్త్రిగారు స్వర్గతులైనారు. పిమ్మట లచ్చారావుగారు నన్ను సప్రయత్నముగ రప్పించి నాకు నెలకు 30 రు. చొ. గౌరవవేతన మేర్పఱచి బహూకరించి పిమ్మట దీనిని పూర్తిచేసి యీవలసినదని కోరిరి. నా కప్పటికిఁ జిరకాలమునాఁడే దేహమున — ముఖ్యముగా శిరస్సునందు— భ్రమణ మేర్పడియుంటచే కవిత్వరచన మన్న భీతి యుదయించినది. కాని శ్రీ లచ్చారావుగారి సమ్మానము నన్ను వశీకృతుఁగాఁ జేసినది.

"అర్థస్య పురుషో దాసః"

ప్రసక్తానుప్రసక్తముగా నింత వ్రాసితినే కాని యిది ప్రస్తుతవిరోధసమర్థన కుపకరింపఁ జేయు తలంపుతోఁ గాదు. సుబ్బారాయ శాస్త్రులవారికి మాయందు దయలేకపోయినది గాని అదియే యున్నచో ఆయన కంత వ్యాసము వ్రాయవలసినదే యుండదు; మేమిన్ని వాక్యములు వ్రాయవలసియునుండదు. దయ యనఁగా నెట్టి దందురా? ఇట్టిది. కష్టపడి రెండుముద్రణములు సుబ్బారాయ శాస్త్రులవారు చిత్తగించియేయున్నారుకదా! ఇటీవల షష్టిపూర్తిసందర్భములో మరల గ్రంథము లన్నియు ముద్రింపఁబడినవని కూడ శ్రీ సుబ్బరాయశాస్త్రులవారు విని యుండక పోరుగదా! అగుచో - బందరు మినర్వాప్రెస్సునందు ముద్రింపఁబడిన 1934 సంవత్సరపు ప్రతిని గూడ శాస్త్రులవారు చిత్తగించి యుండినచో, ఆ యీ బాధ వారికి లేకయుండునుగదా! ఆప్రతిలో 22వ పుటలో నిట్లు దిద్దఁబడియున్నది—

"ఈ మూఁగురు జామాతల
కామూఁగురు నొకరు పుత్రు లాహావ
ధీరుల్."

ఈవిరోధమునుమాత్రము నేను చెప్పితినే కాని దిద్దుఁబాటు తెలుపనే లేదు. దానిపై ప్రచురణకార్యకర్త యగు కాటూరి వేంకటేశ్వరరావుగారు సవరించెను. నే నాసవరణ నిందనుక చూడనే లేదు. సుబ్బరాయ

శాస్త్రులవారు దయచేసి నిన్న మొన్న విమర్శించి వెక్కిరించునప్పటి కిది వెలువడి వత్సరము కావచ్చినను వా రిది చూడకుండుట మాదురదృష్ట మనుకొనుటకన్న నన్య మేమున్నది? ఈయనపాండిత్యము మా మాపాండిత్యముల వలె లాఁకలూఁకాయి పాండిత్యములలోఁ జేరినది కాదు. ఇప్పుడు క్రొత్తగా బయలుదేరిన శక్కిని నూటికి ముప్పదియైదు మార్కులు సంపాదించి డిగ్రీని పొందినది. అందుచే విమర్శనజ్ఞానము కదుంగడుమెండు. అందుచేతనే తా మేపాత్రమును విమర్శింపఁ బూనినారో, ఆ పాత్ర మెన్ని ముద్రణములైనదో కూడ పరిశీలింపకుండుట యని చదువరు లరయుదురుగాక. ఇంత సులువుగా సవరింపఁదగిన విషయమును దమబుద్ధికి సవరణ కాని యంతమాత్రమున—"తనకల్మి యింద్రభోగము" నుగా నిశ్చయించికొని శ్రీ శాస్త్రులవారు— "అను పద్యమును దిద్దు టెట్లు?- శాస్త్రులుగ రే దానిని సవరింపవలయును." అని వ్రాయ సాహసించినారు. ఈవ్రాఁత కర్థ మేమో చదువరు లెఱుఁగకుందురా? గ్రంథకర్త శుద్ధపత్రికలో సవరించుకొమ్మని సూచించెను. నిశ్చయమే. ఆ సూచనప్రకారము సవరణచేయుట కిది చదువరులకే కాదు, గ్రంథకర్తకుఁగూడ వీఁగునది కాదనియేకదా! కవిత యన నెట్టిదో యెఱిఁగిన వేంకటేశ్వరరావున కెట్లు సవరణయయ్యెనో! విమర్శకున కట్లు కాలే దనుకోవలయును కాఁబోలును. ఈపాత్రము నేను పరేచ్ఛాప్రారబ్ధవశమున వ్రాయ మొదలిడితినేకాని స్వేచ్ఛచేఁ గాదని గ్రంథకర్త తెల్పినట్లును, శుద్ధపత్రికలో సవరణను సూచించినట్లును విమర్శకుఁ డంగీకరించికూడ దీని కింత గ్రంథము పెంచుట కర్థమే లేదు. పైఁగా ఈయన లోకముతోపాటు గ్రంథమును విమర్శింపక వ్యక్తిపరముగా వాడినసామెత యెంత — "కుర్వీత బుధ సోమయోః" అన్నట్లున్నదో చదువరులు తిలకింపుఁడు.

" అని చెప్పుటచే నీపాత్రలో వేంకట శాస్త్రిగారు ప్రతిఫలింపఁజూచినా రని చెప్పవలయును. కాఁబట్టి శుచిముఖపాత్ర అసందర్భస్థితిలో నున్నదని చెప్పవలసివచ్చినది— వెక్కిరింపఁబోయి బోల్తాపడినట్లు ప్రతిఫలింపఁబోయి ప్రత్యక్షవిరోధమును పరిశీలింపలేదు."

ప్రతిఫలింపఁబోయిన దెవరు? వేంకట శాస్త్రిగారు, ప్రత్యక్షవిరోధమును పరిశీలింపని దెవరు? ఆయనయేకదా! వేంకటశాస్త్రిగారు చేసినయపరాధము శుచిముఖపాత్రలో ప్రతిఫలింపఁబోవుటయేకదా! అగుచో నది వెక్కిరింపఁబోవుటవంటి దేయగునా? కానిచో ఆలోకోక్తిని వాడుట కర్థములేమి స్పష్టమే కదా! అగుచో ఈవిమర్శకునకు చక్కఁగా నాలుగు వాక్యములు వ్రాయుటకూడ నేర్చికోఁదగిన యవస్థయేకదా! అగుచో నెక్కడనో ఉపాధ్యాయులుగా నెటు లుండి రని శంక రావచ్చును. ఇపుడు న్యాయమైన పాండిత్యముల నధఃకరించుటయు, నూటికి మూఁడవవంతు పాండిత్యములను మన్నించుటయు,

ననఁగా నూటికి ముప్పదియైదు మార్కుల పాండిత్యములను మన్నించుటయు సర్వత్ర అనుభూతమే కావున నాశంక కవకాశము లేదు. లేదా విద్యార్థుల యదృష్ట మనియేని యనుకోవలయు. అది యటుండె. ఈ సామెతవలన విమర్శకుఁడేదో తనపితృపితామహులను ఉద్ధరించుతలంపుతో నీవిమర్శనకు దిగెననికాని, లేదా, పేరుతెచ్చుకొనుటకై ఈ "ఘటం భింద్యాత్తు" లోనికి దిగెనని కాని యూహింపవలసియున్నది—అగుచో.

"పలుకనేర్చుట బహుతపఃఫలముగాదె" అనుఘట్టములో మమ్మును—లేదా,నన్నును లాకలూకాయిగాళ్లలో చేర్చిన యీవిమర్శకుఁడుగారిపూనిక కార్యకారి గాదు. ఇందులకై యెవరినో గొప్పవారిని విమర్శించి పేరు తెచ్చుకోవలయు నని సుబ్బరాయశాస్త్రులవారు వయస్సుచే జిన్నలైనను," అన్యోన్యం గురవో విప్రాః" అనునభియుక్తోక్తి ననుసరించి ప్రార్థింపఁబడుచున్నారు. ఇంతియకాక యిపుడేని మమ్మనుగ్రహించి షష్టిపూర్తిముద్రణమును జిత్తగింపవలయు ననికూడఁ బ్రార్థింపఁబడుచున్నారు. మఱియును మీవంటి విమర్శకాగ్రగణ్యులకు మావంటి లాకలూకాయలను విమర్శించుట

"మొనగాఁడొక్కరుఁ డాయు మానములు సాముగ జేసి మార్మూలఁ బం, బిన భీపెంపున డాఁగియున్న మునలాపెం బోరికిం జీరులాగున"

అను పద్యార్థమున కుదాహరణము కాఁగలదనికూడ మనవిచేయుచున్నాను.

చదువరులారా! ఇక్కడి కీయన చూపిన విరోధమెట్టిదో మీకు విశదమేకదా! ఇంకను ఈయన యింతతో విరమింపలేదు.

"వేంకటశాస్త్రిగారి చిక్కులను పరిశీలింపక శుచిముఖిపాత్రకు జంట తగిల్చి, చిలవలు పలవలు పెంచినారు" అని యేమో కొంత నిస్సారపు ప్రసంగము వెళ్లఁబోసినారు.

ఈ నస వ్రాసిన "పెక్కెరింపబోయి" అను సామెతనుబట్టి యీయన కౌచిత్యజ్ఞానమెంతయున్నదో, ఇంతటి యౌచిత్యజ్ఞుఁడు పాత్రౌచిత్యవిమర్శన కేమాత్రము తగియుండునో చదువరులు పూర్తిగ గ్రహించియే యుందురుగాన శాస్త్రులవారి — చెట్టుక్రింద ప్లీడరు కబుర్లకు ఇప్పటికింతతో సమాధానము వ్రాయుపూనికనుండి విరమింతును.

"ఈగండం గడచి పిండం బయలఁబడితే" అప్పుడు తక్కినది పూర్తి చేయుదును. ఏమైనను, ఇట్టి "తాథాదాధానాల" తో వాదము సమంజసముకాదని లోకులు ముఖ్యముగా నన్ను నిందింతు రని యెఱుఁగుదును. ఎఱిఁగికూడ, నా కీడెబ్బదవ పడిలో నయిత మావ్యసనము బాధించుచునే యున్నది. భర్తృహరి యేమన్నాఁడు?

"విద్యాయాం వ్యసనము" అన్నాఁడు. ఈయన సాహిత్యశిరోమణిగారు, ఇంకొకా

యన యొకపుస్తకము తెలుఁగులోనికి పరివర్తన చేసినారు. ఆయన తర్కశిరోమణి అని జ్ఞాపకము. ఆయన ఆపాత్తములో, పనిలేని పాటగా మా వ్రాఁత నెత్తికొని కొంత తెలిసీ తెలియని వ్రాఁత వెళ్లఁబోసినారు. ఆ వ్రాఁత నుగూర్చి కూడ ఈ సందర్భములో 'ఒక కారుణ్యము' వేయుట మంచి దనుకొందును. కావున ఆయన వ్రాఁతను రంగాన కవతరింపఁ జేయుదును—

"పూర్వమహాకవిప్రయోగము లున్నను నిట్టిప్రయోగ మనికి రావు"

ఇది ఆయనవాక్యము. దీనివల్లనే ఆయన వ్రాఁత యంతయు బయటఁబడును. ఇట్టి వనఁగా నెట్టివి? అని ఆకాంక్షించుకొందము-

"పృథ్వీభరం బొక్కటా?" వంటివి. ఇందు "బొక్క" అని యశ్లీలార్థము స్ఫురించుచున్నదఁట! ముందు శిరోమణిగారి హృదయము నాక్రమించిన యశ్లీలార్థము నైఘంటికులు వ్రాయనేలేదు; వ్రాసిరేయను కొందము. ఏపూర్వమహాకవిగాని పాటింపని యపూర్వలక్షణము నెవరు మన్నింతురు? కాళిదాసంతవాఁడు దీనిని లక్షింపనియపుడు తక్కినవారిగణన యేల? ఈ "పృథ్వీభరం బొక్క" యెట్టి దనఁగా? "చకాశే పనస ప్రాయైః పురీషండమహాద్రుమైః" వంటిది. అనఁగా, పైశ్లోకములో, 'చకాశే' అను క్రియలో చివరఁగల 'శే' అనువర్ణమునకు 'పనస' శబ్దాదియందున్న పకారమును ముడి వెట్టి "చచ్చిచెడిచాయంగలవిన్నపములుగా" "శేప" శబ్దమును సృష్టించి, ఇంతతోఁగూడ తన క్లిష్టసిద్ధి కాక, ఈశబ్దము శేఫశ్శబ్దమునకు స్మారక మగు నని చెప్పి దోషనిరూపణము చేసినాఁడు. ఇట్లు కష్టించి పాడుసృష్టి సేయుట చాల గర్హ్యము. అగుచో లాక్షణికహృదయ మట్లేల ప్రవర్తించె నందురా? లక్షణమనఁగా కట్టుఁబాటు. దానిని జేయునపుడు తత్కర్త యెన్ని నియమము లేర్పఱుప వలయునో అన్నియు నేర్పఱచితీఱవలసిన దే కాని ఇటీవల లక్ష్యలక్షణవేత్తలా నియమములలో మహాకవు లెంతవఱకు గౌరవించినారో, ఎంతవఱకీ నడించినారో యనునంశము తత్తత్ప్రవృత్తిం బట్టి తెలిసికొని తా నేది యేని వ్రాసికోనగును. అంతియ కాని "గ్రుడ్డెద్దు చేనఁబడ్డట్లు" వ్రాయుట తెల్వికి లక్షణము గాదు. లక్షణ మున్నను, అయ్యది మహాకవిమాన్యము గానిచో దానికి విలువ యుండదు. ఈవిశేషాంశములు చెట్టుక్రింది ప్లీడరు తెగలోని విమర్శకులకు గోచరింపవు. కవిత్వముమాట టటు లుంతము. ధర్మ శాస్త్రవిషయ మింతకన్న గరీయము కదా! ధర్మజ్ఞు లేమన్నారో చూడుఁడు:

"యద్యపి శుద్ధం లోకవిరుద్ధం నాఽచరణీయం నాకలనీయమ్"

దీనివలన శాస్త్రమునకన్న ఆచారమునకు గౌరవ మిచ్చినట్లాయినది. ప్రస్తుతము లక్ష్యమాచారస్థానాపన్నము. కావున శిరోమణిగారు "పూర్వమహాకవి ప్రయోగము లున్నను" అని వ్రాయుట మహాపరాధము.

ఈ త్రోవను తప్ప శ్రీ కాళిదాసు గారి "ఉచ్చైఃకులం చాత్మనః" లోనగునవి నిలువవు. శేషమునకు శేషశబ్దము స్ఫోరక మైనట్లు "ఉచ్చైః" "ఉచ్చ"కు స్ఫోరక మగును. ఇది యిటు లుండె. ఆలంకారికవామనుఁడు 'అవతార'శబ్దము కుదురదని వ్రాసిన వ్రాఁత, దాని నాంధ్రీకరించిన శిరోమణిగారెఱిఁగిన దే కదా! అగుచో నీయనకు "మా భూశ్రుతి వాదనవావతారః" అను కాళిదాస ప్రయోగము కుదురునా? ఇదియు నిటు లుండఁగా నీయన విశిష్టాద్వైతికదా! తఱచు శ్రీమహావిష్ణువునవతారములకు సంబంధించిన స్తోత్రములఁ బఠింపవలసియుండునుగదా! అందు: "మత్స్యావతార, గోవింద" అనునో, లేక "మత్స్యావతర" అనునో చదువరులు తిలకింపుఁడు. లేక అవతరపదమే ఉచ్చరింపనిందు. అది హృదయంగమ మగునో కాదో పరిశీలింపుఁడు. ఆ యీ విషయములు మాకొఱకే వ్రాయఁబడినవి కావు. ఇట్టి వెఱ్ఱిమొఱ్ఱి వ్రాఁతలు వ్రాయు జ్ఞానలవదుర్విదగ్ధులజ్ఞానము మిగుల శోచ్యము!

"విలువగలకవుల లక్ష్యమ్ములెల్ల మీ భార మెల్ల మోయఁగవలయుఁ"

"వ్యాకరణ మొక్క త్రోవ మహాకవు లొక్క త్రోవ"

ఇత్యాదులు పైసందర్భములను బోధించుచున్నను జ్ఞానలవదుర్విదగ్ధు లేదో మాకు వృథగా పని కల్పించుట మానకున్నారు. ఇదిగాక ఈ శిరోమణిగారికి మాఁరచించినవి పెక్కుగ్రంథము లుండఁగా

ఈ బాక్కమాత్రమే యుదాహరించుటకు దొరకెనా? దీనివలన నీయన కేవల రంధ్రాన్వేషణతత్పరుఁ డనియును, అందుచే "బాక్క" దొరకియుండు ననియు ప్రాజ్ఞులనుకొని దీనికి సంబంధించిన శ్లోకమును పఠింతురు కాఁబోలును! శాంతం! పాపం, ఇంత స్తనశల్యపరీక్ష చేయు నీశిరోమణి ఆంధ్రీకరణమున నిలువఁదగినది, హృదయంగమమైనది యొకపుట్టయుకూడ లేదే? వ్రాఁతయంతయు తప్పుల తడక. ఉదాహరించిన పద్యములలోఁ గొన్నిచోట్ల గణములే సరిపడవు. ఈయన వ్రాసెడిది లక్షణగ్రంథము. దానిలో—"అయితే, యోచించు" లోనగు నపప్రయోగములకు మితిలేదు. ఇట్టి తెల్వితేటలతో నొరులపైకి దాడి వెడలుట. ఇదియే కాఁబోలును "ఉట్టి కెగురలేనమ్మ స్వర్గాని కెగిరిందనుకొనుట."

ఇం దొకరు సాహిత్య శిరోమణులు, వేఱొకరు తర్క శిరోమణులు. వీరి వ్రాఁతలయందలి సారాసారములనుజర్చింపఁ దగువారు సహృదయులు; వారే మందలింపఁ దగువారును అని ఇప్పటి కింతతో ముగించుచున్నాఁడను.

బమ్మెర వారి భాగవతములోని

# "పుట్టంబుట్ట" పద్యార్థము

**కుమారదేవ**

ఆంధ్రభాగవతమున స్తుత్యాదికములందు పోతన మహాకవి తన నమ్రతను స్పష్టీకరించుచు,

"పుట్టంబుట్ట శరంబునన్ మొలవ సం
భోయాన పాత్రంబున
న్నెట్టన్ గల్గను కాళిఁ గొల్వను బురా
ణింపన్ దొరంకొంటి మీఁ
దె ట్లేవెంటఁ జరింతుఁ దత్సరణి నా
కీవమ్మ యోయమ్మ మేల్
పట్టున్ నాకగుమమ్మ నమ్మితిఁ జుమీ
బ్రాహ్మీదయాంభోనిధీ."

అని సరస్వతిని ప్రార్థించినాఁడు. ఈపద్యమునకు సాధారణముగా మనలో నించుమించందఱుఁ జెప్పుకొనెడి యర్థము:

"పుట్టంబుట్ట=వాల్మీకినిగాను, శరంబునన్ మొలవ=శరవణభవుఁడనుగాను, అంభోయాన పాత్రంబునన్ నెట్టన్ గల్గను = వ్యాసుఁడనుగాను, కాళిఁగొల్వను=కాళిదాసుఁడనుగాను, పురాణింపన్ దొరంకొంటి = పురాణింపఁబూనుకుంటిని."

ఈపద్యమును చదివినప్పుడెల్ల రెండవ వ్యక్తియగు శరంబునన్ మొలచినశరవణభవుఁడు కవియనికాని, పురాణకర్త యనికాని ప్రసిద్ధి యెచ్చటను గనపడక పెద్దల ననేకులను ప్రశ్నించితిని. అందఱు "అచ్చటనే మాకును సందేహ" మనెడువారును, "చూడవలెను" అనువారును దప్ప ఒక్కరైన సుబ్రహ్మణ్యదేవుఁడు కవి యని కాని, గ్రంథకర్తయనికాని నిరూపింపరైరి. సందేహనివారణార్థము చెన్నపురి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున నున్న వ్రాఁతప్రతు లన్నిఁటిని శోధించి చూచితిని. అన్నిఁటను, "బ్రౌనుదొరవారు శుభ్రంచేయించిన గ్రంథం"లోను గూడ 'శరంబునన్' అనియే యున్నది.

వాల్మీకి, వ్యాసుల నడుమఁజిక్కిన 'శరంబునన్ మొలవ' శబ్దములను మఱల మఱల మననముచేయుచుండఁగా నొక్క పాఠము స్ఫురించినది. అందలి సామంజస్యమును పెద్దలకు వదలి నాకుఁదోఁచినది పాఠకలోకమునకు సమర్పించుకొనుచున్నాఁడను.

పద్యమును ప్రతిపదార్థమునకు విఱుచునప్పుడు, 'పుట్టంబుట్ట, శరంబునన్ మొలవ' అను రెండుభాగములుగా విఱువక ఒక్కటిగా 'పుట్టన్, పుట్టశిరంబునన్ మొలవ' అని శర

మును శిరముగా చదివినచో, 'పుట్ట = వల్మీకము, శిరంబునఁ మొలవ = తలపై పుట్టునట్లుగా, పుట్టఁ=పుట్టలేదు. అంభోయాన... =పడవయందుపుట్టలేదు. అనఁగా వ్యాసుఁడను గాను.' అనుకున్నచో అన్వయార్థాదులు చక్కఁగా లభించుచున్నవి. ఏనాఁడో, ఎవ్వరో తాటాకు వ్రాఁతప్రతులనుండి యుద్ధరించిన తొల్లిటివారు శిరంబునఁ అను దానిని శరంబునఁ అని చదువుకొని, దానికి ఏదో అర్థమును సమన్వయించుకొనియుండవచ్చును. జిలుగక్షరములలో 'శి' 'శ' గా మారుటయందు వింతలేదు. ఉన్నదాని కేదో ఒక అర్థము కుదిరిన వెనుక దానినిగుఱించి యాలోచనకూడ తప్పియుండవచ్చును.

కావున నీపద్యమున పై పాఠాంతరమును పాటించినచో పద్యార్థులనేకుల కిట్టి సంశయములు మానఁగలవు.

---

# మొ ర

లక్ష్మీనృసింహశాస్త్రి

నాలుగేడుల తపము నేనాటికేని
ఈడుగా వాంఛితార్థ రసోదయంబు;
ఈవిరహబాధ, చెలి, సహియించు చిటుల
ఎంతని యొనర్తు దుర్భరైకాంత తపము?
ఈ విషాభీల కీలి నుపేక్ష సేసి
వదలితిరయేని నను మాడ్చి పంపు నిదియ;
ఓ దివిజులార, ఉతితసూ జాతులార,
నీని పనిజూసి పిదప మథింపరయ్య!
కూప నిర్ఘాత వాత సంకుచిత కుక్షి
గూలబడి లేవలేకున్న గొడ్డువోలె

అకటకట, యీ నిరంతరైకాంత మాద
జీవిత మిదెట్లు కడచి కాంక్షింతు బ్రజను?
కోర్కె యేప్రొద్దు లేవ పైకొనెను నదియు
నీట వ్రాసిన వ్రాతయై నిలువదెగద;
ఈ మనశ్చపలత్వ విరామరహిత
గతుల దుర్భరమగును నా బ్రతుకు రోజు!
గగన బిలమున మెరుగు తెగల గనుగొని
మురిసి యలరుచు సమ్మోద శరధి మునిగి
తేలలే కేద్తు, నేడ్చి నిస్తీరవార్ధి
కీవలపు గూర్చి విన్పింతు నెద మొరయగ!

---

# రససిద్ధాంతము

**పాటిబండ మాధవశర్మ**

దువ్వూరి సూర్యనారాయణ మూర్తి గారు యువ భాద్రపదభారతిలో ప్రకటించిన "రస రాద్ధాంతం" అను వ్యాసమును పరిశీలించితిని. యువ వైశాఖభారతిలో నేను ప్రకటించిన "రస పరిష్కారము" అను వ్యాసమున కిది పూర్వపక్షమట. పూర్వ పక్షుల యాక్షేపముల పరీక్షింపగా వారికి నా వాదము సుగ్రాహ్యమైనట్లు లేదు. నా "క్రొత్తరసపరిష్కారము" పై వారి యాక్షేపములకు యథోచిత సమాధానముల నొసగుచు "రసరాద్ధాంతం"లోని కొన్ని యసమంజస ప్రసంగములను ఖండించుచున్నాను.

నా "రసపరిష్కారము"ను పేర్కొనుచు పూర్వపక్షులు "ప్రబుద్ధాంధ్రలోని హనుమచ్ఛాస్త్రి గారి ప్రేమతత్త్వపరామర్శకు ఇది అవమర్శరూపమైన ఒకవింతవాదము" అని వ్రాసినారు. ఇది యవిచార మూలకము. ౧౯౩౮ జనవరిలో తొలుత ఆంధ్రవిశ్వకళాపరిషత్కళాశాల తెనుగుసంఘపత్రిక సంపుటం ౨ సంచిక ౨ లో ప్రకటింపబడిన నా రసపరిష్కారము ౧౯౩౮ సెప్టెంబరు ప్రబుద్ధాంధ్రలో ప్రకటింపబడిన శ్రీహనుమచ్ఛాస్త్రిగారి పరామర్శకు అవమర్శ మెట్లు కాగలదు? నావింతవాదము నాస్వంతవాదమే.

అయితే తెనుగు సంఘపత్రికలో ప్రకటించిన తరువాత ఆవాదమునకు కొంతబలము దొరకుటయు, ఉచితవివరణ సహితముగా రసపరిష్కారమును భారతిలో ప్రకటింపదలపుగొంటిని.

శ్రీ హనుమచ్ఛాస్త్రిగారి ప్రేమతత్త్వ పరామర్శను నేను సకాలముననే చదివితిని. ప్రబుద్ధాంధ్ర మా"ఉషస్సు"కు వినిమయముగావచ్చుచుండెను. "అసలే వారి "రివ్యూ" చూడకుండా" అని రాద్ధాంతకర్తలు వ్రాయుట సాహసము. శాస్త్రిగారి రివ్యూ చూచిన పిమ్మట రసపరిష్కారపునఃప్రకటన విషయము స్థిరతరమైనది. చివరకు ౧౯౩౮ డిశంబరు భారతిలో విశ్వేశ్వరరావుగారి "ప్రేమ-విశ్వమానవకల్యాణము" చూచుటతో రసపరిష్కారమును సమగ్రవివరణసహితము ప్రకటింప నిశ్చయించి ౧౯౩౯ మేలో కాని ఆ పనిచేయ జాలకపోయితిని.

శ్రీ విశ్వేశ్వరరావుగారిని కలుసు కొనుటయు, వారికి నారసపరిష్కారపద్ధతి వినిపించి వారి వ్యాసము అనిశ్చితవాక్యబంధ మనుట నిరూపించుటయు ౧౯౩౮ డిశంబరులోనే జరిగినవి. నారసపరిష్కార పునఃప్రకటనానంతరము ౨౩-౬-౩౯ తారీఖున శ్రీ విశ్వేశ్వర రావుగారి కడనుండి—

"గాలిదుమారం రేగొచ్చును. త్వరలో సంసిద్ధులు కండి కళ్లజోడు ధరించి. మీ విమర్శలో చివుకు ఎక్కడో - చేవఎక్కడో - గ్రహించి లోపాలుంటే ఇప్పుడే సవరించుకొండి.

"దీనికి జవాబు ౨౮ వ తారీఖులోగా నాకు అందేలాగ రాయండి. ఆ తేదీ దాటితే భారతికి మీ వాదఖండనం పంపుతా."

ఇత్యాదిగా ఒక బెదిరింపులేఖ వచ్చినది. ఈ యుత్తరమునకు నేను సమాధానము పంపలేదు. తరువాత మూడునెలలు వేచియుండగా నేటికి "రసరాద్ధాంతం" బయటపడినది. ఇది దువ్వూరి సూర్యనారాయణ మూర్తిగారిపేర ప్రకటింపబడుట చూచియు నేను చకితుడను కాలేదు. ఇది చరిత్ర. ఇక ఖండన-సమాధానము-సిద్ధాంతము:

"రసములు ప్రేమమూలకములనుట సత్యసమ్మతమని నా సిద్ధాంతము" అని నేను వ్రాసియుంటిని. మల్లాది, ఇంద్రకంటి, దేవగుప్తాపు ప్రభృతుల ప్రసంగము నావాదమున కానుషంగికము మాత్రమే. అయ్యును రాద్ధాంతకర్తలు నేను మల్లాది శాస్త్రులవారి "సిద్ధాంతా

చిత్యభక్తివల్ల ఒక అపోహకు" పాలుపడితి ననుట పొరపాటు. నాగురుపాదుల సిద్ధాంతముసెడ నాకు భక్తి యుండుట లెస్సయే. కాని నా "అపోహ"కు అది కారణమనుటలో పూర్వపక్షు లసత్యవాదులగుచున్నారు.

హనుమచ్ఛాస్త్రిగారి రివ్యూను నేను యథాపదముగా "ఉదాహరించలేదు." ఈ యంశమును వాక్యపరిచ్ఛేదసంజ్ఞలు తెలిసిన ప్రతి పఠితయు గ్రహింపగలరు. శాస్త్రిగారి "రివ్యూ"కు నేను తాత్పర్యమునే వ్రాసితిని. నా తాత్పర్యమునకంటె వారి హృదయము భిన్నమగుచో, దానినే యంగీకరించుటకు నా కేయభ్యంతరమును లేదు. "రివ్యూ"లో "అప్రసిద్ధము" అన్నదానికి నేను "సత్యదూరము" అని తాత్పర్యము వ్రాసితిని. "ఉదాహరించ" లేదు.

"స్వంస్వంనిమిత్తి" మిత్యాదిశ్లోకము ౧౯౩౮ జనవరిలో ప్రకటింపబడిన నారసపరిష్కారవ్యాసములో లేదు. అది తరువాత లభించినది. "హాస్యరతి శోకకోప భయాదులైన" ఇత్యాది మల్లాదిశాస్త్రిల వారి పద్యమువలెనే ఈశ్లోకమును నావాదమునకు బలకరముగ నుంటచే పద్యమును, శ్లోకమునుగూడ తరువాత చేర్చితిని.

శాంతముయొక్క రసాన్యతమత్వమును, సకలరసప్రసూత్వమును నిరూపించుసందర్భములో అభినవభారతి ఈశ్లోకము నుదాహరించినది. "నావ్యాఖ్యానము"నకు శ్లోకమే ప్రమాణము. సంస్కారపరిమితమైన వ్యాఖ్యానమును చేయుటకు ప్రతిపఠితకును అధికారము గలదు.

"ఏసంస్కృతసాహిత్యాచార్యులూ చెప్పలేదు" అని పూర్వపక్షులు ప్రస్తావించినవిషయమును వారింకను పరిశీలింపవలసినదిగా కోరుచున్నాను. ఇంతకును ఏపూర్వుడో చెప్పలేదుగనుక మనము చెప్పగూడదా! ఏమికర్మమయ్యాయిది!

"నామూలం లిఖ్యతే కించిత్" అని మల్లినాథుడు ప్రమాణంచేసి తనవ్యాఖ్య నట్లు నడిపియుండవచ్చును. ఐన నేమిమునిగిపోయినది? ఇంతకును అతడు చెప్పినదంతయు మహాకవిశ్లోకములలో నున్నదా? లేదనుటకు లక్షనిదర్శనములు చూపవచ్చును. శ్లోకమునకు వశుడై కొన్నిచోట్ల, శ్లోకమును వశముచేసికొని కొన్నిచోట్ల అతడు వ్యాఖ్యానము వ్రాయలేదా! వ్యాఖ్యకు మూలము లొంగుచున్నంతవరకు వ్యాఖ్యానము అమూలమనుటకు అవకాశము లేదుగదా! "నా వ్యాఖ్యాన" మెంతమాత్రమును "అమూలకము" గాదు.

"ప్రేమ అంటే ఏమిటో మారువలసివుంది" అని యొకశ్లోకము నుదాహరించినారు. శ్లోకార్థము విస్పష్టముగానే యున్నది. కాని"వ్యక్తిగతమైన ఇష్టమునకు-అనురాగం (రతి)-ప్రేమ అనీ, వస్తుగతమైన ఇష్టమునకు వాంఛ ఇచ్ఛ అనీ వ్యపదేశం" అనుపూర్వపక్షులవాక్యములు నాకుజూడ సంకుచితార్థములుగా నున్నవి. కొంచెముపైన "కాగా మనకు వస్తుమాత్రంమీదకలిగే కోరిక కామం అవుతుందిగాని ప్రేమగాదు" అన్నారు ఇంతకును, కామము సామాన్యమైన కోరికయా, వస్తునష్టమైనది మాత్రమేనా? "నాకు గేదె పెరుగుమీదా, కొత్తావకాయమీదా చాలా ప్రేమండీ" అని యెవరేనా అంటే నవ్వుతాంకదూ?" అన్నారు పూర్వపక్షులు. వీరి వాదప్రకారమే "చాలా కామమండీ" అంటే మాత్రము నవ్వము కావలయును!

తిర్యగ్జాతులమీద కలుగుకోరికకు వ్యపదేశము ఏమి? పశ్వాదులు వ్యక్తులా, వస్తువులా? వ్యక్తులైనచో "ఈ యావుమీద నాకు ప్రేమండీ" అనవచ్చునా? వస్తువులైనచో "ఈ యావుమీద నాకు కామమండీ" అనవచ్చునా? "సంబంధినో మే ప్రణయం విహంతుం" అన్న కాళిదాసు తిర్యక్కులకు వ్యక్తిత్వమే కల్పించినాడు. పూర్వపక్షుల వ్యపదేశములకు ప్రయోగపరిమితి (Range of application) ఎంతవరకు?

శ్లోకములో లేని వస్తువ్యక్తి ప్రసంగము తెచ్చి పూర్వపక్షులు ప్రేమ నిర్వచనమును దుష్కరము చేసికొనినారు. ఈభాగము బహుళ సందేహాస్పదము, అనిశ్చితము నైయున్నది. అస్పష్టవ్యక్తమైన రాద్ధాంతుల యీప్రేమనిర్వచనమును నిరాకరించుచున్నాను.

వస్తువ్యక్తిభేదములకు పైమెట్టుమీదిది ప్రేమయని నా తాత్పర్యము. వ్యవహార సౌకర్యమునకై

లోక మెన్నియేని పర్యాయపదముల సృష్టించుకొని సూక్ష్మభేదములతో వానిని వాడుకొనవచ్చును. తత్వ ద్రష్టల కీభేదములు నిరాకరములు. కామ, ఇచ్ఛా, రతి, వాంఛా, అనురాగాదులు సర్వము ప్రేమయొక్క రూపాంతరములు మాత్రమే.

నిమిత్తభేదమున, అవస్థాభేదమున భిన్నమైన ప్రేమయొక్క ప్రవృత్తిరూపములు కామము, ఇచ్ఛ, వాంఛ, రతి ఇత్యాదులు. నివృత్తి పరిణామరూపములు శోక, క్రోధ, భియ, జుగుప్సాదులు.

ఈ ప్రవృత్తినివృత్తిభేదములు సహృదయుని రసానుభవవిధానమున స్పష్టము కాగలవు. శృంగార హాస్యవీరాద్భుత రసముల ననుభవించు పరిణామములో సహృదయునిచిత్తము, వేదనావిరహితమైన ఒక సక్రమ పరిణతిని పొందుచున్నది. కరుణ భయానక బీభత్స శాంతరసములు ఆవేదనాస్పృష్టములు కావు. సహృద యుడు ఈరసములు నానందముగా అనుభవించు విధాన ములో కొంతక్లేశము మిళితమై యున్నది. వీని విషయ మున నిమిత్తవశమైన ప్రేమ స్వప్రకాశమును పొందుటకు కొంతబాధ యగత్యమనుచున్నది. సహృదయుని రసా స్వాదోపలబ్ధిని దృష్టిలో నిడుకొని రసముల ప్రవృత్తి నివృత్తివిభాగమును పూర్వపక్షులు సులభముగనూహింప గలరని తలచెదను. ఇక స్థాయిభావముల విషయమున ఈప్రవృత్తినివృత్తిభేదమును నిరూపింపవలసియున్నది.

"వికారో మానసో భావః." మనస్సుయొక్క వికారములను మనము భావము లని వ్యవహరించు చున్నాము. ఆమనస్సు, లేదా దాని నిసర్గతత్వమును నేను ప్రేమ యనుచున్నాను. ఈ ప్రేమ మనస్సునకు వికారముమాత్రము కాదు. వికారములు నిమిత్తాశ్రయ ములు. ఇట నిమిత్తములు లౌకికము లని మాత్రమే గ్రహింపవలెను. అలౌకికమైన నిమిత్తము మనస్సునకు వికారము కలిగింపదు. శాంతరసమునందు స్థాయియైనట్టి దన కారణమైన మోక్షము అలౌకికము గనుక అది మన స్సునకు వికారము గలిగించదు. నిర్వికార చిత్తత్వము శమము. శమము, రతి, హాసము, శోకము, ఉత్సా హము, క్రోధము, విస్మయము ఇత్యాదులు నిమిత్తభేద ములవల్ల మనస్సుపొందు వివిధావస్థలు. మనస్సు స్థితిలో పొందు వివిధభేదములకు విద్రుతి, విస్తృతి, వికాసము, సంకోచము, క్షోభ, జ్వలనము, స్పంద నము ఇత్యాది— అనురూపమైన భేదములను పొందు ప్రేమయే రతి, శోకము, హాసము, క్రోధము, ఇత్యాది. విభాగ సౌకర్యమునకై పూర్వాచా ర్యులు వీనిని స్థాయిభావములుగా పేర్కొనినను ఇవన్నియు మనోవస్థామాత్రములే యనియు, వీని యం దనుస్యూతముగా వచ్చుచున్న మనోధర్మము ప్రేమ యేయనియు నాతాత్పర్యము. "శృంగారమేవ రసనా ద్రస మామనామః" అనువాదమును ప్రారంభించినభోజుడు "శృంగారోహి నామ విశిష్టాదృష్టచేష్టాభివ్యంజకానాం ఆత్మగుణసంపదాం ఉత్కర్ష బీజం బుద్ధిసుఖదుఃఖేచ్ఛా ద్వేషప్రయత్నసంస్కారాద్యతిశయహేతు రాత్మనో ఽహంకారవిశేషః. స చేతసా రస్యమానః రస ఇత్యు చ్యతే." అనిచెప్పినాడు. ఇతనిదృష్టిలో రసమునకే శృంగారమని నామాంతరము. అహంకారరూపమైన ఈశృంగారముకలవాడు శృంగారి. అతడు మనస్సుచేత భావించగా పుట్టినవే భావములు, రతి, హాస, క్రోధ, శోకాదులు. ఈమానసికస్థితిని దాటినతరువాత అవి రసములు కాగలవు.

"యావత్సంభవంహి భావనయా భావ్యమానః భావ ఏవోచ్యతే. భావనాపథ మతీతస్తు రసః ఇతి మనో ఽనుకూలేషు దుఃఖాదిషు ఆత్మనః సుఖాను భవాభిమానః రసః."

ఆత్మధర్మమైన ఈఅహంకారమే మనోధర్మమైన ప్రేమయని నాతాత్పర్యము. దీనివికారములే భావ ములు. వీనిని సందర్భ, నిమిత్త, అవస్థలనుబట్టి అనుభావ, సాత్విక స్థాయివ్యభిచారిభావములుగా లాక్షణికులు పరిష్కరించినారు. ఈయన్నిటియందును అంతర్హితమై, సంకోచవికాసములనందుచు, ప్రవృత్తి నివృత్తిరూపములతో, ప్రేమయనుమనోధర్మము ప్రవ హించుచున్నది. అనగా ఇవన్నియు ప్రేమయొక్క భిన్నరూపములు. నిమిత్తభేదముచేత భిన్నరూపమై

(రతిశోకహాసక్రోధాదులు) నిమిత్తాతీతమై స్వస్వరూ పముపొంది, తదతీతమై యాత్మాహంకారరూపమున (స్వప్రకాశానందచిద్రూపము) అనుభవమునకు వచ్చు ప్రేమయే రసము.

శాంతమను నిర్గుణతత్త్వపువికారము ప్రేమయే కాని కామముకాదు. విశాలము, నిర్వికల్పము, విశ్వ పతిష్ఠాకరము అయిన ఈప్రేమయే మొదటిభావము, అనగా సామాన్యభావము. స్త్రీ్యదినిమిత్తభేదములచేత ఇదియే కామక్రోధ భయశోకాదులగుచున్నది. ఇవి విశిష్ట భావములు. కామమే సామాన్యభావ మనియు, ప్రేమ విశిష్టభావమనియు పూర్వపక్షులు నుడువుట దోషము. కామము సాధారణభావము కావచ్చును. ప్రేమ ప్రకృష్ట భావమే కాని విశిష్టభావము కాదు. "శాంత వికారం కామం గనుక" అను వాదము నుపసంహరించుకొని "వికృత సన్నివేశాలను చూచేసరదానూ (హాస్యము) గొప్పగొప్ప పనులు చేద్దామనే కోరికనూ (వీరము) అపూర్వార్థములను చూడడంవల్ల కలిగే యిష్టమునూ (అద్భుతము) ప్రేమే అనడం ఎంతవరకు ఉచితమో" పూర్వపక్షులు గ్రహింపవలసియున్నది.

"ప్రేమనివృత్తివల్ల, అంటే ఆయా విషయాల మీద ఇష్టరూపమైన ప్రేమ లేకపోవడంవల్ల" అనుట చేత పూర్వపక్షులకు "నివృత్తి" యనగా బోధపడలే దని తెలియుచున్నది. నివృత్తి యనగా నష్టి, విఘాతము అని యర్థము చెప్పితిని. ఈ యర్థమును వారు చిరము భావింపవలసియున్నది. ప్రేమలేమికిని, ఉన్న ప్రేమ విఘాతమనుటకును భేద మేర్పరచుకొన వలయును. "ప్రేమాభావం" అనుటయందు పూర్వపక్షము దుష్టము. నివృత్తి "అభావం" కాదు.

ప్రేమయొక్క ఉపస్థితివల్ల ప్రవృత్తిరసములు, తిరోధానమువల్ల నివృత్తిరసములు నుత్పన్నము లగుచు న్నవి. ఈ ఉపస్థితితిరోధానములకే ప్రవృత్తినివృత్తి వ్యపదేశము. ఇవి భావాభావములు కావు.

"దేనినైనా తీసుకుని దానిప్రవృత్తినివృత్తుల వల్ల రసాలు పుట్టించవచ్చు." అని పూర్వపక్షులు కరుణము నవలంబించినారు. ఇది తప్పుత్రోవ. కరుణము శాంతవికారమనుట మాత్రము చాలదు. శాంతమునకు ఆదివికారము ప్రేమ. దీని నివృత్తిభావము శోకము. ప్రవృత్తివల్ల నివృత్తిగాని, నివృత్తినుండి ప్రవృత్తిగాని సాధించుట అక్రమము.

రసములు కరుణమూలకములను భవభూతి మహా కవి వచనము సత్యముగాదు. కరుణ రస మహిత మైన ఉత్తరరామచరితను భావించిన ఆవేశ ప్రకోపముచేతను, తన కావ్యమునందు సాలంక మమై పల్లవిరిసిన కరుణరసవాహినిలో సోల లాడిన ఆనందపారవశ్యముచేతను పట్టజాలక మహాకవి పలికినవాక్యము లవి. తాను వ్రాసిన శృంగార, వీర, కరుణ రసప్రధానము లగు మూడు నాటకములందును, కరుణరసప్రధానమైన ఉత్తరరామచరితయే సుశ్రోత్తర మనుట మహాకవి సుత్తించినాడు. అదియుగాక "ప్రుతం కరుణయా" (మాలతి) "దయితకరుణై ర్గాఢకరుణం ద్రవీభూతం ప్రేమ్ణా తవహృదయం" (ఉ. రా. చ.) అని మహాకవి రసానుభవమునందు హృదయద్రవీభావము (విద్రుతి) ప్రధానముగా నెంచి శృంగారవీరములం దది లభింపకగావలయు, కరుణముయొక్క శీఘ్ర ద్రవీకరణ మునకు వశుడై గాఢాభిమానముతో పలికిన పలుకు లవి. వానిని ప్రమాణముగా స్వీకరించి వాదము చేయబూనుట హాస్యాస్పదము.

"తొమ్మిదవ రసం మాడా సాధించడానికి దుర్బలమైన ఈమాట వ్రాయబడింది." అన్నారు పూర్వ పక్షులు. శాంతము రసమే యను వివాదము నా కప్ర కృతము. అది రసమే యనియు, విశేషించి రసములలో ప్రధానతమమనియు అంగీకరించియే నేను పరిష్కారము తలపెట్టితిని. అది నిర్గుణమే యనుటయు నా నిశ్చ యము.

"న యత్ర దుఃఖం నసుఖం న చింతా
న ద్వేషరాగౌ నచ కాచి దిచ్ఛా,
రసస్తు శాంతః కథితో మునీంద్రైః
సర్వేషు భావేషు శమప్రధానః

............నచ తథాభూతస్య శాంత రసస్య సహృదయాః స్వాదయితారః సంతి." అని ధనంజయుడు శాంతమునకు రసత్వము నిరాకరించినాడు. కాని భరతమునియే దాని నంగీకరించెనట. అభినవభారతియు సమర్థించెను. "మునినాప్యంగీక్రియత ఏవ "క్వచిచ్ఛమః" ఇత్యాదివదతా" కనుక అభినవగుప్తపాదులు సైతము "ఏవం నవైవ రసాః" అని తీర్మానించినారు. దీనికి నాట్యమునందు పుష్టిలేకపోయినను, సర్వసహృదయాస్వాదసులభము కాకపోయినను

"మోక్షఫలత్వేన చాయం పరమపురుషార్థ నిష్ఠత్వా త్సర్వరసేభ్యః ప్రధానతమః"

అని ధ్వన్యాలోకలోచనమునందు ఆచార్యపాదులు తీర్మానించిరి. ఈసిద్ధాంతము నంగీకరించియే నేను "శాంతము మూలరసము" అని నుడివితిని. ఈమాటయొక్క బలాబలములకు ఆచార్యపాదులే బాధ్యులు.

ఆచార్యపాదుల రసోద్దేశక్రమోపపత్తికిని నారస పరిష్కారమునకును సంబంధము లేదని తెలియుచునే యున్నదిగదా! నాది రసోత్పత్తిక్రమము. ఆయనది రసోద్దేశక్రమము. రెండును భిన్నమార్గములు. పురుషార్థరూపమైన జీవితమునందు ఏయేరసమున కెంత ప్రాధాన్యము, ఎట్టిప్రయోజనము గలదో ఆచార్యులు నిరూపించినారు. ఉత్పత్తిక్రమము ననుసరించి నేను రసములను పరిష్కరించితిని.

ఈ యనుగమము "అప్రసిద్ధము" అయినంత మాత్రమున ప్రమాదము లేదు. క్రొత్తది అప్రసిద్ధమగుటలో వింతలేదు. అప్రసిద్ధము-అనగా క్రొత్తది-సర్వము అనుచితము, అసత్యము, అసమంజసము అని పూర్వపక్షుల యభిప్రాయమగునో వారితో నేనింక వాదము చేయగోరను.

శాస్త్రైకదృక్కులు పూర్వపక్షుల వాదమునే యంగీకరింపనిండు: ప్రతిభాదృక్కులు నావాదమునే స్వీకరింతురు.

వ్యక్తిగతాభిమానద్వేషములను విస్మరించి నావ్యాసములను పరిశీలించి దోషములను తెలిపినచో సవరించుకొనుటకు నేను సంసిద్ధుడను. నావాదమే గెలువవలెనను దురభిమానము నా కెంతమాత్రము లేదు. సత్యార్థప్రకాశము నాయభిమతము. దానికి అభిజ్ఞులే ప్రమాణము. సదసద్వ్యక్తిహేతువులకు సహృదయుల నిర్ణయమును శిరసావహింపగలను.




అంధ్రుడు
ముదకు లేచి
ఆలోచించి
కార్యమునకు పూనుకొనెను

# "తెనుగువీణ" గీతికామూర్ఛన

చర్ల గణపతి శాస్త్రి

తెనుఁగుఁదోఁట మంజులలతాంతముల సేకరించినది. ఆమోదముల వెదఁజల్లినది. మాలతీమంటపముల నతిశయించినది. ప్రాంగణంబుల నిలిచి మల్లెతీవెలు స్వాగతము లిచ్చినవి. భ్రమరకుమారులు లతాంత సౌందర్యమునకు మురిసిపోయిరి. ఆమోదములవలనఁ జొక్కిసోలిరి. మాలతీమంటపములందు విహారములు సల్పిరి. మల్లెతీవియలయల్లికల ననఁగి పెనఁగియుండిరి.

కాల మొక్కతీరున నుండుట యసహజము. 'క్రొత్తవింత ప్రాఁతరోఁత' అనుసామెత యిపు డర్థవంత మయినది. 'పురాణమిత్యేవ నసాధుసర్వం' అనునభిజనోక్తికి విపరీతార్థము దొరకినది. 'ఆపరితోషాత్ విదుషాం' అను సహృదయవచనమునకు 'ఆపరితోషాత్ స్వేషాం' అనుపాఠాంతరము కల్పింపఁబడినది.

పరిమళములపైఁ బరిమళములు, సమీక్షలపై సమీక్షలు, పత్రికలపైఁ బత్రికలు బయలుదేఱినవి. ఒక రవునన్నది యొకరు కాదనుటయే కర్తవ్యమైనది. చర్చలు సాగినవి. కావ్యామృతఫలమునకై యన్వేషణము జరుగుచునేయున్నది. కావ్యఫలరస మెట్టిదో యింతవఱకుఁ దేలలేదు. సురభిళప్రసూనమే యుత్తమమని యొకరిమతము. సుందరప్రసవమే యుత్తమమని మఱొకరి తీవ్రసంఘర్షణము. ఈసంఘర్షణములోఁ గొట్టుమిట్టాడి లోకము నలిగిపోవుచున్నది. కన్నులు చించుకొని భావిలోకనిర్ణయమునకై లోక మెదురుతెన్నులు చూచుచున్నది.

ఇంతవఱకుఁ దెనుఁగుఁదోఁట యనేకనిలయములను నిర్మించుకొన్నది. ఆశ్రమములచేఁ బ్రసన్నమైనది. మాలలచే నలంకరింపఁబడినది. ప్రవాసులకు వినోదభూమి యయినది. వసంతమనక, హేమంతమనక మధుకణముల నొలుకఁబోయుచున్నది. పూర్ణిమయనక యమావాస్యయనక తేనెపట్టులు తగిలించుకొనుచున్నది. మంచియనక చెడ్డయనక భ్రమరకుమారులు తలలూపుచున్నారు.

లోపము దీర్చుటకోయన 'గోపాలకృష్ణుల యశోకము'లో మొన్ననే తెనుఁగువీణ యొకటి ప్రదర్శింపఁబడినది. మిత్త్రిలోకరు 'చూడవోయి' యని యిచ్చుటచేఁ జూచుట తటస్థించినది. తెనుఁగువీణ చిన్నదైనను దానికి ద్విగుణముగా వేయఁబడిన బురకాను జూచి వీణాలక్షణము సమన్వయించినదిగదా యని గ్రహించితిని. ఇది యశోకగీతిక లాలాపించునో, శోకగీతిక లాలాపించునో చూడవలయును.

ఈవీణను నిర్మించిన శిల్పి యెవరో యను కుతూహలముతో ముఖపత్రము చూచునప్పటికి 'ఇంద్రకంటి' అను వర్ణములు మాత్రము దృగ్గోచరములైనవి. ఈవర్ణములు చట్టున శిల్పినామమును స్ఫురింపఁజేయలేకపోయినవి. నామముల స్థానమును ఇపు డింటిపేరులే యాక్రమించుకొనుచున్నవి గదా యని ముఖపత్రము దర్శించునప్పటికి అది శ్వేతపత్రమైనది. ఇంక గ్రంథములోనికి దిగుపమని మూఁడవపత్రము చూచునప్పటికి 'హనుమచ్ఛాస్త్రి' అని యొక పరిచితమిత్త్రునిపేరు ప్రత్యక్షమైనది. ఏదో కొంత వ్యాకరణము తగులవేసినవాఁడనగుటచే నిది మంచూకప్లుతిగదా యని యా రెండు పేర్లను గంతులువేయించి యన్వయించుకొంటిని. స్నేహితునిదిగదా యని గీతికామూర్ఛనకె సాహసించితిని.

ఈ తెనుఁగువీణకు 'శ్రుతి' పెట్టినవారు శ్రీరంగం శ్రీనివాసరావుగారు. ఇదివఱకే 'శ్రుతి' పెట్టఁబడియుండుటవల్ల మూర్ఛనకు నాకంతగా శ్రమ యనిపించలేదు. తమ శ్రుతిలో శ్రీనివాసరావుగారు 'కవితాదర్శాలకు రసాస్వాదనమే పరమావధి' అని కవిత్వఫల నిర్వచనము చేసియున్నారు. మఱియు 'కొన్నిగీతాలు భావబంధురంగా ఉన్నా కొందరికి నచ్చవు' అని పరమతమును ప్రదర్శించి 'అర్థం తెలియకముందే ఆకర్షిస్తాయి కొన్ని

పద్యాలు' అని స్వమతము నుద్ఘోషించి యున్నారు. స్వమతమున కుదాహరణ ప్రాయముగా 'ఉరుములు మెరుములు ఉటాపుటీగెలు' 'కాశాగజ్జా కంకాళమ్మా' అనునవి చూపించి "'కాశాగజ్జా కంకాళమ్మా' అంటే ఏమిటి? అని కొందరు ప్రశ్నలు వేస్తారు. జవాబుగా కళాశిలిమెవటే దీని కేమీ అర్థం లేదని ఒప్పుకుంటాను" అని సవిమర్శముగాఁ బైకవిత్వలక్షణమునకు నీ తెనుఁగు వీణకు సమన్వయముచేసి చూపించినారు.

ఈవీణాగాన మెట్టిదో, యెట్టిగీతిక లాలాపించు నోయని వితర్కించుకొని పత్రము తిరుగవేయునప్పటికి ప్రథమగీతియొక్క శీర్షిక యుపశ్రుతిలాగున 'ఏమో' అని సమాధానమిచ్చిన ట్లయినది. తరువాత —

"ఏపువ్వు పూసినా
ఏపాట పాడినా
ఎందుకో ఈహృదయ
మింత కళవళపడును."

అను గీతిక ఏది యెట్లున్న నేమియని నాహృదయాందోళనమును కొంత తగ్గించినది.

కవికిని విమర్శకునికిని మధ్య చాలనంతరము గలదు. కవిస్వైరవిహారము విమర్శకునికి నచ్చదు. కవికి మధ్యమధ్య విమర్శకుఁ డేవో కొన్ని యడ్డంకులు కల్పించుచుండును. కొంతవఱకుఁ గవికిని గర్షకునికిని సామ్యముగలదు. కలుపుతీయువానికిని విమర్శకునికిని భేదములేదు. కలుపుతీయువాఁడు గ్రుడ్డివాఁడైయైనచో గడ్డితోపాటు లతికలనుగూడ సమముగనే పీకివేయఁ గలఁడు.

తెనుఁగు వీణను రచించిన కవి ఖండగీతులనే యాలాపించినాఁడు. అగ్నికణమువలె ముక్తకము లంత శోభావహములుకావని వామనాచార్యుల నిర్వచనము. ఆనందవర్ధనాచార్యులుమాత్రము ముక్తకములందుఁగూ రసభావనిబంధనత్వము గలదని యంగీకరించిరి. పూర్వులు తమ యనుభవములను గాథాముఖమున వెల్లడించుట యాచారమైయున్నది. నవకవు లట్లుగాక స్వముఖముననే వెల్లడించుచుఁ బ్రత్యేకత చూపుటకై యత్నించుచున్నారు. పండితరాయశతక మీమార్గమునకుఁ జెందినదే. శ్రీనాథాదుల చాటువులుగూడ నీమార్గములోనివే. ఇట్టులే యీకవియు స్వనామముద్గరనుండియు వైలక్షణ్యమును జూపఁదలఁచినట్లు తెల్లమగుచున్నది. ఈ వైలక్షణ్యమునం దెంతవఱకు సఫలుఁడయ్యెనో సహృదయులే యరయుదురుగాక.

ఈతఁడు తనశరీరమున నెత్తురోడిపోయినను, సత్తువుడిగిపోయినను దేశమునకును, హృదయమునకును ఆత్మార్పణము చేయఁదలఁచినట్లు తన యనుభవమును దెలిపికొన్నాఁడు. క్షామానకు, క్షేమానకు నిలువునిలువున నిప్పయిపోయి యొక్కొకపుడు తలఁపుతలఁపునను ఉలుకొత్తింతునని ప్రతినపూనియున్నాఁడు. ఒకచోట ఇతఁ డీక్రిందివిధముగా వాపోయియున్నాఁడు.

"ఏటిమలుపుల ఇసుకలంకల
ఇల్లుకట్టిన ప్రేమయోగిని
పట్నవాసందుమ్ములోనా
బతకమంటారా"

పట్టణవాసముదుమ్ములో నెవరు బ్రతుకుమన్నారో పాప మితనిని. ఇంద్రియములు కావుగదా.

తన పూతనవనీతజీవితములను అర్థమే చేసికొనని యానిర్భాగ్యలోకములో వేగలేక యితఁ డాఁగలేక పోయినాఁడు. చూడుఁడు:

"ఓప్రభూ, పూతనవనీత జీవితముల
నర్థమేచేసికొనని నిర్భాగ్యులందు
వేగలే నాగలే నింక విడిచివత్తు
తీసికొనిపొమ్ము నీశాంతిధామమునకు."

ఎంతవలపున్నను గమలిని కరము తెగి యితనిని బిలుచుట మానినదికాదు. కమలినీహాసతేజస్సులో దనబ్రతుకు నిలుపలేక కరము తెగి పిలువవలదని బ్రతిమాలుకొనుచున్నాఁడు. ఏలకో యితని కీబాధ పాపము చూడుఁడు.

"నీనవ్వు వెలుగులో
నిలుపలే నీబ్రతుకు

కమలినీ! కమలినీ!
కరమెత్తి పిలువకే"

నవ్వుపెలుఁగులో బ్రతుకునిలుపలేననియన్నప్పుడు 'మొగమెత్తి నవ్వకే' అనిగాని, 'తలవంచి నవ్వకే' అని గాని యన్నచో నుచితమేమో?

పురాతననవీన జీవితముల నర్థమేచేసికొనని నిర్భాగ్య లోకములోఁ బాపము వేగలేకపోయినను, నవ్వుపెలుఁగులో బ్రతుకు నిలుపలేకపోయినను ఈక్రిందియనుభవములు ఇతనిని ఆనిర్భాగ్యలోకములోనే యుండునట్లు చేసినవి.

"నను జూసి నవ్వింది
నవ్వులో మెరిసింది
కనుగొనల పొంగేటి
కలతకోరిక లేహొ
మిణుకుమిణుకుమంటు
కనికరిసాయి
ఆచిన్నిహృదయాన
ఏమున్నదోకాని
....................
...................."

ప్రబంధాలలోని నాయికానాయకులవలెఁ బాపము ఇతఁడు పూవుపూనినప్పటికి, పాటపాడినప్పటికి, జాబిలిరాజు పకపకా నవ్వినప్పటికి యాలికిపడి కళవళపడి పోవుచున్నాఁడు.

"............
జాబిలిరాజు
పకపకానవ్వితే
ఈహృదయ మెందుకో
ఇంతకళవళపడును"

ఇతఁడు వియోగియైనను అయియుండవలెను, లేక యున్మాదియయినను అయియుండవలెను. కాకపోయినచో ఎందు కీహృదయ మింతకళవళపడును.

కవి తాను శైలిలో నూతనత్వము కనుపఱుపఁ దలఁచినట్లు గోచరించుచున్నది. కాని నూతనత్వమనునది భాషానియమోల్లంఘనములవల్ల సిద్ధింపదు. కవిసమయములను బాటించినచో నూతనత్వమునకు భంగము గలుగదు. అర్థపుష్టి, అన్వయసౌలభ్యము మొదలగుగుణములు లేనిచో నూతనత్వమునకే కాదుగదా కవితకే భంగము గలుగును. భావములు నూతనములుగా నుండవచ్చును. పదసంఘటన క్రొత్తతీరునఁ గూర్పవచ్చును. నూతనత్వము కోసమై యర్థము పాడగునట్లు కూర్చుటలో నూతనత్వము ఉండదు. ఈ క్రింది దీర్ఘసమాసములలో నర్థ మెట్లు పాడైయినదో చూడుఁడు:

'మధుదుర్దినశ్రావణపర్యుపస్సుధా
పాతము లార్చుకొన్నవి'

మధుదుర్దినములు వసంతఋతువులోనే యని కవిసమయము. శ్రావణమాసములోఁ గేవలదుర్దిన (మేఘచ్ఛన్న దినములు) ములేకాని మధుదుర్దినము లుండుట కవిసమయ విరుద్ధము, కాలవిరుద్ధమును. ప్రబంధములందలి పుష్పాడితిప్పలను గూర్చియు, మరందప్రవాహములను గూర్చియు నభూతకల్పనలని నిరసించుట సులభమేకాని మధుదుర్దినముల నభూతకల్పనచేయుక యుచితము పాటించుట సులభమా? ఇక్కడ సుధాశబ్దమునకు మరందమని కవియభిప్రాయము కాఁబోలును. ఈయర్థము నిఘంటువులందు మృగ్యము. శబ్దరత్నాకరములో నీ యర్థము లేదు. ఇది మారుపదాల బిగింపేమో? ఈకవి నిఘంటువులను గొంతవఱకుఁ బ్రమాణముగా నంగీకరించును. అదియుఁ గొంతనయమే. 'అర్చుకొన్నవి' ఏమి కూర్చుకొన్నవోకాని ఇది చదువునప్పటికి మనస్సార్చుకొనిపోవుచున్నది.

'ఉమామహేశ్వరవిచిత్రపదాంకిత పుణ్యమేదినీ పదములు'

ఇందలి 'విచిత్ర' పదమున కర్థపుష్టి యక్కఱ లేదు కాఁబోలు. ఇది యనర్థపదము. 'యతి మామతి చొప్పున నుపయోగింప' మని సంకల్పించుకొనియుండుటచే నీపదము యతికొఱకై వచ్చినదనుకొనుటకు వీలు లేదు. ఆపైని 'విచిత్ర' పద మున్నను యతి యెట్లును జెడినది. ఈవిచిత్రపదము గణభంగము వారించుటకై

వచ్చినదై యుండవచ్చు. 'యతి మామతిచొప్పున నుపయోగింపు' మని సంకల్పించుకొన్నను కుదిరినచోట యతి వేయఁబడినది లెండు. చూడుఁడీ క్రింది సమాస పదసంఘటన :

'నవనవేందీవరార్ద్ర
హృదయసుకుమార నేత్రాల కొడిగినాడు'

ఇందులో భావము శూన్యమయినది. అనన్వితార్థ పదసంఘటన మిందుఁ బ్రవేశించినది. ఇందీవరార్ద్రము లన నేమియో? ఒక యాధునికకవి 'లతాంతార్ద్ర రాగంబులన్' అన్నాఁడు. లతాంతార్ద్రములు ఇందీవరార్ద్రములు అన్నలో తమ్ములో. దీనినే యోగ్యత లేక పోవుట యందురు పెద్దలు. హృదయమునకు సుకుమార నేత్రాలా? ఆహా యేమి? విశ్వామిత్రసృష్టికి పై చేయే యిది. ఇట్టిదానిని బఠించి యానందింపవలయు నన్నచో నెట్టు లానందింపవలయునో చెప్పలేము.

ఈ క్రిందివానిలోఁ బాపములు అగుపడుటలేదు. చూడుఁడు:

'చైత్రమధుయామినీ
చంద్రికాహృదయాన
వీవలపు రగులునో
ఈ ప్రాత నీ ప్రోత'

ఇందులోని 'ఈప్రాతనీప్రోత' అను నీ పాదమును విశ్వామిత్రుఁడు త్రిశంకునిలాగఁ బైకెగంటినను గిందికే పడిపోవుచున్నది.

పాప మొకకవి 'నందనానంద కుంద మరంద లవము' అని వ్రాసుకొన్నాఁడు. 'అనుప్రాసకే ఆనందమా, అర్థపుష్టి అక్కర లేదా' అని యాక్షేపించిన యీకవి యెట్లు వాడినాఁడో చూడుఁడు :

'పాలసంద్రపుతరకు
హాలహలపు చెరుకు'

ఇక్కడఁ దరకుకోసమే చెరుకు వచ్చినదో, చెరుకు కోసమే తరకు వచ్చినదో కవికే తెలియవలయును. ఈ మాత్రపు అనుప్రాసకే సంతోషించినపుడు అంత యనుప్రాస రప్పించుకొన్న యా కవి యెంత యానందించియుండునో! అతని యానందమున కితని కంత కంటగింపు ఎందులకో!

సాధారణముగాఁ బ్రతికవికిని ఏవో కొన్ని యభిమానగ్రంథము లుండును. అదిగాక తఱచుగాఁ దాను జదువుకొన్న పద్యముల ఛాయలు హృదయము నంటి యుండుటచే నవియే యొకప్పుడు తన గ్రంథములోనికిఁ బ్రాఁకవచ్చును. ఒకప్పుడు ఒక్కవిధమైన భావమొకే తము హృదయమునందుఁ గలుగవచ్చును.

అంతమాత్రముచేతఁ గవి చౌర్యముచేసినాఁ డనలేము. వాల్మీకిరామాయణములోని శ్లోకపాదములు కాళిదాసు ఒక్కొక్కచోట నుపయోగించుకొన్నాఁ డందురు. కాళిదాసు తనకుఁ బూర్వుఁడగు భాసకవి వాసవదత్తలోని వీణోపాలంభనమును జూచి దుష్యంతునిచే నంగుళ్యోపాలంభమును జేయించెనని వాదించెదరు. ఇది కేవలము చౌర్య మనలేము. శ్రీనాథుని పోకడలు పెద్దనగారిలోఁ గనిపించినంతమాత్రమునఁ బెద్దనగారికిఁ జౌర్య మంటఁగట్టుట భావ్యమగునా? ఇతరకవుల పోకడలు గూడ నీ తెనుఁగువీణలోఁ గనిపించుచున్నవి. వీనిని చౌర్యములుగా భావింపను. కాని యీకవి యట్టి వానిని చౌర్యములుగను, పారతంత్ర్యములుగను భావించును. వకుళమాలాపరిశీలనములోఁ బారతంత్ర్యములుగా నిట్టివానిని వ్యవహరించి యాక్షేపించిన యీకవిలోనే యట్టివి కనుపట్టుచున్నందుల కాశ్చర్యముగలుగుచున్నది. ఒకరిని ఆక్షేపింపఁగనే సరియా? తనవ్రాఁతలలో నట్టి దోషములనుగూర్చి శ్రద్ధతీసికొనవలదా? పైఁగా వకుళమాలను బాగుగాఁ బరిశీలించుటచేత నేకాఁబోలు దాని ఛాయలు తెనుఁగువీణలోఁగూడ దొరికినవి.

'హరజటాజూటపథాల పొరలి
చిలుకు మిన్నేటి పన్నీటివలపు'

(వకుళమాల)

'భవజటాజూటగళితగంగాప్రవాళ
వేణికలు'

(తెనుఁగువీణ)

'ఆగికోలేని చెలియ! ఈమూగబాధ'

(వకుళమాల)

'వేగలేని నాగలేని నింక విడిచివత్తు'

(తెనుగువీణ)

'ఆగలేను' దీనియొక్క తమ్ముఁడే కాఁబోలు

'వేఁగలే దొక పత్రమేఁ' (తెనుగువీణ) అను ప్రయోగము.

'చేదులారిన నేనియ జీవితాన'

(వకుళమాల)

'చేఁదయిన జీవితము ఆశించినాఁడు'

(తెనుగువీణ)

మఱికొన్ని యితరకవుల ఛాయలుకూడఁ జూపింతును.

'నాకోరికలు చెమ్మగిలు నయనమ్ము లేదు'

(శ్రీకృష్ణశాస్త్రి)

'ఎవరగలించి పాడిన నవోదయగీతికి ఒక్క అశ్రువే
వదలరు సుమ్మ మానవులు'

(తెనుగువీణ)

'ప్రొద్దుపొడుపునోములు నోమఁబూనినానో
చిట్టిబొట్టుకుంకుమఁబెట్టు విన్నదాన'

(రాయప్రోలు సుబ్బారావు)

'చిట్టిబొట్టూ పెట్టడానికి......వెళ్ళినా
నీతగని నోములు నోచమన్నా' (తెనుగువీణ)

శైలియొక్క యనుకరణము చూడుఁడు:

'సందెకెంపులు సాగిపోయెను
వదలుచున్నారా' (శ్రీకృష్ణశాస్త్రి)

'రత్నమంటూ పేరుచెప్పి
రాయివేస్తారా' (తెనుగువీణ)

ఇవి కేవలము చౌర్యములని నాయుద్దేశముకాదు.

అలంకారికులు కాలవిరుద్ధవర్ణనమ్ము, అనన్వయము, వ్యర్థపదములు, పునరుక్తి మొదలగువానిని కావ్యదోషములనుగాఁ బరిగణించియున్నారు. వానికి లక్ష్యములకెంతో దూరము పోవనక్కఱలేదు. అవి మన తెనుఁగువీణయే పొట్టను పెట్టుకొన్నది.

'ఘనభోమాసాల
ఈగ్రొత్తసేసాల
చలువపందిళ్లలో
సంపంగిపూలలో
ఆడుకున్నాడెపుడో
పాడుకున్నాడు.'

శ్రావణమాసములోని మేఘములకు గొల్లదళ దాటిపోయి యౌవనదశ ప్రవేశించును. 'ఆషాఢస్య ప్రథమదివసే మేఘ మాశ్లిష్టసానుమ్' అన్నాఁడు కాళిదాసమహాకవి. శ్రావణ భాద్రపదములలో వర్షములు గ్రుమ్మరించునని బాలునికిఁగూడఁ దెలియును. అప్పటికిఁ జలువపందిళ్ల పని పూర్తియగును. ఒకవేళ నెక్కడనైన నీకవి శ్రావణములోఁగూడ జలువపందిళ్లను జూచియున్నాఁడేమో!

'కలుషప్రావృతకూలాల, గర్వాల, కాంక్షితాల
నిత్యకోలాహలాతిభుగ్నీకృతము'

కలుషప్రావృతకూలలయొక్కయు, గర్వాలయొక్కయు, కాంక్షితాలయొక్కయు నిత్యకోలాహలముచేత అతిభుగ్నీకృతము లని పైదాని కర్థమై యుండునోపును. ఇట్టి యన్వయము ఇంతవఱకెచ్చటను జూడలేదు. ఏకదేశాన్వయము ఉద్ధితాకాంక్షస్థలములందే యని నిర్ణయము. ఇట్టి ముదురుబీరకాయకీచకవిత్వ మెట్టి సానంద మిచ్చునో తెలియకున్నది.

ఈక్రింది పద్యములో యచ్ఛిద్ర తచ్ఛిద్రాన్వయము మృగ్య మగుచున్నది. చూడుఁడు.

'ఏసురపొన్నపూల, పాసి
యించిన మార్గశిరప్రభాతముల్
కోసెడు పూలదీవనల
తో, కరుణించెనో? మాను బాల్యముల్
ఆసుభవేళకా దిది, సు
మాప్లుతమే—రసదిగ్ధమేనియున్
ఆసుభవేళకా దిది—దు
రంతనిదాఘము జీవితమ్ములో—'

బాసుగఁ జదువుకొన్న యీకవి పద్యములోనే యిట్టులున్నచో నితరుల పద్యములసంగతి యింకఁ జెప్పవలెనా? ఏసుభవేళయం దిది బయలుదేఱినదో కాని

దురంతనిదాఘ జీవితమునకువలె దీనికిని అర్థము మృగ్యమగుచున్నది. కనుకనే యీకవి యొకచోట 'హృదయం అంటే, ఫ్రుపంటావా' అని తనహృదయములో నుండి వచ్చిన వేదనలనుగూర్చి వాపోయినాఁడు.

'అమవసయు పూర్ణిమయు కానియట్టిరేయిలు' ఇట యతి వలదన్నను యతికోసము 'యట్టి' అనువ్యర్థపదము వచ్చి యాక్రమించుకొన్నది. ఈకవి యుద్దేశము ప్రకారము గణభంగము చేసినను నింతకంటె నుచితమే యయ్యెడిదే.

ఇతనికవితలో పునరుక్తులు కనుపట్టుటలేదు. కాని యొకచోటఁ బునరుక్తివంటి ప్రయోగమున్నది.

'విమలశారద శుభ్రకౌముదులయందు'

ఇందులో 'విమల'పదమో, లేక 'శుభ్ర'పదమో ఏదో యొకటి యుండవలెను.

పదసంఘటననుగూర్చి నాలుగుముక్కలు చెప్పవలసియున్నది. ప్రసిద్ధములగు పదముల కూర్పు రసపుష్టిని గలిగించును. భావకల్పనవలెఁ బదరచనాకల్పన మన్నిచోటులందును శోభాధాయకము కాఁజాలదు. చూడుఁడు: 'ఆకలిదిచ్చు కన్నీరు' 'క్రొంజెమట నెత్తురుబొట్టు' 'కాగినమంట నిట్టూర్పు' 'సుమారభారంబు' 'నవయౌవనప్రవేశలు' ఈ పైపదసంఘటనలోని యర్థము ఏద్రావిడప్రాణాయామముచేత సిద్ధించునో. ఒకచోట నీపేరులో 'ఒక అనుభవాఘట్టాన్ని ముద్రించాను' అని కలదు. ఇక్కడ 'అఘట్టాన్ని' ముద్రించినాఁడో 'ఘట్ట'మును ముద్రించినాఁడో కవి. లేక 'అనుభవ' శబ్దమునకు ఆకారాంతత్వము ముద్రింపఁబడినదో. కవిశైలినిబట్టి వ్యక్తిత్వప్రదర్శనమునకై యిట్టి మహాప్రయోగము ప్రయోగింపఁబడినదని యూహించుటకు వీలుగానున్నది. కాని ముద్రణాధికారులచేత ముద్రింపఁబడియుండు ననుటకు వీలుకాన్పింపదు.

ఇతఁడు 'నాకుఁగూడ దేశాభిమానము కల' దని చెప్పకొనుటకు ఒకటిరెండుగీతులలో మ్రొక్కుబడి తీర్చుకొని ధన్యుఁడైనాఁడు. ఇతని గీతులలో 'రాజమంత్రి' 'పిచ్చితలపులు' 'కన్నెనోములు' శ్రేష్ఠము లైన రచనలు. అందులో నొకగీతి వ్రాయుదును.

"ఆపిల్ల జడలోన
ఏపూలొముడుచుకొని
ఘుమఘుమావాసనల
కులుకుతూ వచ్చి
ననుజూచి తలవంచి
నవ్వుకుంటుంది
ఆచిన్ని సిగ్గులో
ఏమున్నదోగాని"

ఈకవి గేయములలో వ్యావహారికమును, బద్యములలో గ్రాంథికమును బాటించి తన యభిప్రాయము కొంత విశదపఱచినాఁడు. యతిభంగముతోపాటు సంధిభంగముకూడ నితని కిష్టమే. కొందఱు నవకవులు విసంధులు చేసియున్నను ఆవిసంధిస్థలములలో సంధిచేసినచో గణభంగము గలుగదు. కాని యితనికవితలో నట్లుగాదు. విసంధిచేసిన కొన్నిస్థలములలో సంధిచేసినచో గణభంగము దుర్వారమగును.

'షోడవుదము ఉమామహేశ్వర విచిత్ర పదాంకిత మేదినీపదములు'

'యువక! నీ స్నిగ్ధహృదయమ్ము ఉడికెనేని'

ఒకచోట గణభంగముకూడఁ బటస్థించినది-

'రెక్కరెక్క గదియించి చరింపరాజహంసమా'

ఇక్కడ 'చరింపఁగ' అనినచో గణభంగము గలుగదుకాని వ్యర్థముగ 'గ' అను వర్ణము చేర్చుట యేలయని యితని యుద్దేశమేమో!

అర్థ మున్నప్పుడే యతిభంగాలు, గణభంగాలు చేయవలయునని యితని యుద్దేశము. ఈకవి రచనలలోని యతిభంగాలలోను, గణభంగాలలోను ఏవో యర్థవిశేషములను బాఠకు లూహించుకొనవలెను గాఁబోలును. ఇతఁడు యతులు కొన్నిచోట్ల మానినను ప్రాసములు మానక పాపము వానియందు దయ చూపించియున్నాఁడు. కొన్నిచోట్లఁ బ్రాసములలో వ్యర్థపదములు కూడఁ బడినవి రెండు.

మొత్తముమీఁదఁ దెనుఁగువీణయంతయు నిదే గీతిగా నున్నది. ఇట్టియలంకారములచేఁ దెనుఁగుఁదోఁట యెట్లు శోభింపఁగలదో తెలియదు. శిల్పి తా నేదో నిర్మించునప్పుడు సావధానముగ నిర్మాణములోఁ గళ యుట్టిపడునట్లుగనో, ఆదర్శముగ నుండునట్లుగనో రచింపఁ బ్రయత్నింపవలయును. అంతియేకాని 'కోయిల యేల కొంతెత్తిపాడును, పరులఁ దనియించుటకా' అని ప్రతివారును దలఁచుకొని రచింపమొదలిడుచో రసాభావము తప్ప నింకేమున్నది. మంచిదే తాను 'కోయిల' యనుటకు యత్నించి 'కోయిల' యయినప్పు డెట్లు పాడినను మధురగీతికయే యగునుగాని మఱియొకటి యెట్లు వెలువడఁగలదు. కాకి తాను 'కోయిల' అని యనుకొని యఱచుట మొదలిడినచో దానిమట్టుకు దానికి ఆనందముగనున్నను బరులు సైరుకొనలేరు.

'కాళాగజ్జా కంకాళమ్మ'

అని సోదాహరణముగా శ్రీరంగం శ్రీనివాసరావుగారు తెనుఁగువీణశైలినిగూర్చి చెప్పినవాక్యము లెంతయు సమంజసములై యున్నవి.

ఇఁక నొకటి చెప్పి ముగింతును. మన యాంధ్ర భాషాయోషకు రంగురంగుల కాగితపుఁబువ్వులుగాక సురభిళములగు ప్రసూనములనే కానుకగా నొసంగ ధన్యు లగుదురుగాక యని కోరుచున్నాను.

ఉపసంహారముచేయుచుఁ గవి నూతనముగా

'అఱవిప్పూలనేత్రాంచలాల
మలుపులో ప్రేమలకు ఓనమాలు గలవు'

అని 'జ్ఞాపకం' చేసియున్నాఁడు.

యు క్తి"

పిలకా గణపతిశాస్త్రి

యుషసిచరణామం
జీరాల విడివడిన
చిన్ని బంగరుగంటలారా !!
"గలగల"ను
చిట్టిబంగరు పిచుకలారా !!
వీథిచూరుల దిగువ
వ్రేలాడు రాజనపు,
వరిజాలరుల మీద
వాలిపోకురు గాని,
మెరిసేటి చినెచిన్ని
వరివెన్ను లేతెచ్చి,
మోగేటి బంగారు.
చిరుమువ్వలై వచ్చి,
పాపచుట్టూ తిరిగి
పలకరించండీ !
పాపనోమారైన
ఆడించిపొండీ !
చిట్టి ఈవేళేమో
పట్టింది పోరు !
ఉయ్యాల ఊపగా
చెయ్యూరుకోదు !



చెరువునుండి —యస్. వి. యస్. రామారావు

# దృష్టిదోషం

"రాజు"

వెంకటరత్నమ్మ మామిడిపూడి అగ్రహారీకు డైన వేదాంతం రామశాస్త్రిలుగారి ఏకైకపుత్రిక. రామశాస్త్రిలుగారు నాలుగు వేదాలూ తలక్రిందులుగా వల్లెవేసిన ఘనాపాఠీ. 'అష్టవర్షా భవేత్కన్యా' అనే శాస్త్రవాక్యాన్నతిక్రమించలేకా, మనుమరాలి వివాహమహోత్సవం కండ్లారా చూస్తేనేగాని ప్రాణం విడువనని భీష్మించుకున్న ముసలితల్లి ముచ్చట తీర్చడానికీ సుక్షేత్రమైన ఖండిక అయిదెకరాలు అమ్మి, మహా వైభవంగా సరిగా ఎనిమిదవఏట వెంకటరత్నమ్మ పెళ్లి చేశాడు. ఇంత శాస్త్రోక్తంగా సాలంకృతకన్యాదానం చేసిన పుణ్యాత్ముడెవ్వడూ లేడని చెప్పకున్నారు చుట్టుపక్కలనున్న అగ్రహారీకులు. ఏడుతరాల పితృదేవతలు తరించిపోయారని సంతోషించాడు శాస్త్రులుగారు. వివాహమైన సంవత్సరం తిరుగకుండానే వెంకటరత్నమ్మ పసుపుకుంకం భగ్నమైపోయింది. రెండోసారి శ్రావణ గౌరీవ్రతం చేసుకొనే యోగ్యత ఆమెకు లేకపోయింది. అగ్రహారంలో అశేషజనం శాస్త్రులుగారిని గురించి జాలిపడేవాళ్లే. "ఇంతకూ పాపం ఆయ నేం చేస్తాడు? దాని మొగాన్ని పసుపు కుంకం వ్రాత లేందే" అని చప్పరించేశారు. ఎద్దుపుండు కాకికేమి నొప్పి?

* * *

కొన్నాళ్లపాటు శాస్త్రిలుగారి కుటుంబం ఈదుఃఖంతో కుమిలినా కాలక్రమేణ లోకంతోపాటే అయారు. వీరేశలింగంపంతులు పేరు చెపితే మండిపడే శాస్త్రిలుగారు పంతులు కాళ్లు పట్టుకుందామా అని ఆలోచించాడు మొదట్లో. తన ధర్మశాస్త్రపాండిత్యమంతా వితంతూద్వాహసమర్థనానికి వినియోగించాలని ఆలోచించాడు. కాని సాహసం చెయ్యలేకపోయాడు. సంఘశాసనాన్ని దాటలేక లోకంతోపాటే అయినాడు. వెంకటరత్నమ్మ చాలాచురుకైనపిల్ల. శాస్త్రిలుగారు శిష్యులతోపాటు ఆమెకు కూడా చక్కగా సంస్కృతం తెలుగూ పాఠాలు చెప్పేడు. అల్లుడు పోయిననాటినుంచీ అదొకవిరక్తిగా చదువుచెప్పడం మానేశాడు. కాని వెంకటరత్నమ్మ స్వయంగానే అనేక పుస్తకాలు చదువుకుంటూ కాలక్షేపం చేసేది. చాలా కాలం ఆమెకు వైధవ్యంఅంటే బొట్టు పెట్టుకోకపోవడం, తోడిపడుచులతో పేరంటాల కెళ్లకపోవడం తప్ప వేరే కష్టమేమీ నాట లేదు. ఆమె ఈడేరిననాడుమాత్రం కొంపలో గొల్లుమన్నారు. శవమెళ్లినంత గోలైంది. ఆనాడుమాత్రం ఆమెకు హృదయం చివుక్కుమంది. ఆనాటినుంచి తనఅవస్థనుగురించి ఆలోచించడం ప్రారంభించింది. అట్టే ఆలోచించగా సంఘంమీద రోతపుట్టింది. నిత్యాం

వృద్ధిపొందుతూఉన్న తనసౌందర్యంమీద తనకే అసహ్యం పుట్టింది. ఏమైతే నేమి? నిత్యం 'ప్రాలుబ్ధతత్త్వం' చెవుల్లో ప్రతిధ్వనిస్తూ ఉండడంవల్లనైతేనేమిటి, నిస్పృహాయతవల్లనైతేనేమిటి లోకంతోపాటే ఆమెకూడా సంఘంయొక్క నిరంకుశత్వానికి తలొగ్గింది. ప్రపంచంలో ఎక్కువ కష్టపడే వాళ్లకే సౌఖ్యం తక్కువ. హిందూసంఘంలో అస్పృశ్యులని అగౌరవంగా చూడబడేవాళ్ల కాయకష్టమే ఉత్తమజాతులసౌఖ్యానికి మూలమైఉంది. హిందూ కుటుంబంలోని వితంతువుగతి అంతే కుటుంబానికెక్కువ కష్టించడం, అందరికన్నా తక్కువ హక్కులను, సౌఖ్యాన్ని అనుభవించడం. రత్తమ్మ ఈ అవస్థలనన్నీ చూస్తూ, అనుభవిస్తూ కాలం గడుపుతోంది. సహజంగా తెలివైనదవడంచేత చుట్టుప్రక్కల అందరికీ తలలోని నాలుకలా మెలిగింది. ఒంటెత్తు కాపురాలవారి పిల్లలను సముదాయించడం, కొత్తకోడళ్లకు జడలల్లడం, కొత్తనగలను, బట్టలను పసందు చేయడం ఆమెకాలక్షేపాలు. కొత్తవిషయాల్ని సూక్ష్మంగా గ్రహించి తోడిపడుచుల సౌఖ్యానికి ఉపయోగించేది. మొత్తంమీద రత్తమ్మలాంటి మంచి మనిషి లేదనిపించుకుంది.

* * *

కాలం తలక్రిందైంది. పదిమందినోళ్లల్లోనూ పరువుగా బ్రతికే రత్తమ్మ లేనిపోని అప్రతిష్ఠకు పాలైంది. పొరుగింటి కామావధానుల కోడలు సుబ్బలక్ష్మమ్మ తొలిచూలు కొడుకునెత్తుకొచ్చింది. తనకు లేని విషయాన్ని గురించి ముచ్చటపడడం లోకంలో సహజమే కనుక పిల్లవాడిని చూడాలనే సంతోషం కొద్దీ వెంకటరత్నమ్మ వాళ్లింటి కెళ్లింది. పిల్లవాడిని చూడడానికి రత్తమ్మే ముందయింది. కామావధానులభార్య సోదెమ్మకు మాత్ర మెంతో కష్టంతోచింది. 'శుభమా అంటూ వాకట్లోకి పిల్లాణ్ని ఎత్తుకొస్తే ఊళ్లో పసుపూకుంకంగల ఆడకూతుళ్లెవ్వరూ లేనట్లు ఈ బాలవెధవే ముందొచ్చిందమ్మా, ఏమరిష్టమోను' అంటూ విసుక్కుంది ఆవిడ. మొగంమీద ఏమీఅనలేక ఊరుకుంది. గుప్పెడైతే మిరపకాయలు దిగతుడిచి నిప్పుల్లో పోసింది. వచ్చినప్పటినుంచి నలతగానేఉన్న పిల్లాడు మరిపదరోజులకు జ్వరం వచ్చి చనిపోయాడు. ఆపిల్లవాని చావుకు కారణం రత్తమ్మఅపశకునమేనని సోదెమ్మ నమ్మకం. ఆనమ్మకంతో ఊరుకుంటుందా? ఊరంతా చాటింది. 'అప్పుడే అనుకున్నానమ్మా, ఏదో కొంపమునుగుతుందని. దానిదిష్టి అంత పాపిష్టిదమ్మా' అంటూ అక్కడక్కడా అంటించేసింది. 'అవునమ్మా, కొందరికళ్లల్లాంటివే ఉంటాయమ్మా' అని ఊకంఇచ్చేరు కొందరు అమ్మలక్కలు. రత్తమ్మకనబడితే కామావధానులింట్లో ఇంటిల్లిపాదీ మొగంచిట్లించుకోవడం, మాటాడకపోవడం ఆరంభించారు. దీనికి కారణం ఆమెకు తెలియనే తెలియదు. కొన్నాళ్లకి పొరుగింటివారికోడలుగా కావిడ చా



దాంపత్యము

—వి. వి. భగీరథి.

మంలిపువ్వుల జడేసుకుని శాస్త్రిలుగారింటి కొచ్చింది. రత్తమ్మకు పువ్వులమీదుండే ప్రేమకొద్దీ ఆవిడజడ పరీక్షించి పదిసారులు పసందుచేసింది. ఇదివరకే వ్యాపించిఉన్న పుకారులవల్ల ఆమెమనస్సు కేదో సందేహం తోచింది. సందేహించినట్లుగానే ఆమెకు ఫెళ్లుమంటూ జ్వరంవచ్చి పది లంకణాలు చేసింది. ఇంటిల్లుపాతీ రత్తమ్మను అడ్డమైన తిట్లూ తిట్టి దిగదుడుపులు తీశారు. దీనితో వెంకటరత్తమ్మ అపఖ్యాతి మరింత బలపడింది. ఆమె వాకట్లో కెడితే తలుపు వేసుకోవడం, పిల్లలనైనా దగ్గరకు చేరనివ్వకపోవడం జరుగుతూవచ్చింది.

*　　*　　*

"ఏమండోయి ఇదిగో! చెప్పితే మీకు కాదూ? మాటపనిపించుకోరేమీ?" అంటూ కరణంగారి కోడలు భర్త రామారావు పంతులుని వెనక్కిపిలిచింది. పంతులు సుష్టుగా భోంచేసి మధ్యపాపిడి క్రాపింగు షోకుగా దువ్వుకుని, పట్టీవిడాయించి శివాలయం మంటపంలో పేకాటకు తొందరగా వెళుతున్నాడు. పెండ్లాంకేకలకు విధిలేక విసుక్కుంటూ వెనక్కితిరిగేడు.

"మీకెన్నిసారులు చెప్పినా సరగదుపేనా ఏమిటి?ఆయింటి ముందరనుం చెడుతూ ఆషో కెందుకు? శాస్త్రిలుగారి దిష్టిదేవమ్మ కళ్లడ్డా యంటే ఏదోరోగమో, రొష్టో వస్తుందంటే అంత అలక్ష్యమేమిటి?" అంటూ ఎవరూ లేరు గదాఅనుకుని రుసరుసలాడింది కరణంగారి కోడలు. పంతులు "ఇందుకేనా వెనక్కి పిలుస్త. ఏడిశావులే" అని గిర్రున తిరిగి చక్కా పోయాడు. అప్పుడే అప్పడాలకర్ర కోసం వాళ్లింటికొచ్చిన శాస్త్రుల్లుగారిభార్య వెంకమ్మగారి చెవుల్లో బడ్డాయి ఈ మాటలు. ఇదివరకే చూచాయగా వింటూవచ్చిన విషయానికి ప్రత్యక్షంగా సాక్ష్యం దొరికింది. వెంకమ్మగారికి గంగవెర్రులెత్తేయి. కరణం కోడలిని ఛడామడా ఝాడించేసింది. 'మాటకి మాట తెగులు, నీటికి నాచు తెగులూ' అన్నట్లు మాటమీదమాటొచ్చి నలుగురూ వీధిపడ్డారు. బజారు పంచాయితీదాకా వచ్చింది. ఇంతైనాక రత్తమ్మకు తెలియకుండా ఎల్లాఉంటుంది?

*　　*　　*

వెంకటరత్నమ్మకు ప్రపంచమంతా గిర్రున తిరిగి పోతున్నట్లనిపించింది. దొడ్డివసారాలో పడుకొని తనమీద పుట్టిన వాదులన్నీ తలచుకొని వెక్కివెక్కి ఏడ్చింది. పుణ్యాని కెడితే పాపం ఎదురైందే అని దుఃఖపడింది. ఈమధ్య పిల్లలు తనదగ్గరకి రాకపోవడం, తానింటికెడితే జనం ముఖంచిట్లించుకోవడం ఇందువల్లనేకదా యని గ్రహించింది. ఎంతకృతఘ్నమైన ప్రపంచమో కదా యని లోకాన్ని నిందించింది. తీగకదిలితే డొంకంతా కదిలినట్లు తనజీవితంలో అసౌఖ్యానికి ప్రాతిపదికమైన వైధవ్యాన్ని అసహ్యించుకుంది. సంఘం అకారణంగా తనకు చేస్తున్న అపకారం, చూపుతున్న నిర్లక్ష్యం అన్నీ కండ్లకుకట్టినట్లు కను



“అంటూ ఎవరూ శేరుగదాలనుకుని రుసరుసలాడింది కరణంగారి....”

పించాయి. ఈ అన్యాయపుసంఘాన్ని అతిక్రమించమని అంతరాత్మ ప్రబోధించింది. ‘ఈ ఊళ్లో నీకు చోటులేదుసుమా’ అని మనస్సు హెచ్చరించింది. నీరసంచేత కళ్లు మూతలు పడ్డాయి. అందులో కల. తాను పిల్లల్ని ఆడిస్తూన్నట్లు, పడుచులకు జడలల్లుతూఉన్నట్లు అందరితో కులాసాగా ఆడుకుంటూ ఉన్నట్లు కనుబడింది. వెంటనే మరొకదృశ్యంలో తాను ఇంటికెడితే తలుపు లేసుకోవడం, జనం తన పేరు చెప్పి మెటికలువిరవడం కనుపించాయి. రత్తమ్మ ఉలికిపడి కను విప్పేసరికి తానేదో కొండమీద నుంచి జారిపోతున్నట్లు తోచింది. బాగా స్పృహ తెచ్చుకొని ఈ గ్రామంలో తనకు స్థానంలేదని నిశ్చయించుకుంది. అగ్రహారంలో పచ్చిమంచినీళ్లయినా నోట్లోపోసుకోకూడదని శపథంపట్టింది. ఆనాటితో ఆఊరి ఉదకఋణానుబంధం తీరిపోయింది రత్తమ్మకు.

* *

మరునాడు ప్రొద్దున్న శాస్త్రులుగారింట్లో గొల్లుమన్నారు. ఊరంతా గాలించేశారు రత్తమ్మ కోసం. చెరువులో వలవేసి వెదికించారు. చుట్టుప్రక్కకు గ్రామాలన్నీ వెదికేరు. ఎక్కడా ఆమె జాడే లేదు. ‘అయ్యో శాస్త్రుల్లుగారి కెంతకష్టంవచ్చిందండీ’ అని జాలిపడ్డారు కొందరు. ‘ఎంతపని చేసిందండీ’ అని ముక్కుమీద వేలేసుకున్నారు కొందరు. ఊరిపీడ కొంత వదిలిందని సంతోషించిన వారుకూడా కొందరు లేకపోలేదు. ‘ఏశిష్యుడుతోనైనా పోలాయించిందేమో చూడండి’ అన్నారు కొందరు ఆకతాయిరకం. ఎవరేమన్నా శాస్త్రుల్లుగారిదుఃఖం, ఆయనభార్య కడుపు

శోకం మాన్పేవా ళ్లెవ్వరూలేరు. ఏపత్తా లేకపోవడంచేత ఏగోదావర్లోనో పడి ఆత్మ హత్య చేసుకుందని నలుగురూ సిద్ధాంతం చేసేశారు. శాస్త్రులుగారిభార్య పుత్రికా వియోగంచేత మంచంపట్టి మూడునెలలు తీసుకుని మరణించింది. శాస్త్రులు తనకున్న భూమికాస్త తెగనమ్ముకుని ఎక్కడికో దేశాంతరం లేచిపోయాడు. కొంతకాలానికి అగ్రహారంలో రత్తమ్మమాటగాని, శాస్త్రులు గారి కుటుంబంమాటగాని తలపెట్టేవారులేరు. ఈగాథంతా కాలంలో లీనమైపోయింది.

*        *        *        *

మిస్ రత్నం, యల్. ఆర్. సి. పి. అమలా పురం ఆస్పత్రిలో లేడీ డాక్టరు. ప్రసవ చికిత్స లోను, బిడ్డలవైద్యంలోనూ ఆమెకు చాలిన చెయ్యి ఈ చుట్టుప్రక్కల లేదని పేరుమో సింది. అమలాపురం వచ్చిన రెండుమూడు నెలల్లోనే ఆమెఖ్యాతి వ్యాపించింది. సబ్ జడ్జి గారి కూతురు ప్రసవించలేక ప్రాణాపాయ స్థితిలో నున్నప్పుడు మిస్ రత్నం గండంగడిపిం ది. ఆమెఖ్యాతి కద మొదటి మెట్టు. సారాయి ఇనస్పెక్టరుగారింట్లో దీర్ఘ కాయిలా, తాసి ల్దారుగారి కుమార్తెహిస్టీరియా ఆమెవైద్యం చేతే తగ్గడంచేత అశ్వినీ దేవతల అపరావతార మని బిరుదేర్పడిపోయింది. ఆమెహస్తవిశే షాన్ని గురించి ఆశ్చర్యంగా చెప్పుకున్నారు. అమృతహస్తమనే వాడుక పడింది. ఇతర వృత్తుల్లోవలె గాకుండా వైద్యుడికీ వకీలుకీ ఖ్యాతి రొఖ్ఖంగా ప్రత్యక్షమవుతుంది. మిస్ రత్నం ఎంతలేదన్నా జీతం కాక నెలకు నాలుగువందలు కళ్లచూచేది. ఆమె జీవి తాన్ని గురించి కూడ ఎంతో పవిత్రంగా చెప్పుకునేవారు. మొదటిరోజులలో ఎవరో దక్షిణాది కిరస్తానమ్మ కాబో లనుకున్నారు కాని ఆమెవేషభాషలవల్ల తెలుగుస్త్రీ అని తెల్లమైంది. ఎంతమాత్రం ఆర్భాటం లేని వేషం, ఓర్మి, ఏవేళప్పుడైనా బీదసాదల కందుబాటులో ఉండడం, డబ్బుకోసం నిక్కచ్చిచేయకపోవడం మొదలైన వైద్యుని కుండవలసిన మంచిలక్షణాలన్నీ ఆమెయం దుండడంచేత జిల్లాజిల్లా అంతాకూడా ఆమె పేరు ప్రతిఇంట్లోనూ మోసిపోయింది. ఆమెకు ప్రాక్టీసు హెచ్చయిపోయి చిన్న మోటారు కూడా కొనవలసివచ్చింది. అతికష్టంగాఖర్చు పెట్టుకుంటుందనీ, ఇంట్లో ఒక్క ఆడనౌకరు తప్ప ఎవ్వరూ లేరనీ, ఏనెలకానెల మిగిలిన డబ్బంతా పురంహాలోని మహిళావిద్యాలయా నికి పంపేస్తుందనీ వాడుకపడింది.

*        *        *        *

ఒకరోజున తెల్లవారు ఝామున 3 గంటల కెవరో ఇద్దరుపురుషులు మిస్‌రత్నంకు నిద్రాభంగం కలిగించి దీనంగా ప్రార్థిస్తు న్నారు. అందులో ఒకాయన బాగావయస్సు మళ్లినవాడే.

"అమ్మా, మాఅమ్మాయి కనలేక బాధ పడుతోంది, మీరొక్కసారివచ్చి రక్షించాలి. మావూ రిక్కడే ౧౦ మైళ్లలో ఉంది."

" ఏవూరు ? "

"మామిడిపూడి అగ్రహారమమ్మా"

"మామిడిపూడి అగ్రహారమా?"

అని డాక్టర్ గాభాలున కళ్లెత్తి చూచింది. ఆమె మనస్సు కేదో చురుక్కుమంది. పూర్వ పరిచయం స్పష్టమైంది.

"మీ పేరు?"

"కామావధానులు. వీడు మా అబ్బాయి. వీడి భార్యే నొప్పులుపడుతోంది."

"ఎప్పటినుంచి?"

"నిన్న ప్రొద్దుటినుంచి."

"ఏన్నో కానుపు?"

"రెండో కానుపు. మొదటి కానుపొచ్చి పదిహేన్నెండు సంవత్సరాలైంది."

డాక్టరు అల్లా నిలబడిపోయింది. మాటా మంతీ లేదు. ఆమె కండ్లల్లోంచి అశ్రుబిందువులు జలజల రాలేయి. కామావధానులకి దేమీ అర్థంకాలేదు.

"అమ్మా, ఫీజుకు సందేహించక్కర లేదు. నిన్ను తప్పకుండా సంతోషపెడతాం. నీదృష్టిపడితేనే ఎల్లాంటి రుగ్మతైనా మాయమైపోతుంది తల్లీ, రక్షించాలి."

అంటూ ఇంకా ఏవో సంస్కృతశ్లోకాల తో సహితంగా ముఖస్తుతి ప్రారంభించాడు. డాక్టర్ ఒక్కక్షణం ఆలోచించి "అయ్యా, మీ ముఖస్తుతి చాలించండి. మీరు ముందెళ్లి మీ ఊరురోడ్డుమొగ నుండండి. తెల్లవారేసరికి వస్తాను." అని చెప్పి పంపించింది.

* * * *

మిస్ రత్నం రామశాస్త్రులుగారివితంతు పుత్రిక వెంకటరత్నమ్మ. అగ్రహారంలో వచ్చిన అప్రతిష్ఠ భరించలేక గ్రామంవిడిచి పూనాలోని మహిళావిద్యాలయంలో పది సంవత్సరాలపాటు చదువుకుంది. బొంబాయిలో వైద్యపరీక్షనిచ్చి మద్రాసు ప్రభుత్వంవారి వైద్యశాఖలో ఉన్నపట్నంలో ప్రవేశించింది. తెలుగునాడుకి సేవచేయాలనే తలంపుతో అవకాశం వచ్చినప్పుడు అమలాపురం బదలాయించుకుంది. వస్తూనే మామిడిపూడిఅగ్రహారంలోని తల్లిదండ్రుల సంగతి విచారించింది. వాళ్ల విషాదగాథ తెలుసుకొని చాలా దుఃఖపడింది. ఆమెకు ఆ ఊరు పేరుచెపితే చాలా అసహ్యం కలిగేది. తన జీవితచరిత్రలో ఆభాగాన్ని మరచిపోవడానికే నిశ్చయించుకొని బ్రతికున్నాళ్లూ మానవ సేవ చెయ్యాలని వ్రతం పట్టింది. అందుకే బహునిరాడంబరంగా జీవితం గడుపుతూ సంపాదించినడబ్బు మహిళాసదనాని కర్పిస్తోంది. తాను మరచిపోయిన మామిడిపూడి అగ్రహారంసంగతి జ్ఞాపకం చేశాడు ప్రొద్దున్నే వచ్చిన కామావధానులు. జ్ఞాపకం చెయ్యడ మేమిటి, మనస్సుకు చాలా ఆందోళన తెచ్చిపెట్టేడు. చాలాసేపు ఏమీ తోచక కూచుని వైద్యధర్మం నిర్వర్తించడం తప్పనిసరి అవడంచేత అగ్రహారం మోటారు మీద ప్రయాణమైంది.

* * * *

డాక్టరు రత్నం కామావధానులుగారింట్లో పురిటిగదిలో ప్రవేశించింది. సుబ్బ

లక్ష్మమ్మను పరీక్షచేసి మందిచ్చింది. అవసరమైన చికిత్సలన్నీ చేసింది. పావుగంటయ్యేసరికి సుబ్బలక్ష్మమ్మ సుఖప్రసవమై కొడుకును కంది. చికిత్స చేస్తున్నంతసేపూ సుబ్బలక్ష్మమ్మ డాక్టరుముఖంకేసే చూస్తోంది. ఏదో పరిచయం జ్ఞప్తికొచ్చి ఆమె గ్రుడ్లల్లో నీళ్లు తిరిగేయి. డాక్టరుతొడమీద చెయిపెట్టుకుని పడుకుంది. అమ్మలక్కలంతా డాక్టరు సమర్థత చూచి సంతోషించారు. "నీ చెయ్యి అమృతహస్తమమ్మా. నీదృష్టి పడితేనేచాలు ఎంతెంతజబ్బులైనా పోతాయి." అని ముఖస్తుతి చేశారు.

ఈ మాటలనేసరికి డాక్టరుకు చిరాకేసింది. 'నాదృష్టి అంత గొప్పదా ఏమిటి!' అంటూ ఛటాలున కారెక్కి వెళ్లిపోయింది.

* * * *

డాక్టరు వెళ్లిపోయాక సుబ్బలక్ష్మి అత్తగారిని పిలిచి 'వైద్యురాలి ముఖం మన రామశాస్త్రులుగారి రత్తమ్మ ముఖంలా ఉందండీ' అంది. 'ఆ, మనిషిని పోలిన మనుష్యు లుంటారు. రత్తమ్మెక్కడుంది? ఉన్నా దానికీ తెలివెక్కడిది? పైగా దానికళ్ల ......... 'అని ఏమో చెప్పబోతుంటే కోడలు మాట కడ్డొచ్చింది

'అల్లాంటి మాట లెందుకండీ అత్తగారూ! మనకర్మం గాని ఒకళ్లు చూస్తే ఏమవుతుందండి. నిజంగా మనమూలానే పాపం ఆరత్తమ్మ అప్రతిష్ఠపాలైంది.'

* * * *

డాక్టర్ రత్నం నాల్గవరోజున పథ్యం పెట్టించడానికి అగ్రహారంవచ్చింది. ప్రొద్దున్నే పరీక్షచేసి ఇకనేమీ భయంలేదనీ, పథ్యం వండచ్చుననీ పురమాయించింది. పురిటిగదిలో బాలింతరాలూ, డాక్టరూతప్ప ఎవ్వరూలేరు. బాలింతరాలు డాక్టర్ చెయ్యి పట్టుకుని వెక్కివెక్కి ఏడ్వడం ఆరంభించింది. వద్దనడానికి వైద్యురాలికీ నోరురాలేదు.

"అమ్మా, నీముఖంచూస్తే నాకేమో అతి పరిచయంగా ఉంది. మాట అంతకన్న పరిచయంగా ఉంది. అట్టే పోల్చుకుంటే మా ఊళ్లో వేదాంతం రామశాస్త్రులు గారి అమ్మాయి వెంకటరత్తమ్మపోలిక కనబడుతోంది. ఆవిడ నకారణంగా మేమే అప్రతిష్ఠపాలు చేశాం. మా ప్రాలుబ్ధంకొద్దీ జరిగిన పాపాన్ని ఆవిడ కంటకట్టి పాపంకట్టుకున్నాం. ఆవిడ ఆత్మహత్య చేసుకుందని ఈ ఊళ్లో వాడుక. రామశాస్త్రులు గారి కుటుంబం అంతా ఆదెబ్బతో మాసిపోయింది. పుష్కరంకాకుండా వాళ్ల ఇల్లు పాటిదిబ్బయిపోయింది. ఆపాపం మేమిప్పు డనుభవిస్తున్నాం." అంటూ ఇక మాటాడలేకపోయింది బాలింతరాలు. డాక్టరుకూడా వంచినతల ఎత్తలేదు. తెగిపోయిన హారంలోనుంచి ముత్యాలురాలినట్లుగా అశ్రువులు జలజలరాలినాయి. ఆఖరికి 'అవునమ్మా! నేను రామశాస్త్రులుగారమ్మాయినే. నాకూ ఈ ఊ రొచ్చినప్పటినుంచీ......' అని ఏమో చెప్పబోతుంటే బాలింతరాలు కెవ్వున కేకవేసి కొయ్యాయి

పోయింది. ఇంటిల్లిపాదీ చేరేసరికాని వైద్యురాలు అందరినీ అవతలికి పంపి తలుపేసి స్మారకం రావడానికి కన్ని చికిత్సలూ చేసింది. పదినిమిషాలకు స్పృహ వొచ్చి డాక్టరు చెయ్యి గుండెల నదుముకుని ఏడ్వడం ఆరంభించింది. డాక్టరుకుకూడా దుఃఖం స్వాధీనం కాలేదు. ఏడిస్తే ఆరోగ్యానికి ప్రతిబంధక మని ఓదార్చి పోయింది వైద్యురాలు.

"వెంకటరత్నమ్మా, మా కుటుంబం నీ కెంతో అపరాధంచేశాం. నువ్వు మా అపరాధాన్ని క్షమిస్తావా? ... క్షమిస్తావా?" అంటూ దీనంగా ప్రార్థించింది బాలెంతరాలు.

"క్షమించడానికేముంది? మీరు నిజంగా నాకు మహోపకారం చేశారు. తాత్కాలికంగా అప్పుడు నాకు అసహ్యం కలిగినా, నా యీ పరివర్తనానికి కారకులు మీరు. నేనే మీకు కృతజ్ఞురాలను."

"రత్నమ్మా! నీ వల్లా అంటే నామనస్సుకి మరీ కష్టంగా ఉంది. నిజంగా నువ్వు మహౌదార్యవంతురాలవు కనుకనే మమ్మల్ని క్షమించి మాయింటికొచ్చి మాకే పుత్రభిక్ష పెట్టేవు. మమ్మల్ని క్షమించానని నీనోటితో అన్నావా, నాకు సంతుష్టి" అని బాలెంతరాలు ప్రార్థించింది.

"నీ కాపచార మక్కర లేదు. నే నాసంగతే మరచి పోయినాను. నువ్వు కూడా మరచిపోయి ఆరోగ్యవంతురాలవు కా."

బాలెంతరాలు ఉద్రేకాన్ని ఆపుకోలేక పోయింది. మెల్లగా లేచి వెంకటరత్నమ్మను కౌగిలించుకుంది.

'అత్తగారూ! శాస్త్రులుగారి రత్తమ్మేనం డోయి.' అని కేకేసింది. ఇంటిల్లిపాదీ లోపలి కొచ్చి ఆశ్చర్యపోయారు.

*



"మెల్లగా లేచి వెంకటరత్నమ్మను కౌగలించుకుంది......"

అగ్రహారంలోని స్త్రీపురుషు లంతా సమావేశమయ్యారు. 'అపరాధ'మని చెంపలు వాయించుకున్నారు కొందరు. 'క్షమించు' అని ప్రార్థించారు కొందరు.

'మొఖం చూడగానే అనుకున్నాను సుమా' అన్నారు కొందరు తమ వివేకాన్ని తెలుపుతూ. 'అమ్మాయీ, ఎంతదానవయ్యావే' అని అభినందించారు కొందరు ముసలమ్మలు. అగ్రహారంనుంచి లేచివెళ్లినప్పటి నుండీ జరిగిన సంగతులన్నీ తెలుసుకుని సంతోషించారు.

*  *  *  *

కామావధానులు మనుమడి బాలసారి జరిగింది పదకొండోరోజున. డాక్టరు రత్నం కూడా వచ్చింది. కామావధానులు సంతోషంకొద్దీ వైద్యురాలికి నూటపదార్లు వెండి పళ్లెంలో పోసి అందిచ్చాడు.

వెంకటరత్నమ్మ ఆ పళ్లెంలో మరొక బంగారంగొలుసేసి పిల్లవాడికి కట్నం చదివించింది.

*  *  *

రామశాస్త్రులుగారి పాటిదిబ్బమీద కొద్దిరోజులకే చిన్న బంగాళా లేచింది. అందులో బాలికల కొక పాఠశాల, ఉచిత వైద్యాలయం సాగుతున్నాయి. దాని బాధ్యతంతా డాక్టరు రత్నంగారిదే. వారానికొక్కరోజు వచ్చి వెళుతుంది. దిష్టిదేవమ్మ అని ఒకప్పుడు పేరుబడ్డ ఆ గడ్డలోనే 'వెంకటరత్నమ్మ దృష్టిపడితేనే చాలు సంజీవిలాంటి' దని చెప్పుకుంటున్నారు జనం.



ఆ కనులముందేను
నా కనులముందతడు
మా కిరువురకు నడుమ - మాయగోడ!
అటు నన్ను నడువనీ
దిటు వాని రానీదు,-
కిటికీయొకటె దిక్కు!
హృదయాల విడదీయు నీ రాతిగోడలా!
ఇదిలీలయట తలప నే రాతిగుండెకో!

తొంగిచూచాడతడు,
పొంగిపోయెను మనసు,
వంగి నిలిచాడతడు
క్రుంగిపోయెను ప్రాణి
చూపు లొక్కటిగాగ
సుడితిరిగిపోయాయి
చూపుతేనెలపూలు
చేపినవి కన్నీరు—
ఏ కాలకర్మమో, యేమాయమర్మమో?
మా కిరువురకు సడ్డమై నిలిచె నీ గోడ!
జగమేలు ఆ రాజె
పగబూనె మామీద

రగిలిమండెడుగుండె
దిగులెట్టులచల్లారు
దేశకాలాలు విడ
దీసియెరుగవు మమ్ము
లేశమైనను లేదు
వాసి మా కిరువురకు
ఏ గోడు నెరుగని యేకవస్తువుమేము,
యీ గోడయే మమ్ము భాగించె రెండుగా.

సగమునావంతునా
సగమతడు కొనిపోయె
సగమతనిదే యతని
సగము నేగైకొంటి
ఇరువురము దొంగలమె
యిరువురిది నేరమే,
నను పైన నుంచుటిది
న్యాయమా? ఓ రాజ!
విడకోసి మానడుమ ముసివేయుటెందులకు?
విడిఖైదు కాదె నను విడచి బంధించుటలు?
ఈగోడచాటు లీలాగు నే నిలచునా?
ఈగోలలో హృదయరాగాలు మొలచునా?

# మాఘకవి - వైద్యశాస్త్రము

శ్రీ. న. చ. వరదాచార్యులు

మాఘకావ్యం అనే పేరుతో ప్రసిద్ధమై వున్న "శిశుపాలవధం" అనేకావ్యాన్ని మాఘకవి రచించాడు. ఇతనిని పరిపూర్ణప్రజ్ఞైన కవిఅనీ, బహుశాస్త్రనిష్ణాతుడనీ, రసబ్రహ్మోపాసకుడనీ అభిరూపశేఖరులందరూ స్తుతించారు.

"మాఘేనేవచ మాఘేన కంపః కస్య న జాయతే."

"మాఘేన విఘ్నితోత్సాహా నోత్సహంతే పదక్రమే, స్మరంతో భారవే రేవ కవయః కపయో యథా."

"మురారిపదభక్తిశ్చే త్తదా మాఘే రతిం కురు."

"ఉపమా కాళిదాసస్య భారవే రర్థగౌరవమ్, దండినః పదలాలిత్యం మాఘే సంతి త్రయో గుణాః."

"తావ ద్భా భారవే ర్భాతి యావ న్మాఘస్య నోదయః."

ఇవి ఆస్తుతుల్లో కొన్ని. కవినిగురించిన ప్రశంస చాగానే అత నెప్పటివాడు అనే జిజ్ఞాసకూడా వెంటనే కలుగుతుంది.

ఐతిహాసికుడైన Prof. Jacobi యిలా రాస్తున్నాడు. "We therefore cannot place Magha later than about the middle of the sixth century" సంస్కృత కవులు చాలామందితో బాటు యితనికాలమూ వివాదగ్రస్తంగానే వుంది. భోజచరిత్ర, ప్రబంధచింతామణి, ప్రభావకచరితం అనే మూడుగ్రంథాల్లోనూ యితని చరిత్ర అభివర్ణితమైయున్నా వాటికి కాలనిర్ణయం విషయంలో ప్రామాణ్యం లేదని చరిత్రజ్ఞుల ఆశయం. కాలనిర్ణయంకోసంకా దీవ్యాసం.

ఈకవి రచించింది "శిశుపాలవధం" వకటే కనబడుతూంది. ఆకావ్యంలో అక్కడక్కడ కనబడే వైద్యప్రసంగంకల శ్లోకాలను పరిశీలించి చూస్తే మాఘకవికి వైద్యశాస్త్రంలో కూలంకషమైన ప్రజ్ఞ వున్నట్టు వ్యక్తమౌతుంది. ప్రకృతం యీవ్యాసంలో అతని వైద్యశాస్త్రపరిచయాన్ని అట్టిశ్లోకాల వివరణ ద్వారా తెలియజేస్తూ కొన్నిటి వ్యాఖ్యానాల్లో మల్లినాథసూరి పడిన పొరబాట్లనుకూడా చెబుతాను.

ఈకావ్యంలో వైద్యశాస్త్రప్రసంగంకల శ్లోకాలు మొత్తం పదిఉన్నాయి. వాటిల్లో అయిదు రెండోసర్గలోనూ, ౧౨, ౧౪, ౧౯, ౧౮, ౨౦ సర్గలలో ఒక్కొకటిన్నీ వున్నాయి. క్రమంగా వాటిని వివరిస్తున్నాను.

౧. చతుర్థోపాయసాధ్యేతు
రిపౌ సాంత్వ మపక్రియా,
స్వేద్య మామజ్వరం ప్రాజ్ఞః
కోఽంభసా పరిషించతి?

శిశు-౨-౫౪.

దండోపాయ సాధ్యుడైన శత్రువువిషయంలో సామోపాయం అపకారమే. స్వేదనార్హమైన ఆమజ్వరాన్ని ఏ ప్రాజ్ఞుడు నీటిచే పరిషేకం చేస్తాడు అని తాత్పర్యం. ఇందులో ఔపమ్యమూలకమైన దృష్టాంతాలంకారం వుందని వ్యాఖ్యాతయే వ్రాశాడు.

ఇక్కడ కవి వైద్యశాస్త్రంలోని చమత్కారమైన విషయాన్ని దృష్టాంతీకరించాడు. శత్రువును స్వాధీనపరుచుకోడానికి సాంత్వం యెలాగంటి వుపాయమో దండమూ అలాగే ఒక వుపాయం. కాని ప్రస్తుతంలో ఆశత్రువు సాంత్వానికి లొంగక పోవచ్చు. చతుర్థోపాయానికి తప్పక సాధ్యుడౌతాడు. అదేవిధంగా జ్వరాన్ని సాధించడానికి స్వేదనం ఒక ఉపాయమైనట్లు అభ్యంగపరిషేకం ఎక్కడైనా వుపాయమౌతుందా? కాకపోతే మరి బింబ ప్రతిబింబ భావం పూర్ణంగా నిర్వహించబడినట్లా? ఆబాధ్యత వ్యాఖ్యాతకు వుంటుంది. అయితే వ్యాఖ్యాత యేమంటున్నాడో చూడండి. "జ్వరిణస్త్వామస్య స్నేకవ ప్రవృద్ధస్య సాంత్వ ముద్ధతకరం స్యాత్" అన్నాడు. అనగా అతనిఉద్దేశంలో అభ్యస్నేకానికి ఉపాయత్వం లేశమాత్రమైనా లేదు. మరి అలాఅయితే సాంత్వానికి దృష్టాంతంగా అభ్యస్నేకం నిలవగలుగుతుందా? మరి యిక్కడ కవి పొరపాటుపడ్డాడా? వ్యాఖ్యాత వివరించటంలో పొరబడ్డాడా?

చెబుతున్నా. కవి పొరపాటు పడలేదు. వ్యాఖ్యాతదే పొరపాటు. సామాన్యంగా శత్రువును సాధించడానికి సాంత్వం ఎట్టి ఉపాయమో, దండమూ అంతేగదా. అయితే ఆ ఉపాయాల్లో శత్రువుయొక్క ఫలానాస్థితిలో ఫలానాఉపాయం కార్యకారి అవుతుంది. అదే స్థితిలో మరొకటి అపాయకారి కూడాను. అలాగే, సామాన్యంగా జ్వరాన్ని సాధించడానికి చెప్పిన వుపాయాల్లో అభ్యస్నేకమూ వుంది, స్వేదనమూ వుంది. అయితే ఆజ్వరం దాహజ్వరంగా వున్నస్థితిలో సలిలసేకం ఒక ఉపాయం.

అందుకు శాస్త్రం. "మధ్వారనాలక్షీర దధిఘృత సలిలసేకావగాహాశ్చ సద్యోదాహజ్వరం శమయంతి శీతస్పర్శత్వాదితి."

౨౫౮, చర. చికి. అ. 3.

అదేజ్వరం ఆమస్థితిలో ఉన్నప్పుడు—

"లంఘనం స్వేదనం కాలో యవాగ్వస్తిక్తకో రసః, పాచనా న్యవిపక్వానాం దోషాణాం తరుణే జ్వరే."

౧౩౬, చ. చి. అ. 3.

అని స్వేదనాన్ని ఉపాయంగా చెప్పాడు. ఒకప్పుడు ఉపాయంగా వుండిన అభ్యస్నేకం యిలాగంటి సామస్థితిలో అపాయజనకం.

"నవజ్వరే దివాస్వప్నస్నానాభ్యంగాన్న మైథునమ్, క్రోధప్రవాత వ్యాయామ కషాయాంశ్చ వివర్జయేత్."

౧౫౭, చ. చి. అ. 3.

అని శాస్త్రకారుడు చెబుతున్నాడు.

కవిఉద్దేశం ఈరీతిగావుంది. అంచేత బింబ ప్రతిబింబభావం అవ్యాహతంగా నిలిచింది.

ఇలాంటి సందర్భంలో వ్యాఖ్యాత యీసమ జాయిష్ చెప్పి బింబ ప్రతి బింబ భావాన్ని స్థాపించడం పోయి "జ్వరితుడికి అమ్భస్సేకం లాగు క్రుద్ధుడికి సాంత్వం ఉద్దీపకం" అని రాస్తూ అమ్భస్సేకాన్ని సుతరామూ ఉపాయకోటిలోంచి కొట్టేస్తున్నాడు. దాంతో బింబప్రతిబింబత విధ్వస్తమైపోయింది. మరిన్నీ యిక్కడ జ్వరితుడికీ, క్రుద్ధుడికీ ప్రతియోగిత చూపించరాదు. జ్వరమూ, శత్రువూ ప్రతియోగులు. జ్వరంయొక్క ఆమత్వం; శత్రువుయొక్క క్రుద్ధత్వమూ జ్వరం తాలూకు దాహత్వం, శత్రువు తాలూకు సాంత్వన యోగ్యతా స్వేదనమూ, చతుర్థోపాయమూ అమ్భస్సేకము, సాంత్వమూ ఆమజ్వరేఅమ్భస్సేకానర్హాత, క్రుద్ధ శత్రౌ సాంత్వానర్హాతా నున్నూ ప్రతియోగులు. ఇప్పుడు తెలుస్తుంది. "జ్వరితస్యామ్భస్సేకవత్ క్రుద్ధస్య సాంత్వముద్దీపకరం స్యాత్" అన్న వాక్యంలో జ్వరితుణ్ణి క్రుద్ధుణ్ణి ప్రతియోగులుగా నిలుపడం తప్పేకాదు.

౭. కృతాపచారోపి పరైః రనాపిష్కృతవిక్రియః, అసాధ్యః కురుతే కోపం ప్రాప్తే కాలే గదో యథా. ౨-౮౪.

ఇందులో వైద్యశాస్త్రమందలి సామాన్యసూత్రం అవలంబంగా స్వీకరింపబడింది. ఏదంటే—

"తత్రస్థాశ్చ విలమ్బేరన్ భూయో హేతు ప్రతీక్షిణః, తే కాలాదిబలం లబ్ధ్వా కుప్యంత్యన్యాశ్రయేష్వపి."

౧౮, అష్టాం. సూత్రము అ. ౧౩.

"తత్రస్థాః కోష్ఠస్థాశ్చ దోషాః" అని అరుణదత్తుని సర్వాంగ సుందర వ్యాఖ్య. దోషాలు శరీరంలో నిగూఢాలైయుండిన్నీ కాలబలం దొరికేవరకూ నిరీక్షిస్తాయని శాస్త్రకారుడు చెప్పిన విషయాన్నే మృదులంగా కావ్యముఖాన సహృదయులకు నివేదిస్తున్నాడు మాఘుకవి.

౩ షాడ్గుణ్య ముపయుఞ్జత శక్త్యపేక్షం రసాయనమ్, భవ న్త్యస్యైవ మఙ్గాని

[illegible]

ఇందులో ముఖ్యపదాలన్నీ శ్లేషించినవి. సంధి విగ్రహయానాసనద్వైధీభావ సమాశ్రయాలనే ఆరుగుణాలూ సక్రమంగా శీలించిన విజిగీషునకు ప్రభు మంత్రోత్సాహ శక్తులను కలిగించి "స్వామ్యమాత్య సుహృత్కోశ రాష్ట్ర దుర్గబలానిచ, రాజ్యాంగాని" అనే సప్తాంగాలను స్థిరములుగాను, బలిష్ఠములుగానూ చేస్తవి అని రాజకీయపక్షం. వైద్య శాస్త్ర పక్షంలో, బలంకావలసినవాడు షాడ్గుణ్యరసాయనం పుచ్చుగుంటే అవయవాలన్నీ బలిష్ఠములూ, స్థిరములూ అవుతవి. అని చెప్పుకోవాలి.

అందుకు శాస్త్రం—

"హింగులోత్థం రసం భాగం షడ్భాగం శుకగంధకమ్, కాచకుప్యాం వినిక్షిప్య వాలుకాయంత్రపాచితమ్."

బంధూకపుష్పారుణభాస్వరస్య.......
.........అస్యహల్లసక్రమసేవనేన.

అపహరతి రోగబృందం ధృఢయతి కాయం మహద్బలం కురుతే, శుక్రస్య శతానిచ సూతః మాఘుణ్యాఖ్యో రసః పుంసామ్."

౮. స్థానే శమవతాం శక్త్యా వ్యాయామే వృద్ధి రంగినామ్, అయథా‌బల మారంభో నిదానం క్షయసంపదః. ౨-౧౮.

తాహతు ననుసరించి వ్యవహరించుతూ వున్న విజిగీషునకు వృద్ధియే కలుగుతుంది. తాహతును మించి వ్యాపారం చేసేవారికి క్షీణతా, హానీ కలుగుతవి. అదేరీతిగా తాహతునుబట్టి వ్యాయామం చేసేవారికి

"లాఘువం కర్మసామర్థ్యం దీప్తోఽగ్ని ర్మేదసః క్షయః, విభక్త ఘునగాత్రత్వం వ్యాయామా దుపజాయతే."

అన్నట్టుగా సత్ఫలాలు కలుగుతవి. దాన్నే శక్తికి మించి చరించితే,

"తృష్ణాక్షయః ప్రతమకో రక్త పిత్తం శ్రమః క్లమః, అతివ్యాయామతః కాసో జ్వర శ్ఛర్దిశ్చ జాయతే."

అన్నట్టుగా దుష్ఫలాలు కలుగుతవి. అని వైద్యశాస్త్రోక్తవిషయాలను స్ఫురింపచేశాడు కవి చరకాచార్యుడు రాజయక్ష్మనిదానప్రకరణంలో చెప్పిన,

"అయథాబల మారమ్భం
వేగసంధారణక్షయమ్,

యక్ష్మణః కారణం విద్యాత్
......................."

అనే వైద్యశ్లోకమే మాఘకవికి యీ శ్లోకం రాయడానికి వరవడిగా యేర్పడిందని చెప్పవచ్చును.

అయితే యిక్కడ వ్యాఖ్యాత వ్యాయామంయొక్క సుగుణాలు, దాని అతియోగం వల్ల కలిగే అనర్థాలూ కొంచెమైనా సూచించితే బాగుండేది. మరి యేం కారణమో మౌనం భజించాడు.

౫. మా వేద యదసౌ వేకో
జేతవ్య శ్చేదరాడితి,
రాజయక్ష్మేవ రోగాణాం
సమూహః స నుహీభృతాన్.
౨. ౯౬.

శిశుపాలు డొకడే జేతవ్యు డిక్కడున్నాడని తలచవద్దు. రాజయక్ష్మ రోగాలకి యెలాగ సమూహప్రాయమో అలాగ వాడొకడు అంటే కొంతమంది దుష్టులసమూహమని తెలుసుకోవలిసింది. అని చక్కటిపోలిక చూపించాడు కవి. ఇక్కడ వ్యాఖ్యాత,

"యథాహ వాగ్భటః—
అనేక రోగానుగతో బహురోగ పురస్సరః, రాజయక్ష్మా క్షయ శ్శోషో రోగరాడితి చ స్మృతః. నక్షత్రాణాం ద్విజానాంచ రాజాఽభూద్యదయం పురా, యచ్చ రాజాచ యక్ష్మాసౌ రాజయక్ష్మా తతో మతః ఇతి."
అని శాస్త్రప్రమాణాన్ని చూపుతున్నాడు.

పాపం, ఈమాత్రమింతకుముందుచూపినశ్లోకం వ్యాఖ్యానంలో ఏలచూపలేదో? ఇక్కడశిశుపాలుణ్ణి రాజయక్ష్మతో పోల్చడం తత్సమూహానుగతత్వమాత్ర ప్రత్యాయనంకోసంగాని దుర్జయత్వోద్యోతనంకోసం కాదని సహృదయులు తెలుసుకొందురు.

పదవసర్గఆరంభంలో పద శ్లోకాలలో మధుపానవర్ణన చేయబడివుంది. అది చాలాభాగం వాగ్భటుని మదాత్యయ చికిత్సితాధ్యాయంలోని మద్యపానవిధిని వర్ణించే ఘట్టంతో పోలుతూంది.

"కృతవికసితాసితసరోజ నయన సంక్రాంతి
వర్ణిత(శ్రీ)కము, కాంతాముఖమివ సౌరభ
వ్యాప్తమధుపగణం పిబే న్మద్యమ్."

అనే వాగ్భటుని యీపద్యంలోంచే మాఘకవి,

"బింబితం భృతపరిస్ఫుతి జానన్
భాజనే జలజ మి త్యబలాయాః,
ఘ్రాతు మక్షి పతతి భ్రమరః స్మ
భ్రాంతిభాక్ భవతి క్వ వివేకః.
                                      ౧౦-౫.

అనేపద్యానికి కావలసిన సామగ్రి తెచ్చుకున్నాడంటే యింక యీతని వైద్యశాస్త్ర ప్రావీణ్యానికీ, తత్పరిచయానికీ వేరే ప్రమాణం చూపాలా?

౬. ప్రస్తాంగసంధా విగతాక్షపాటవే
రుజా నికామం వికలీకృతే రథే
ఆప్తేన తక్ష్ణా భిషజేవ తక్షణం
ప్రచక్రమే లంఘనపూర్వకః క్రమః.
                                      ౧౨-౨౫.

ఇందులో జ్వరితుడికీ, భగ్నమైన రథానికీ సమానమైన చికిత్సను శ్లేషమూలంగా ఉపదేశిస్తున్నాడు. ప్రస్తాంగసంధిత్వం, విగతాక్షపాటవత్వమున్నూ జ్వరంలో సామాన్యంగా కనపడే లక్షణాలు.

"ఆమాశయస్థో హత్వాగ్నిం సామో మార్గాన్ పిధాయ యత్, విదధాతి జ్వరం దోష స్తస్మా త్కుర్వీత లంఘనమ్."
                                      అష్టాం. చి| అ. ౧.

అని శాస్త్రికారుడుకూడా లంఘనోపదేశంతోనే చికిత్సాస్థానాన్ని ఉపక్రమించాడు.

౭. సాదితాఖిలనృపం మహాన్మహః
సంప్రతి స్వనయసంపదైవ తే,
కిం పరస్య సగుణ స్సమశ్నుతే
పథ్యవృత్తిరపి య ద్యరోగితామ్. ౧౪-౧౩.

పథ్యవర్తను డారోగ్యాన్ని పొందుతాడు. అతనికి వైద్యునితో పనిలేదు. అని యీ శ్లోకంలో చెబుతూ యీ

"నిత్యం హితాహారవిహారసేవీ
సమీక్ష్యకారీ విషయే ష్వసక్తః,
దాతా సమ స్సత్యపరః క్షమావాన్
ఆప్తోపసేవీచ భవ త్యరోగః."

అనే వైద్యసూత్రోక్తవిషయాన్నే కవి యిక్కడ స్మరించాడు.

ఉ. పురపవ శార్ఙ్గిణి సవైర మథ పున
రముం తదర్చయా, మన్యు రభజ దవగాఢ
తరః సమదోషకాల ఇవ దేహినం జ్వరః.
౧౫-౨.

మొదలే కృష్ణునితో విరోధం కలిగి వున్నాడు. దానికితోడు సభలో అతనికి అగ్రపూజ చెయ్యడంచేత శిశుపాలునికి అతితీవ్రమయిన కోపం వచ్చేసింది. ఎలాగంటే, దేహికి సమదోషకాలమైన జ్వరం గదా ఎంతతీవ్రంగా వస్తుందో అలాగ్గానూ అని తాత్పర్యం.

ఇందులో కవి వైద్యశాస్త్రంలో తనకు గల పరిచయాన్ని గుప్పించేశాడు. పాపం! అది తెలియక వ్యాఖ్యాత మల్లినాథుడు ప్రాకృతజనుడిలాగు యత్నించిస్తూ రాసి పూరుకున్నాడు. ఎక్కడో చిత్తగించారా? "సమదోషకాలః జ్వరఇవ" అనే మూలానికి వ్యాఖ్యానం ఏమనివ్రాశాడు? సమా తులితా దోషాః పథ్యసేవాకాలః కర్మపాకశ్చ యస్య స జ్వర ఇవ" అని వ్రాశాడు. ఇంతేనా వ్రాయ వలసింది?

"న తచ్ఛాస్త్రం న తచ్ఛిల్పం
న సా విద్యా న సా కళా,
జాయతే యన్న కావ్యాఙ్గ
మహో భారో మహాన్ కవేః."

అని పెద్దలు చెబుతున్నారు. కవి అన్నవాడు అన్నిశాస్త్రములనూ, శిల్పములనూ, విద్యలనూ, కళలనూ తెలుసుకొని వాటిని కావ్యాంగాలుగా కల్పించాలె. అంతటితో కవి కృతార్థుడౌతాడా? దాన్ని తెలుసుకుని వివరించగల వ్యాఖ్యాత లభించాలె. హర్షించే లోకంకూడా ఉండాలె.

ప్రకృతం పరిశీలించుదాం. 'సమదోషకాలః' అంటే సరియైన అర్థం ఏమంటే—

"వాయుః పిత్తం కఫశ్చేతి త్రయో దోషాః సమాసతః."

అని వాతపిత్తకఫములకు దోషములని ఒక శాస్త్రీయసంజ్ఞను కల్పించారు వైద్యశాస్త్ర ప్రవర్తకులు. కాబట్టి దోషం అంటే వాతపిత్త కఫాలలో ఏదోఒకటి అని అర్థం. ఇంక కాలం అంటే పూర్వోక్తదోషాల ఉపచయాపచయములకు హేతువు అవుతూవుండే శీతోష్ణస్థితులు గల

"శిశిరోఽథ వసంతశ్చ గ్రీష్మవర్షా శరద్ధిమాః."

అని పరిగణించబడ్డ ఋతువులని అర్థం. ఈ దోషములకు

"చయప్రకోపప్రశమా
వాయోర్గ్రీష్మాదిషు త్రిషు,
వర్షాదిషుతు పిత్తస్య
శ్లేష్మణః శిశిరాదిషు."

అని సంగ్రహంగా చయప్రకోప ప్రశమావస్థలు చెప్పబడ్డాయి. కాబట్టి ఏ ఋతువులో ప్రకృత్యా ఏ దోషం ప్రకోపించుతుందో తత్ప్రకోపంవల్ల ఆఋతువులో జ్వరంవస్తే దాన్ని సమదోషకాలజ్వరం అంటారు. ఈ అర్థాన్ని మనం

"విషమప్రకృతి కాలాన్న దోష దూష్యాది సంగమే, విషసంకట ముద్దిష్టం శత స్యైకోఽత్ర జీవతి."

అనేశ్లోకం తాలూకు వ్యాఖ్యానాన్ని బట్టి అనుసరించవలె. కాగా, వాతప్రకోప కాలం అయిన వర్షఋతువులో వాతప్రకోపం కలి జ్వరం వస్తే దాన్ని సమదోష కాలజ్వరం అంటారు. అది అవగాఢతరంగా వుంటుంది.

కాబట్టి యిప్పుడు "దోష అపథ్య సేవా కాల కర్మవిపాకశ్చ" అనేవ్యాఖ్యానం ఎంత వరకూ శాస్త్రసమ్మతంగా వుంది అన్నసంగతి చదువరులకే తెలుస్తుంది. వ్యాకరణ శాస్త్రంలో ఉండే "ఉపోత్తమమ్" "సంప్రసారణమ్" అనే సంజ్ఞావాచకపదాలకుప్రాకృతార్థం చెబితే అర్థంగా ఉంటుందా?

ఇక్కడ మరోచమత్కారం వుంది. శిశుపాలుడికి వచ్చిన కోపం బాహ్యదూషం వల్ల చాలాతీవ్రంగా కనబడుతుందేకాని "పెదవానికోపం పెదవులచేటు" అన్నట్లు అది కార్యకారి కాదన్న సంగతికూడా యీ ఉపమానాన్నిబట్టి తెలుస్తూంది. ఎలాగంటే— రోగం అసాధ్యం అనిపించుకున్నప్పుడు అది స్వకార్యకరణదక్షం అవుతుంది. అంటే రోగిని చంపుతుందన్నమాట. కాని, యీసమదోష కాలజ్వరం ఉంటే యిది ఎంతతీవ్రంగా వున్నా సుఖసాధ్యమే. ఆ సంగతినే "జ్వరే తుల్యర్తు దోషత్వం ప్రమేహే తుల్యదూష్యతా, రక్తగుల్మే పురాణత్వం సుఖసాధ్యత్వహేతవః" అని శాస్త్రకారుడు అంటున్నాడు. కనుక ఈజ్వరం తీవ్రమూ, సుసాధ్యమున్నూ కాబట్టి శిశుపాలుని కోపంకూడా యిలాంటిదే అని అర్థం. శాస్త్రమర్యాదను ఎట్టి సదవసరంలో వాడుకున్నాడో చూడండి.

౯. విద్విషో ద్విషు రువ్యక్ష్య తథా ప్యాసన్నిరేనసః, అనుచ్యమపి రోగఘ్నం విసర్గాదేవ భేషజమ్. ౯-౮౭.

శత్రువులు కృష్ణుని ద్వేషభావంతో చూసినా పాపరహితులు అవుతూనేఉన్నారు. ఔషధం అరుచికరంగా వున్నా స్వభావతః అది రోగఘ్నం అవుతూనే వుంటుంది. అని లోకంలో బహుళంగా కనబడే ఔషధాల రుచినిబట్టి, గుణాలనిబట్టి రాస్తున్నాడు.

౧౦. ఇతి నరపతిరస్త్రం యద్య దావిశ్చకార ప్రకుపిత ఇవ రోగః క్షిప్రకారీ వికారమ్, భిషగివ గురుదోషచ్ఛేదినోపక్రమేణ క్రమవిదథ మురారిః ప్రత్యహాం స్తత్తదాశు. ౨౦-౭౬.

ఈశ్లోకంలో శిశుపాలుణ్ని క్షిప్రకారి అగు రోగంతో పోల్చాడు. రోగం ప్రకోపించి వికారాల్ని కలిగిస్తూన్నట్లు శిశుపాలుడు క్రుద్ధుడై ఒక్కోఅస్త్రం ప్రయోగిస్తూంటే సమర్థుడైన వైద్యుడిలాగ కృష్ణుడు దాన్నల్లా ప్రతిహతం చేస్తున్నాడు అని తాత్పర్యం. ఈ శ్లోకం లోనూ లోకవృత్తమే మూలంగా గ్రహించబడింది. శాస్త్రీయమైన క్రమాన్ననుసరించి

చికిత్సచేస్తూన్న ఒకవైద్యుని ఆచరణ ఇందు లో వర్ణించబడింది.

అయితే దీని వ్యాఖ్యానంలోనూ మల్లి నాథుడు వైద్య శాస్త్ర సంప్రదాయాల్ని గుర్తించలేకపోయినట్టు కనబడుతూంది.

"క్షిప్రకారీ" అన్నపదానికి వ్యాఖ్యానం చూడండి. "క్షిప్రం కరోతీతి క్షిప్రకారీ శీఘ్రప్రయోక్తా అన్యత్ర వికారకారీ" అని రాశాడు. అన్యత్ర అంటే రోగపక్షం. వైద్య శాస్త్రాల్లో యీపదం ఆశుకారీ, శీఘ్రకారీ యిత్యాది రూపాలతో అనేక పర్యాయాలు వాడబడివుంది. కాని వ్యాఖ్యాత యెక్కడా యిలాంటిఅర్థం వ్రాయలేదు.

"దండకాలసకంనామ త స్త్యజే దాశు కారిణమ్." అష్టాం. ౬౯ పుట.

"ఆశుకారిణమ్ ఆశు శీఘ్రం స్వకర్మ మారణం కరోతీ త్యాశుకారీ" అరుణదత్తుని సర్వాంగసుందర వ్యాఖ్య "ఆశుకారీ యతః కాసః."

వ్యా. "ఆశుకారీ క్షిప్రం మారయతి" అష్టాం. ౨౫౬ పుట.

"సర్వేపి రోగా నాశాయ నత్వేవం శీఘ్రకారిణః."

వ్యా."నపున రేవం శీఘ్రవినాశకారిణః." అష్టాం. ౨౬౦ పుట.

"చికిత్సే దామయం ఘోరం తం శీఘ్రం శీఘ్రకారిణమ్."

వ్యా. "శీఘ్రకారిణ మాశు వ్యాఘాత కారిణమ్." అష్టాం. ౨౬౪ పుట.

ఇలావుంటే సంప్రదాయం ఈవ్యాఖ్యాత కాఅర్థం ఎలావచ్చిందో? ఇతని వ్యాఖ్యానాన్ని బట్టి రోగము స్వతఃవికారకారి అయినప్పుడు యింక ప్రకుపితమై వికారమును చేయడం ఎందుకు? కనుక ఆఅర్థం అసంగతం. అది క్షిప్రకారి అయినప్పుడు ప్రకుపితమైందా అంటే ఇంక అనేక వికారాల్ని కలిగించడం న్యాయం. అంచేత ఈఅర్థం సుసంగతం.

"గురుదోషచ్ఛేదినా" అన్నపదాన్ని వ్యాఖ్యానిస్తూ — ద్వ్యర్థిస్థలం అయివున్నం దున వేరువేరు స్పష్టమైన పదాలతో రెండు అర్థాలూ రాయావలసింది. అలా రాయక ఉభయపక్షాల్లోనూ "గురుదోష చ్ఛేదినా గురుదోషప్రతిఘాతకేన దోషనివర్తకేనచ" అని మూలంలోవున్న పదంతోనే వ్యాఖ్యా నించి తన సంప్రదాయార్థానభిజ్ఞతను వెల్ల డించుకున్నాడు.

మాఘకవి వైద్యశాస్త్ర సంప్రదాయా లను ఎరిగినవాడు; సమర్థుడూనూ.

---



అంబర్టో, ఇటలీ యువరాజు



అస్ఫావో వాసిను, అబిసీనియా యువరాజు




యకొనెను, అబిసీనియా చక్రవర్తి కుమారుడు, బాలభట సంఘసంస్థాపకుడు




రాసు సయాము (నడుమ) టైగ్రిరాజు అబిసీనియా సర్వసేనాధిపతి

# యుద్ధము – ఆంక్షల విధానము

(War and Sanctions procedure)

చల్లపల్లి అప్పారావు

జర్మనీయుద్ధ మయినది లగాయితు యుద్ధమనిన తోడనే ప్రతి దేశము వారికిని గుండెలు దద్దరిల్లినాయి. ఈనాటికి కడచిన సంగ్రామములలో పాల్గొనిన దేశములవారిని మాత్రమే కాక దూరముగానుండి సాక్షిభూతులై నిరీక్షించుచుండిన ఇతర దేశములవారినికూడ నావహించెను. ఇందుకు కారణమేమన, యుద్ధములోనికి దూకి హోరాహోరి పోరుసలిపిన శత్రుపక్షములవారితో పాటుగ బయటనున్న తదితర దేశముల వారును యుద్ధమువలని యపారఘోరనష్టముల ననుభవింపవలసివచ్చుటయే. కావుననే యుద్ధానంతర ప్రబోధమంతయు యుద్ధనివారణమును, శాంతిభూషణమునై యపారప్రభంజనమున వ్యాప్తిజెందినది. జరిగిన యుద్ధము వలన తారుమారయిన పరిస్థితు లింకను దిద్దుపాటు కాక యనేక ప్రభుత్వములవారును, అనేక శాస్త్రజ్ఞులును, అనేక వర్తకవ్యాపారస్థులును తికమకలై కొట్టుకొనుచుండుట మనమెల్ల రెఱింగిన విషయమే.

పారమార్థికదృష్టిని విచారించినయెడల యుద్ధము సర్వవిధముల వర్జనీయమే. శాంతిసందేశమును చాటుచు స్వార్థత్యాగపరాయణుడై అసహాయోద్యమ సూత్రపద్ధతికి ఆవిర్భావకుడైన మహాత్మగాంధివంటి తపస్సంపన్నులు ప్రపంచమునందలి దేశములన్నింటికి నాయకులై ప్రజాపరిపాలనమును నిర్వర్తించినచో భూలోకమున యుద్ధము కుందేటికొమ్మువంటిది యనవచ్చును. కాని యిహలోకవాంఛాబద్ధులై ధనరాజ్య కాంక్షలు కలిగిన సామాన్యప్రజాభూపాలురు ప్రపంచమున ప్రబలునంతవరకు యుద్ధము లాపుట యెవరితరము? కాని దొంగతనములో నిజాయితి అన్నట్లు, యుద్ధము చేయుటలో ధర్మయుద్ధమనియు, అధర్మయుద్ధమనియు లౌకిక సంప్రదాయములనుబట్టి విచక్షణ చేయవలసియున్నది. లౌకికధర్మసంస్థాపనకొరకు ఒకప్పుడు యుద్ధము కర్తవ్యమే కావచ్చును. అయినచో అన్ని యుద్ధములు ధర్మప్రతిపాదితములని చెప్పుటకు వీలులేదు. చాలవఱకు మన స్థూలదృష్టికే అక్రమములుగ తోచుచుండును. అట్టివాటిని మానవశక్తి వినియోగించి నివారించుట తప్పులోనిది కాదు. ఇందులో నింకొక రహస్యము కూడ కలదు. యుద్ధమునకు ప్రయోజనమేమని యించుక మనము విచారించినచో మొదటిది రాజ్య సంపాదనమనియు, రెండవది విజయాభిలాష యనియు తేలక మానదు. వానిలో ప్రథమప్రయోజనమే యిప్పటి దేశాధీశుల మానసక్షేత్రములలో నాటుకొనియున్నది. మనుజునకు ప్రతివానికి సహజమైన గుణము "ఆశ." ఇది దేశకాలపాత్రముల ననుసరించి పలువిధముల పరివర్తనమందవచ్చునుగాని మూలస్వరూపముమాత్ర మొక్కటే. అటువలెనే దేశాధీశులకును, చక్రవర్తులకును మఱింత సామ్రాజ్యము నార్జించవలెనను "ఆశ" మెండు. అయితే మనుజుడు దెబ్బలాడి తన ప్రక్క భూస్వామి పొలము నాక్రమించినచో నేర మగును. అదేమాదిరిగ నొక దేశములోని ప్రజ లందరు సైనికులై పరాయి ముపై దండెత్తి లక్షలకొలది హత్యలుకావించి దేశము సంపాదించుట గౌరవమును, రాజనీతియు నగును. అట్టి హత్యలుకావించినవారికి శిక్షలులేవు. పయిగ వారిని రాజాదరపాత్రులుగను, ఉన్నతపదాధికారులుగను నొనర్చుట లౌకికాచార మయిపోయినది. అందువలన స్వార్థపరాయణత్వమును, పరరాజ్యసంపాదనమును సామాన్యధర్మములుగ కలిగిన దేశములలో నొండొరులకు యుద్ధము సంప్రాప్తమయినయెడల అట్టిదానిని పరాయి పెద్ద మనుష్యులెవరైనారు నివారించుటకు కడంగుట డంబాచారమును, లోకవంచనముకాని వేరొండుకాదు. ఒకవేళ నేకారణమువల్లనైనను యుద్ధమాపగల్గిరేని గెల్చినవారందరు, దొంగలు దొంగలు కలసి వూళ్లుపంచుకొనిన

ప్లనునురు. ఇట్టి సందర్భములలో యుద్ధములాపుటకు సమ్మెకట్టు లేక ఇలివిధాన మెంతవఱకు సమంజసమో, దానిస్వరూప మెట్టిదో, దానిసామర్థ్యమెంతవఱకో, అవి ప్రయోగించుటకుముందు సేకరింపవలసిన పరికర సామగ్రు లెవ్వియో విచారింతము.

జర్మనీయుద్ధ మయినతరువాత భావిప్రపంచ శాంతి నుద్దేశించి అన్నిదేశములవారును యుద్ధనివారణార్థమై యొకగొప్పసంస్థ నెలకొల్పవలెనని మేధావి యగు అప్పటిఅమెరికా అధ్యక్షుడగు ఉడ్రోవిల్సను మహాశయుని యనుమతిచొప్పున "నానాజాతిసమితి" యను నొక యంతర్జాతీయసంస్థను సృష్టించిరి. ఆసమితిలో చేరిన సభ్యులందఱు కలసి యొక ఖరారునామా వ్రాసి సంతకములుచేసిరి. ఆయొడంబడికనే League Covenant అందురు. ఆ 'సమితి ఖరారు' లో తక్కినవరకులు మన కప్రస్తుతము లగుటచే నిక్కడ దానిలోని ౧౬ వ సూత్రము (Article) ను గుఱించియే ముచ్చటించవలసియున్నది. "ఈ ఆంక్షల విధివిధాన" మంతయు పై సూత్రమునందే సూచింపబడినది. సమితి సభ్యులను నేరెండుదేశములకయినను తగాదాలు వచ్చి యొకరితోనొకరికి యుద్ధముచేయు పరిస్థితి సంభవించి నపుడు సదరుహీలు ఇద్దరును సమితివారికి పంచాయితీ తీర్పుకయి వారి తగాదాహంశములను నివేదించుకొనుటయు, సమితితీర్పునుశిరసావహించి నడుచుకొనుటయు, తీర్పువచ్చువఱకు ఏపార్టీవారును యుద్ధములోనికి దూరబడకుండుటయు, ఒకవేళ సమితివారితీర్పు నంగీకరించక ధిక్కరించిన దేశమును, మూడునెలల గడువిచ్చి, దోషిగా నిర్ణయించి, సమితివారు ఆదేశముపయి ఆంక్షలు విధించి అట్టిదేశమునకు యెగుమతులు పంపకయు, అట్టివారి దిగుమతులు కొనకయు, వారికి యెట్టియుద్ధ సామగ్రులు సప్లయి చేయకయు, అవసరమయినచో ప్రతియుద్ధమొనర్చియు సర్వవిధముల బహిష్కారము కావించి ఆదేశమును యుద్ధముచేయకుండ నిషేధించుటయే సదరు సూత్రముయొక్క ముఖ్యసారాంశము.

పూర్వపు ప్రాపంచిక మహాయుద్ధచరిత్రలో నిట్టి సమితిసంస్థ యనునది యెక్కడ కానరాదు. యుద్ధచరిత్రలో నిదియొక నూతనశకప్రారంభమని చెప్పవచ్చును. సామదాన భేదోపాయములచే యుద్ధము నివారించు తరుణ మాసన్నమయినది. ఇటలీ అబిసీనియా యుద్ధమును లీగుసంఘమువా రెంతవఱకు సమష్టిబాధ్యత వహించి నివారింపగలుగుదురో యని సభ్యేతరులయిన దేశముల వారందరు యెదురుచూచుచున్నారు.

ఆంక్షయనగా న్యాయమునకులోబడి యుండునటుల విధించు ప్రత్యేకశిక్ష యని నిర్వచింపవచ్చు. ఆంక్షలు రెండువిధములు (౧) ఆర్థికరూపమయినవి, (౨) దండన రూపమయినవి. ఇందలి రెండవతరగతి ఆంక్షలనుగుఱించి మనకంత చర్చింప నవసరము లేదు. అట్టి యాంక్షల నాచరణలో పెట్టువారును యేదోవిధమున యుద్ధముచేసినవారే యగుదురు. అదిగాక యాటువంటి ఆంక్షల నములులో పెట్టుటయే దుర్లభము. ఇక ఆర్థికరూపమయిన ఆంక్షలవలన దౌర్జన్యరహితముగా యుద్ధ మెంతవరకు నివారింపబడగలదో మనము విచారింపవలసినది.

అక్రమముగా యుద్ధమునకు సన్నద్ధమయిన దేశమునకు యుద్ధసామగ్రులు లేకుండజేయుటగాని, లేక అట్టి సామగ్రులు రణరంగమునకు చేరుమార్గముల నరికట్టుటగాని యీ'ఆంక్షల' ముఖ్యపరిపాటి. ఏ రష్యా వంటి దేశమో తప్ప యితరదేశము లేవియు స్వయం సంపూర్ణములు కావు. ఒకదేశమువా రింకొకదేశమువారిపై దేనికో యొకదానికి ఆధారపడవలసి యున్నది. ఐహికసంబంధ మున్నంతవఱకు మానవ ప్రపంచమున పరస్పరసహాయము, అనుబంధము సహజధర్మములు. కనుక ఇటలీ అబిసీనియా దేశములు రెండే యుద్ధము చేయుచున్నను దానికి సన్నాహము యావత్తు యితర దేశములవారు చేయవలసినదే. ఏలననగా అవి రెండును స్వయంసమృద్ధికలిగిన దేశములు కావు.

యుద్ధమునకు మొదట కావలసినది శస్త్రములు కనుక తుపాకులు, ఫిరంగులు మున్నగు ఆయుధములు అక్రమముగా యుద్ధములోనికి దిగిన దేశమునకు సంపకుండుట మొదటి 'ఆంక్ష.' ఆయుధములు తయారుచేయు దేశములవా రందఱుకలసి సమ్మెకట్టి, అట్టి దేశ

మునకు 'మనము ఎవ్విధమయిన శస్త్రములు ఎగుమతి చేయగూడదు' అని ప్రభుత్వశాసనమువలన గాని లేక తమంతట తాముగాని తీర్మానించుకొన్నచో యుద్ధము సాగనేరదు. ఈ 'ఆంక్ష' లోగడ బొలీవియా, పేరగ్వే (Bolivia and Paraguay)ల మధ్య జరిగిన యుద్ధ సందర్భములో ప్రయోగింపబడినది. కాని యిందులో రెండు ఇబ్బందులు గమనింపదగినవి. సమ్మెకట్టు కట్టెడు దేశములవారందరు సమితిసభ్యులయిననే కాని యీ సంఘం కొనసాగదు. ఇప్పుడు ఆయుధముల నుత్పత్తిచేయు జర్మనీ, జపాను, అమెరికా దేశములకు సమితిలో సభ్యత్వము లేదు. వారిపై సమితిసంఘము వారు వారితీర్మానములను చలాయించుటెట్లు? అంతే కాక ఆయుధములను తామే స్వయముగా తయారుచేసి కొనగలిగిన ఇటలీవంటి దేశముపయి ఆంక్షవలని ప్రయోజన మంతగా కనుపించదు. మఱియును యేదో యొకదేశము ప్రత్యేకముగా సమ్మెకట్టినంతమాత్రమున లాభము లేదు. కొనువాడింకొకని యొద్దకుపోయి కొనుట సంభవించును. అది వర్తకాచారమునకు లాహేతు పని కాదు.

యుద్ధమునకు తరువాత కావలసినవి మందు సామానులు. అవి పంపకుండుట రెండవ 'ఆంక్ష.' ఇది సరిగా జరుపగలిగినచో నిరాఘాటముగా పని చేయును. మందుసామానులకు కావలసిన వస్తువు లన్నియు అమెరికా బ్రిటిషుసామ్రాజ్యములలో యెక్కువగా దొరకును. ఈ రెండు దేశములు యేకీభవించినచో ఒక్కరష్యా తప్ప మిగత యేదేశమునైనను యుద్ధమునుండి తొలగించవచ్చును. అయితే యీసామానుల విక్రయము నిలిపివేయబడ్డదేశమున కొక్కదానికే అని శాసించిన నిరర్థకము. అది తటస్థముగానున్న యితరదేశముల వారిద్వారా తెప్పించుకొనవచ్చును. అప్పుడు యీ 'ఆంక్ష' నిష్ఫలమగును. కావున యుద్ధసమయములో సర్వేసర్వత్ర యెవరికిని మందుసామానుల నమ్మ కూడదని శాసించుటయే ఉత్తమము.

మూడవ తరగతి 'ఆంక్షలు' తినుబండారములు వగైరా పదార్థములు పంపకుండుట. అనగా యిందు మించుగ అన్నివిధములసరకులు యెగుమతి చేయకుం డుట యని అర్థము. ఇవి రెండవతరగతి ఆంక్షలవలెనే సమష్టిసహాయముతోను, సార్వత్రికముగను ఆచరింపదగి యున్నవి. ఇవి ఒకరకమైనవి.

ఇక రెండవరకము 'ఆంక్షలు' విచారింతము. అక్రమముగా యుద్ధముచేయు దేశమునకు డబ్బుపుట్టకుండా చేయుటయే యీరకము ఆంక్షల ముఖ్యాభిప్రాయము. డబ్బులేకపోయినచో కొనుటకు వస్తువు లుండినను ప్రయోజనము లేదుగదా? ఈరకపు 'ఆంక్షలకు' ప్రభుత్వసహాయ మవసరము లేదుకాని, యుద్ధ సమయములలో మాత్రము కొనకతప్పదు. ఇందు మొదటి 'ఆంక్ష' అట్టి అక్రమపుదేశమునుండి దిగుమతులు గ్రహింపకుండుట. దీనివలన వారికివచ్చేడబ్బు నష్టమగును. ఇది యొకప్పుడు రష్యాపై ప్రయోగింపబడినది. రెండవ ఆంక్ష గుండాగిరియైన దేశముయొక్క నాణెములుగాని, నోట్లుగాని చలామణి చేయకుండుట. అప్పుడు మివ్వలేనిస్థితి వాటిల్లును. తరుపరి వ్యాపారము నిలిచిపోవును. మూడవ 'ఆంక్ష' పరపతిగాని అప్పులుగాని కలుగకుండచేయుట. ఏ ఋణదాతయు యుద్ధములో దిగినదేశమునకు పెట్టుబడిపెట్టుటకు సాహసింపడు గాన దీని నంతగా మనము పాటించవలసినపని లేదు.

ఇంకొక విధమయిన 'ఆంక్ష' యుద్ధసామగ్రులు పంపబడు మార్గములయొక్క అవరోధము. దీనికి ఉదాహరణ ప్రస్తుతము ఇటలీ నౌకాదళమునకు సూయెజ్ కాలువను మూసివేయుటవంటిది. దగ్గరమార్గమున నడ్డగించినచో చుట్టుమార్గమువల్ల ననేక కష్టనష్టములు సంభవించి యుద్ధమునందు విరక్తి కలుగవచ్చును. అయితే సూయెజ్ కాలువ మూసివేయుట సామాన్యమయినపనికాదు. అది న్యాయవిరుద్ధమును, ఏర్పాటుకు భిన్నమునుకూడ అయియున్నది. ౧౮౮౮ వ సంవత్సరములో సదరు సూయెజ్ కెనాల్ కంపెనీవారి చట్టము ననుసరించి సర్వకాలసర్వావస్థలయందును అన్నిదేశముల వారికిని అది తెఱువబడియుండవలెను. అట్టిచో దాని నిప్పుడు ఇటలీనౌకలు రాకుండ మూసివేయుటకు

సాధ్యముకాదు. కాని అందరుపార్టీలవారును అంగీకరించిన మూసివేయుట జరుగునేమో కాని అట్టి యేకగ్రీవాభిప్రాయము పుట్టుటకల్ల. ఇటలీకి కుడిభుజములుగానున్న ఫ్రాంసు, జర్మనీ, టర్కీ, ఆస్ట్రియా దేశములు సదరు కంపెనీలో భాగస్వాములై యుండి ఇటలీబహిష్కార పద్ధతులకు ఒప్పుకొనెదరా? ఇదియును సాగని యుపాయమే.

ఇంతకును పైన పేర్కొనబడిన "ఆంక్షల" జయాపజయములు, లాభాలాభములు ఇదమిత్థమని నిర్ణయించుటకు వీలులేదు. ఈ ఆచరణకు ముందు ముఖ్యముగా అన్ని దేశములవారికిని నిష్కల్మషమయినట్టియు, స్వార్థరహితమయినట్టియు సమిష్టిసంకల్పశుద్ధి కావలయును. ఇది సమకూరుటయే బహుకష్టము. ఒకవేళ అట్టిసంకల్పశుద్ధి కలిగి యీ ఆంక్షలన్నియు ప్రయోగింపబడెనేని, వారిపయికి నిర్బంధితుడయినవాడు యుద్ధమునకు దాడి సలుపవచ్చును. అట్టితఱి యీ ఆర్థిక నిర్బంధవిధానమునకు తావే లేదు.

ప్రస్తుతము ఇటలీ అబిసీనియాలకు జరుగుచున్న యుద్ధములో 'సమ్మెకట్టు' యిదివరకే ప్రారంభమైనది. లీగుసమితి ఇటలీని దోషిగా నిర్ణయించినది. అమెరికా, రష్యా మున్నగు దేశములవారు ఇటలీని తమ విధమున బహిష్కారము గావింప మొదలుపెట్టినారు. సహాయమంతయు అబిసీనియావారికే యొసంగబడుచున్నది. ఈ యుద్ధము నాపుటకు అందరికంటె ఎక్కువపట్టుదలతో ఇంగ్లాండు ఇటలీకి వ్యతిరేకముగా పనిచేయుచున్న కారణ మేమిటో తెలియకున్నది. ఫ్రాంసువారు గోడమీది పిల్లివాటముగా నున్నట్లున్నది. జర్మనీ తాటస్థ్యమును వహించినది. అమెరికా లీగులో మెంబరు కాదు కావున దీనినిగురించి యేమీ మాట్లాడుటలేదు. జపానువారు అబిసీనియాకు చాల మందుగుండు సామానులు, ఆయుధములు, విమానములు పంపుచున్నారు. ఇట్టి సందర్భములలో ఈ యుద్ధ మేరీతిని సమాప్తమగునో చెప్పజాలము. బహుశః ఫ్రాంసు రాజీ కుదుర్చుటలో నెగ్గునేమో! అమలులో పెట్టబడుచున్న ఆంక్షలవలన ఒకవేళ ఇటలీ నిస్సహాయమై స్వదేశములోనే అంతఃకలహములుపుట్టి యుద్ధమును ఉపసంహరించుకొనునేమో చదువరులే నిర్ణయించుకొనెదరుగాక!



# శృంగారము : నీతి

కాంభట్ల విశ్వనాథశాస్త్రి

"ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్."

"రసో వై సః."

"జంతూనాం నరజన్మ దుర్లభ" మ్మను నుశ్రృ్ట్తనుబడసిన మానవునకీ సమస్త చరాచర ప్రపంచం తనకొరకే కల్పింపబడ్డట్టు నమ్మకం. స్వేతరపదార్థాలను వశపరచుకొని తన్మూలంగా ఆనందాన్ని అభిలషిస్తాడు. మనోరంజకమైన పదార్థమంటే పిపాస మెండు.

"రససార్వభౌమ శృంగారః" అని జయభేరీ కొట్టేడు. కళోపాసకులు కన్నెత్తేరు. అంతా శృంగారదృశ్యమే.

"విభావానుభావ సాత్వికవ్యభిచారిసామగ్రీసముల్లాసితః స్థాయిభావో రసః" అంటూ స్త్రీపురుషసమాగమేచ్ఛారూపరతినే దీనికి స్థాయిభావంగా ప్రతిష్ఠాపించేరు.

దీనికి ప్రేమ ఆలంబనం. ఈ ప్రవాహానికి అడ్డులేదు, ఆద్యంతాలూ లేవు. ప్రత్యక్షసందర్శనమే కారణం కాదు, పరోక్షంలో గుణశ్రవణాదికం కలిగినా చాలును. భిన్నదేశస్థులైతే నాయికానాయకులను సంఘటించడానికి "పశుపక్షి మనుకూలనే సహాయాః" అని కొందరున్నారు.

"స్వాన్యా సాధారణా ఇతి తద్గుణా నాయికా త్రిధా" అని అలంకారశాస్త్రంలో నాయికలు మూడు విధాలు అగ్నిసాక్షికంగా భార్య అనిపించుకొన్నది స్వీయ. ఈమె యందు విషయోపభోగాన్ని అభిలషించడం పురుషధర్మం. అయినా ఓమె ఉత్కంఠవగాపర కీయ నుంచేరు. ఇంకిట్లా వెళుతూంటే అభిసారికేత్యాది అనేకవిధాలుగా నాయికలు కనిపిస్తారు.

సాహిత్యకారులు ప్రతీవిషయం ప్రకృతిలో ప్రతిబింబింప చేస్తారు. ప్రత్యక్షంగా నిరూపిస్తారు. ప్రతీఅంశమును ప్రకృతినుంచి విడదీసి చూపుతారు. వారి గమ్యం రససిద్ధి. తత్సాధనసామగ్రిని శాస్త్రంలో ప్రస్ఫుటిస్తారు. అది వారి కర్తవ్యం. దానికి మార్గం లేకపోలేదు.

ఈ రససిద్ధిలో ధర్మానికిగాని, నీతికిగాని ఏవిధంగానయినా సంబంధం భాసిస్తుందా, లేదా? తాత్వికదృష్టిని సమన్వయం ఎట్లా? అనేది ప్రకృతంలో విషయం.

"సర్వపరిగ్రహత్యాగో భోగః
కస్య సుఖం నకరోతి విరాగః"
అని ఒక ముముక్షువు నృత్యం చేస్తుంటే

"మమతు మత మనంగస్మేర తారుణ్య ఘూర్ణత్ మదకలమదిరాక్షీ నీవి మోక్షో హి మోక్షః" అని రసికావతంసుడు గానం చేస్తున్నాడు. ఇద్దరు విహరించేవి శ్రుతివీథులే. లక్ష్య మిరువురిదీ ఆనందానుభూతే.

"కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే
శివేతరక్షతయే, సద్యః పరనిర్వృతయే"

అంటూ కావ్యానికి శ్రుత్యాదులకన్న నీతిబోధలోనూ, ఆనందోద్భూతిలోనూ అగ్రస్థానాన్నిచ్చేరు. కారణం: ప్రభుసమ్మితమైన శ్రుత్యాదులకన్న అవశ్యాచరణీయములూ, అనుల్లంఘనీయములూ అయిన ధర్మములను కాంతాసమ్మితమైన యీకావ్యము వ్యంగ్యప్రధానముగ— సరసముగ బోధించడమే.

అసలు ఆర్యహృదయం ఏమిటంటే,

"న పరదారాన్ గచ్ఛేత్."

"యాన్యస్మాకం సుచరితాని, తాన్యేవ కార్యాణి"

అని. బహుముఖాలుగా వీన్నే ప్రబోధించారు. ఎట్టివిషయాన్నయినా సుకరంగా నచ్చచెప్పేది కావ్యమే. కర్తవ్యాలలో ప్రోత్సహించడానికీ, అకర్తవ్యంనుంచి నివర్తించడానికిన్నీ చేసే ప్రయత్నం సరళమగుటచేత ప్రవృత్తి నివృత్తులు కావ్యంవల్ల అచిరలబ్ధాలు. ఆర్యరక్తం ప్రవహించే ప్రతివ్యక్తిలోను ఈ ధర్మజ్యోతిస్సు సూక్ష్మంగా ప్రకాశిస్తునేఉంటుంది. అంతకీ వాఙ్మయం ఆదర్శప్రాయం.

శాస్త్రకారులుకూడ "యత్ర తానుచితం కించి న్నాయకస్య రసస్యవా, విరుద్ధం తత్పరిత్యాజ్య" మని నీతినే ఔచిత్యపరంగా సమన్వయించేరు.

"ఎందే డెందము కందళించు రహిచే నేకాగ్రతన్ నిర్వృతిం జెందున్ కుంభగత ప్రదీప కళికాశ్రీదోఁప, నెందెందు బో కెందే నింద్రియముల్ సుఖించుగను నాయింపే పరబ్రహ్మ"మంటే నిరాశాసూచకంగా "చెక్కుమిట్టి తుచ్ఛసుఖముల్ మీసాలపై తేనియల్" అన్నాడు ధర్మోపాసకుడు.

కళోపాసకుని దృష్టిలో రసం విశ్రాంతిశాయి కావాలి. రసనిష్పత్తి కుపకరించే పరికరాన్నే శాస్త్రంలో వివరిస్తాడు.

"వాక్యం రసాత్మకం కావ్యం"

రసం కావ్యానికి జీవం. జీవకళ వికసిస్తేనేగాని సంపూర్ణత సిద్ధించదు. రసైకతానుడు తత్సిద్ధికొరకే తనప్రయత్నాన్ని సాగిస్తాడు.

నాయికా నాయకులు, వారికి పరస్పరమూ ఉత్కటప్రేమ, ప్రేమోద్దీపకము లైన వెన్నెలరేలు, పిల్లగాలులు, పూపొదలున్ను శృంగారరససిద్ధికి సామగ్రి. ఆ ప్రణయమూర్తులను సృష్టించి, తదనుగుణంగా వారి తరగతులను వివరించడం అతని ధర్మం.

అందులో "స్వీయ" ఒకనాయిక. ఈమె యే సహధర్మచారిణి, పురుషార్థసాధనమున్నూ. ఈమెయందు ఇష్టోపభోగవాంఛ నాయకధర్మం. కాని, రససిద్ధికిమాత్రం ఒక మెట్టు తక్కువ. ఇది నిత్యకృత్యములాంటిది. ఆదరాతిశయముల కవకాశం ఉండదు. "సామాన్య"కూడ అంతే; సర్వసాధారణంకాబట్టి.

ఉన్నతసౌధంలో నుంది పరకీయ. గంతవ్యమేగాని దుర్గమం, ఉత్కటమున్నూ. అందుచేతనే స్పృహణీయ యయింది.

"తదేవ సురతం కృచ్ఛ్రాల్లబ్ధం యదన్య దారేషు" అంటూ అందర్లోను అగ్రతాంబూల మిప్పించేరు.

నీతియెంతవరకు స్ఫురిస్తున్నదా అంటే, రససిద్ధిలోమాత్రం ఇదంతా నీతిగానే గోచరిస్తుంది, బాహ్యదృష్టికి.

అనుదినమూ చూచే "స్వీయ" యందు సర్వసాధారణమయిన "సామాన్య" యందు వాంఛించే రతికంటె-దుష్ప్రాపము, అత్యుత్కటమునైన "అన్యా"రతిని స్పృహణీయతరంగా చెప్పడంలో శాస్త్రకారునిది అన్యాయమనలేంగద! అయితే తాను ఆస్వాదించేకానను కున్నాడా? లేక ధర్మబీజం తన హృదయంలో నశించిందా శాస్త్రకారునికి? లేదు-తను ఆస్వాదించాడనీ, ధర్మబీజం తనహృదయంలో నశించలేదనీ తెలుసును. బాహ్యదృష్టికి నీతిని ప్రతిఘటించినా, రససిద్ధికమాత్రం ఉచిత సంపోషణమనే సాహిత్యాచార్యుల తలంపు. లేకపోతే, "యశసే...... శివేతర క్షతయే" అన్న కావ్యంలో పరకీయాది వ్యాపారం కళంకాపాదకం కావలసి వస్తుంది. అప్పుడు శాస్త్రకారుడు పిచ్చివాడు కావలసిందే!

ఈ సమస్య నిర్ధారణ చేయలేకనే — "కావ్యాలాపాంశ్చ వర్జయేత్" అన్నాడు ధర్మోపాసకుడు. సహృదయుడు చెవులు మూసుకున్నాడు శాంతం పాప మంటూ. అసత్కావ్యాన్ని వారికి లక్ష్యంగాచూపి, సత్కావ్యం వల్ల ఆనందోద్భూతేకాకుండ యశస్సు, శివేతరక్షతిన్ని ప్రయోజనాలుగా నిర్దేశించేరు.

సాహిత్యవేత్త రసాని కానందపారవశ్యమే లక్షించినా అందులో సూక్ష్మతరంగా నీతిని ఇమిడ్చేడు. విశ్వశ్రేయః ప్రతిపాదకమై, వాఙ్మయంలో చిరస్థానాన్ని పొందడానికి కావ్యాన్ని ఔచితిని, నీతిని పాటించాలి. లేకపోతే ఆర్యత్వం అంతరిస్తుంది. రసత్వసిద్ధికి నాయికానాయకుల తరగతులనుబట్టి పరకీయాదులను నిర్వచించేరు. అవి "కుబేరగుప్త" మిత్యాదులవలె చిత్రించడములోనే విశ్రాంతము లౌతున్నాయి. ఇవన్నీ వినోదమాత్రాలు. అంచేత పరకీయనే ముఖ్యనాయికగా సంఘటించడం ప్రాచ్యసారస్వతంలో ఎక్కడా కనిపించదు.

సాహిత్యాచార్యులు రసైక దృష్టిలో నున్నా ఆర్యహృదయాన్నిమాత్రం మరువలేదు దాన్నే ఈ రసప్రక్రియలో "ఔచితి" అన్నారు. "అనౌచిత్యాదృతే కించి ద్రసభంగస్య కారణమ్మ"ని నీతిచెడి అసభ్యమైన ఎట్టిసంవిధానమునైనా సహృదయుడు సహించలేడని క్షేమేంద్రుడు ఘోషిస్తున్నాడు. రసజ్ఞు లెవ్వరు నీతివిరుద్ధమైన సంవిధానమును సమ్మతించలేదు. అట్టి రసాన్ని ఆనందించే సరకు వేరు. నీతివిరుద్ధము (అనౌచిత్యము) అయిన అది నీరసమై ఆనందానికి మారుగా అసహ్యాన్ని కలిగిస్తుంది.

ప్రాచీనసారస్వతంలో కళాదృష్టిని రససిద్ధికే ప్రాధాన్యమిచ్చినా ఔచిత్యంమాత్రం వదలలేదు. నైతికధర్మాలు వీడలేదు. అంచేత నే రససిద్ధికి తదితర పరికరముల వలె ఈ

ఔచిత్యాన్ని కూడా ముఖ్యంగా గమనించేరు. సంఘటనలోకాని భాషాసౌష్ఠవములో కాని, పాత్రపోషణలో కాని, అనౌచితి స్ఫురించిందంటే రసాభాసవచ్చి దానికి కావ్యత్వమే లేదని సిద్ధాంతీకరించేరు.

అనంతమై బహుముఖాలుగా వ్యాప్తి చెందినది సంస్కృతసాహిత్యం. సామాన్యంగా అందులో పరకీయనే నాయికగా ఇతివృత్తంలో స్వీకరించడంగాని, అసభ్యసంవిధానంగాని ఉత్తమకావ్యాలలో లేదనిచెప్పవచ్చు.

ఐతే వాళ్లకు రసత్వదృష్టిలేదా? ఏతాదృశసంవిధానం చేతకాదా? — అంటే అవి "భ్రమ ధార్మికే" త్యాది ఖండికలలో పర్యవసానము లయితేనే సహృదయరంజకము లని వారల తలంపు.

ఈ అలవాటే చాలావరకు ఆంధ్రసారస్వతంలో నడిచింది. ప్రథమభాగంలో రససిద్ధి ఆర్యహృదయాలకు ఆదర్శప్రాయమయింది. ద్వితీయభాగంలో కళాదృష్టి కొంతమారినా ఆర్యహృదయం మాత్రం అంతర్హితం కాలేదు. తృతీయభాగంలో కళాదృష్టి పూర్తిగా మారింది. కావ్యంలో రసం ప్రధానం. ఆత్మహత్య చేయడం అసమంజసం. కావ్యానికి, నీతికి సంబంధం ఉండాలనేనియమం లేదు." అని సిద్ధాంతీకరించి "సాధ్యోహి రసో యథాతథం కవిభిః" అని సమన్వయించేరు.

రసమనేది సహృదయునిలో ఉంది. పదములలోను, సంవిధానములోను లేదు. సహృదయుడు శిరసా శ్లాఘిస్తేనే దాని చారితార్థ్యం. ఔచిత్యవిహీనమైతే అసభ్యమయి, సహృదయునికి వెగటు పుట్టిస్తుంది.

సంవిధానం సరసంగా ఉన్నా భాషాసౌష్ఠవం, సభ్యత కూడా అవసరమే—ఈ కత్యులోవే రసికజనమనోభిరామం, గుర్తాంగదచరిత్ర, రాధికాసాంత్వనము మున్నగునవి. రససిద్ధిని లక్ష్యంగా చేసుకున్నట్లే సభ్యతనుకూడా దృష్టిలో నుంచుకోవాలి. ఒక అర్థాన్నిగాని, ఒక విషయాన్నిగాని సూచించడానికి అనేకపదాలు, అనేక సంవిధానాలున్నా ఉన్నా, సభ్యవ్యవహారాలుమాత్రమే సహృదయరంజకాలు. అసభ్యమైతే గ్రామ్యశరణ్యమేకాని సాహిత్యవేత్తల ఆదరణాని కర్హం కాదన్నారు.

తన ప్రయత్నం కళకోసమే పర్యవసించినా కవికి, సంఘానికి, దేశానికిన్నీ కొంత సంబంధం లేకపోలేదు. సాహిత్యాచార్యులు రససిద్ధిచే ముఖ్యంగా లక్షించినా, సూక్ష్మతరంగా నీతినికూడా స్ఫురింపజేస్తున్నారని తెలిసికొని రచనావిధానం సాగించాలి. రసనిష్పత్తికి విభావానుభావాదు లెట్లాంటివో ఇతివృత్తంకూడా అట్లాంటిదే. "ఉపశ్లోక్యస్య మాహాత్మ్యాదుజ్జ్వలాః కావ్యసంపదః" అంటే ఏపురాణప్రసిద్ధమో, మహాపురుషచరితమో అనే కాదు, నీతివిరుద్ధంకాని, సహృదయరంజకమైన ఏ సంవిధానమైనా సరే. అసభ్యమగు ఇతివృత్తాన్ని కావ్యభాగంగా స్వీకరించినా సహృదయుడు సమ్మతించలేడు. ఈతరగ

తిలోచేరినవి తారాశశాంకవిజయము, అహ ల్యాసంక్రందనమున్ను. పరకీయ నేముఖ్యనాయి కగా సంఘటించిన ప్రబంధము లివి. రసత్వ సిద్ధికి కొరంత లేదు. పాత్రలో లీనమై, కథకు తోడ్పడు సంవిధానవైఖరి, మనోహర భావ ప్రకటనమున్ను వెలయించి తారయందు గాఢప్రణయముగ్ధయగు స్వైరిణి ననమా నంగా స్మష్టించినాడు. కాని అధర్మదృశ్య ము. నీతినిసెళము మరపించునంతటి కళావె దగ్ధ్యమును వెలయించినను సంఘభావము నకుమాత్రము అపూర్తమయినది

అహల్యాసంక్రందనంలో పరకీయే నా యిక. అయినా,

"ఓసి! నీ,

చేతిజలంబు లంట నిట్టి
జల్లునె యెంతటిజంత వే, బలా
రాతిని గూడి తీ విపుడు
రాతిరిజాముస గావుగ, బాం
ఆూతిశరీర మందుము"

అని గౌతమునిచే అనిపించి ఆర్యత్వం ఆదరించేను. నీతినిధాయకం కాకపోయినా, అవినీతికిమాత్రం అవకాశ మీయకూడ దిద నప్నాదముని తలంపు.

మానసికప్రవృత్తులలో ప్రేమ ప్రచల మైనది. కళలోకూడ ఆభావమె ప్రబలంగా ఆవిర్భవించడము, ప్రకృతిసిద్ధమయిన ఆభావ రిణతికి భావుకులానందించడమున్ను సహ జమె; కాని, స్వైరసత నాపాదించి ఔచిత్యా (నీతి) నుసారంగా, ఈ రసమును పోషించు టకు కళాశీలి కృషిసల్పాలి.

దీన్ని బాగా గుర్తించేరు నవ్యాంధ్రరచ యితలు. పరమార్థాన్ని గమనించి స్వల్పం గానైనా నిర్వహించే సరసరచనలకు సహృ దయుడు మెచ్చుకుంటాడు.

సంఘమునకు, ప్రత్యేకవ్యక్తులకు పర స్పరం చుక్కెదురు. సంఘము దేన్ని నీతి అంటుందో, అది ప్రత్యేకవ్యక్తులకు దుర్నీతి కావచ్చు. ప్రత్యేకవ్యక్తులకు నీతిగా తోచి నది సాంఘికదృష్టికి అవినీతిగా గోచరింప వచ్చు :— వివాహావిరుద్ధప్రణయము నీతి బాహ్య మని సంఘసిద్ధాంతం. నిత్యమై, శుద్ధ మైన అన్యోన్యానురాగం కుదిరినచో వివా హముద్ర అనవసర మని ప్రత్యేకవ్యక్తుల ఆశయం. సంఘంమాత్రం అందుకు సమ్మతిం పదు. సంఘజీవితశాంతికి తోడ్పడునదే కదా నీతి. పూర్వకవులు శృంగారమును వర్ణించినను దంపతుల గాథలే:— తారాశ శాంకులది శుద్ధమగు ప్రణయమే. కాని సంఘాచారవిరుద్ధము. అధర్మ మనకతీరదు. అయినా, తారప్రణయం మాత్రం ప్రశంస నీయం తారనుచూచి ఆర్యులు నమస్క రిస్తున్నారు. "అహల్యా........తారా....." అని పతివ్రతగా భావించేరు. అయితే వారు ప్రేమకే ప్రాధాన్యమిచ్చి వివాహబంధాన్ని నిరసించేరా?

'మల్లెపూవునకు ధావళ్యము, సౌరభ్య మున్ను సహజగుణాలు. దూరాన్నుండే అది

తావులను వెదచల్లును "దాని కా భావళ్య మేల కలిగెను? అం దెన్ని రేకులు కలవు?" అని విమర్శించడం రసికునిపని కాదు, వృక్ష శాస్త్రజ్ఞునిది. నిజమగు సహృదయు డాసుకు మారకుసుమం తాకిన కందునేమో? అని దూరాన్నుండే ఆనందిస్తాడు. మనోహరమగు చిత్తరువును చూచేటప్పుడు సహృదయు డానందిస్తాడు. కాని, కళాభిజ్ఞుడు రంగుల వ్యత్యాసంకొరకు పింగాణిచిప్పల మీాదికి దృష్టిని సాగిస్తాడు." అయితే రసాన్ని ఆస్వా దించే దెవడు?—సహృదయుడు. రససిద్ధిలో అతడు కాంక్షించేది అద్వైతియానందం. ఐనా సాంఘికజీవి అవినీతినిమాత్రం సహించలేడు.

---

# వేకువ

బొడ్డపాటి కుటుంబరాయశర్మ
(కవితావిహారము)

౧

దుఃఖమయమైన శయ్యయందున గతించె
రేయిరేయెల్ల. తెల్లవారినదియేని—
అలసిపోయిన హృదయము; సొలసినట్టి
తెప్పలైననుమఱి తెప్పరిల్లవలసె!

౨

మేరుగిరియంత భారమే మిగిలి, మిగుల
కోతపడినట్టి నాలేతగుండె, యింత
క్రిక్కిఱియవారు కౌతుకక్రీడతోడ
తెల్లవారుట నేగతి నోల్లగలదో!

౩

ముసురుకొనివచ్చు సీసీవిముసుగు విసరి
ఓసి! యీా దిగంబరకాంతి కొసలు గప్పి
తెరుమగోట్టుము నాదరి దాటుదాక
చెదరు మిరుమిట్లు నర్తించు జీవకళలు.

౪

వలిపెపుంజీకటుల వల్లెవాటులందు
గదుముకొని నన్ను; నాయూర్పుగాడ్పుల ముడి
వేసికొనిపొమ్ము, ప్రాపంచ వేదనాతి
భారజీవిని దాటించు భాగ్యమబ్బ!

"మధుకణములు" సంపుటము నుండి.

---

యాస్థానకవియు, రాజపురోహితుడైన జీవదేవాచార్య కవి డిండిమ ప్రతాపరుద్రగజపతి దక్షిణదేశదండయాత్ర గావించుకాలమున గోదావరీతీరమందుండి యొక్క మాఘమాసములో నీగ్రంథమును తాను రచించినట్లు ఈ గ్రంథముతుదిసర్గలో తన వంశప్రశస్తిలో కవి చెప్పుకొని యున్నాడు. ఈ కవివంశపు మూలపురుషుడు, గోపాల దేవుడు పూర్వపు గంగవంశీయరాజులలో నంతిమును వారైన నిశ్శంకభానుదేవులకు బ్రహ్మమునను దరువాత కపిలేంద్రదేవులకు కొద్దికాలమువరకును రాజగురువుగా నుండె. ఈ గోపాలదేవువంశములో బుట్టిన త్రిలోచన కవిరాజు కపిలేంద్రదేవుగారి పుత్రులైన పురుషోత్తమ దేవునికి రాజగురువుగా నుండెను. త్రిలోచనకవిరాజ కును నారిభార్యాకళ్యావతికిని సుపుత్రుడుదయించి, జీవదేవా చార్యు ప్రతాపరుద్రగజపతిగారి యాస్థానకవిగా నుండి 'కవిడిండిమ' యని బిరుదుబడసెను. వంశపారం పర్యముగ వచ్చుచున్న రాజపౌరోహిత్యముగూడ జేయు చుండి వారు ఇంకను మరికొన్ని గ్రంథములు వ్రాసిరి. వానిలో ప్రతాపరుద్రగజపతిగారి చరిత్రలో నిపులమై చెప్పెడ. ఈ గ్రంథము విషయమై యింతగా చెప్పవలెనని ముఖ్యము... యిందు సూర్యవంశ రాజులలో ...ఇంటి ముస్సరికాలము నిచ్చియున్న ... ఇ కలాప ...చబడిన గ్రంథములకంటె నధికనమ్మక ...మొదటి తగలబెట్టబడిపోతే తరు ...సరూ కలసి జ్ఞాపకమున్న అంశ ...చే నోరిస్సానేలిన రాజుల ...

ఇచ్చట వీనిని మాత్రమే వక్కాణించితిని. ఇవిగాక నింక మరికొన్ని గ్రంథములు, శాసనములున్నవి. వాటిని అవసరమునుబట్టి నచ్చటచ్చట జెప్పెద. వీటియన్నిటి యాదరవున నీరాజుల చరిత్రను వ్రాయబూనుకుంటిని.

ఒరిస్సాను పదిహేనవ శతాబ్దప్రారంభమువరకు గంగవంశీయులు పాలించినట్లు చరిత్ర గన్పించుచుం డగా నీసూర్యవంశపు రాజుల పాలన మెట్లు సంభవిం చె ననునది ప్రతివారికిని దట్టకమానదు. పూర్వ చరిత్ర కారులొక్కరు వేర్వేరుగా చెప్పిరి. మనోమోహన చక్రవర్తిగారు నాల్గవభానుదేవుడు గంగవంశములో నాఖరునాడని వీరినే మత్తభానుడని, నకటూబటాభాను డని మదలాపంజీలో నున్నదని వ్రాసిరేకాని వీరికాల ప్రమాణమునుగూడ సంగ్రహించ లేక పోయిరి. వారి తప్పిందేమి లేదు. నవీనముగా వ్యక్తములైన శాసనములు గాని గ్రంథములుగాని వారినాడు లేవు. ఇవియన్నియు R. D. Banerji గారి కాలమునాటికి లభ్యమైనప్ప టికి వారు వీటిని చూడనేలేదు. పైనజెప్పిన గ్రంథభాగ వశమందు గంగవంశమున దుర్రాజు నిశ్శంకభానుదేవు డని, వారు స్త్రీలోలతచే రాజ్యమును పోగొట్టుకొని రని వ్రాసియున్నారు. సింహాచలంలోనున్న శాసనముల వలన నిశ్శంకభానుదేవుడు శ్రీ. శ. ౧౪౧౪ నుండి శ్రీ. శ. ౧౪౩౦ వరకు పాలించినట్లు దెలియుచున్నది. వీరు విశేషకాలము సింహాచల ప్రాంతమందే యుండి నట్లు గూడ దెలియుచున్నది. వీరు ... నమైన కట కమును వదులుటకు కారణము మాల్వా గౌడ దేశముల మహమ్మదీయ ప్రభువులు బలిష్ఠులై వీరి దేశమును నల్లరిపెట్టుచుండిరి. ఒకపర్యాయము మాల్వా రాజైన హోషాంగు సుల్తానువర్తకుని వేషము వేసికొని జాజినగ రుకు రాగా నిశ్శంకభానుదేవులు తురగముల నమ్ముకొను వాలనుతో కొద్దిమంది పరివారకులతో వచ్చుటకై జను నట. హోషాంగు వీరిని బంధించి, తనసేనలు నిన్ను విడిపించుటకు వచ్చెనా నిన్ను జంపెద. మాకు వలయు నేనుగుల నిమ్ము నిన్ను విడచెదనని జెప్పెనట. అట్లు

అలగ ... చెప్ప ... మేరు ... కోటే ... క్రిక్కి ... తెల్ల ...

సంపుటములలో ...th Indian Inscriptions ౪ ... లోనున్న సింహాచలం, ముఖలింగం, కూర్మ క్షేత్రములయందున్న శాసనములు మన ప్రస్తుతకాలమునకు తేని యుపచరించును. బెనర్జీ గారి కాలమునాటికి ప్రచురమైనప్పటికిని వారు వీనిని చూడనే లేదు.

... S. I. V & VI & IV

... S. I. ..., Nos. 1115, 707, 1069 808, 1082, 784

జేసి ఇంటికి దిరిగివచ్చెనని యే నీ యక్బరీ మొదలైన మహమ్మదీయ చరిత్రలలో వ్రాసియున్నది. ఇది నాల్గవ నరసింహదేవు కాలములో జరిగినట్లు మనోమోహన చక్రవర్తిగా రపోహబడిరి.౬ ఈ కథ క్రీ. శ. ౧౪౨౨ లో జరిగినట్లున్నది గాన నప్పటి రాజు నిశ్శంక భానుదేవుడు గాని వారితండ్రియైన నాల్గవ నరసింహదేవులు గారు. ఇవ్విధముగా నొరిస్సారాజ్యము నాల్గు వైపులను శత్రురాజులచే పరివృతమై స్వంతబలము తగ్గి క్షీణదశ చెందుచుండె.

బంగాళములోను, మాళ్వాలోను మహమ్మదీయులు బలవంతులై యుత్తరప్రదేశముల నాక్రమించ జూచుచుండిరి. పశ్చిమమున బహమనీ సుల్తానులు పతులను నీకాకుజేయుచుండిరి. దక్షిణమున రెడ్డిరాజులు సింహాచలమువరకు నాక్రమించి క్రీ సరికి రాజ్య స్థాపనము జేసిరి. ఇట్టి పరశత్రుభయము ఇక ఇంటిలోనే పోరు హెచ్చాను. కొంతకొంతమంది పూర్వముసామంత రాజులుగా నున్నవారు స్వతంత్రరాజ్యములను స్థాపించిరి. వీరఘట్టాం పాలకొండప్రదేశములు స్వతంత్రము జెందెను. నందాపురంశిలావంశస్థులైన ప్రతాపగంగరాజుగారు సూరిత్రంవరకు దేశమును జయించి క్రీ. శ. ౧౪౩౪లో జగన్నాధునిసేవించిరి.౭ ఇట్లు రాజ్యము క్షీణదశను జెందగా జూచి నిశ్శంకభానుదేవుగారు మృతులైనపిమ్మట దేశమంత సామంతుల వశమాయె మున సూర్యవంశమువారికి రాజ్యమునచ్చినదని కీర్తి భాగవతములో నున్నది.

ఈవంశములో ప్రథములు కపిలేంద్రదేవు. వీరి తండ్రి యెవరో, తాత యెవరో యేమియు నింతవరకు దెలియరాలేదు. బలపరాక్రమములచేతనే సింహాసనమునకు వచ్చినట్లన్నిగ్రంథములు చాటుచున్నవి. వీరికి పట్టాభిషేకము భువనేశ్వరములో కర్కాటకశుద్ధ ౧౦ బుధవారమున జరిగెనటు మాదలాపంజిలో నున్నది. ఈ తారీఖు దేనికిని సరిపోలేదని మనోమోహనచక్రవర్తిగారు కొట్టిపారవైచిరి. కపిలేంద్రదేవుగారి పట్టాభిషేకమునుండి 'కపిలేంద్రాబ్దములని' యొకశక మేర్పడి నట్లును, క్రీ. శ. ౧౯౩౪-౩౫ సంవత్సరమునకు ౫౦౦ కపిలేంద్రాబ్దములు గతించినటును ఒడియాపంచాగమం దున్నది. అందువలన క్రీ. శ. ౧౪౩౪-౩౫లో కపిలేంద్రదేవుగారు గజపతులై యుండవలెను. మాదలాపంజిలో నిచ్చిన తారీఖు క్రీ. శ. ౧౪౩౫ జూన్ ౨౯ బుధవారమునకు సరిపోయినది. వీరిసంవత్సరము సింహాభాద్రపద శుద్ధద్వాదశినుండి సింహాభాద్రపద శు ౧౧ వరకు గనుకను వీరి పట్టాభిషేకము క్రీ. శ. ౧౪౩౫ సింహప్రవేశ పూర్వమే జరిగియుండుటచేతను క్రీ. శ. ౧౪౩౪-౩౫ కపిలేంద్రదేవుల ప్రథమసంవత్సరమైనది. మనోమోహనచక్రవర్తిగారు చేసిన అంకలెక్కప్రకారము గూడ నిదే వచ్చినది.

సింహాసనారూఢులైనవెంటనే వీరు మాలవేంద్రుని యుద్ధమందు బంధితునిగా గౌడస్వామి పైకి వెళ్లిరి. క్రీ. శ. ౧౪౩౬ డిసెంబరు ౯ తారీఖుగల శాసనములో గవ్వలపైనను నువ్వుపైనను పన్నులు దీసి వేసినట్లు ఆజ్ఞయున్నది. ఈయాజ్ఞను శాసించుసమయమున ఎనమండుగురు యోధులు సేనానాయకునితో గూడ రాజుగారి చెంతనుండిరి. వీటినిబట్టి విచారింపగా పైజెప్పినసమునకు గౌడస్వామినిగూడ నోడించి తమజయమునకు జగన్నాధస్వామిని దర్శించి జనోపకారముగా ముఖ్యమైన పన్నులను గొట్టివేసెను.౯ ఈ యుద్ధములలో ముఖ్యసేనానాయకుడు గోపినాధమహాపాత్రో. వీరిని ఉత్తర దిగ్విభాగముల నరికట్టి కాపాడుటకై నియమించియుండెను.

కృత్వా సంయతి మాలవేంద్రజయినం
సేనాధినాధంతు యం,
గౌడేంద్రస్య నితాంత ముత్కళపస
ప్రస్థానగోదార్గళం, ౯

౬. J. A. S. B. Vol. LXXII, Part 2, p. 139.

౭. S. I. I. Vol. V, No. 1170.

౮. J. A S. B. Vol. LXII, Part I. Jagannatha Temple Left Side, No. III.

౯. Ibid, Vol. LXIX, No. 2, Gopinatha pura Inscr. p. 173, ff.

తదుపరి,

శ్రీఖండాభ్రపయోధరోపరికరం
నిర్మాయ కాంచీపురః,
సానందం కపిలేశ్వరో విహరతే
కర్ణాటరాజశ్రియా॥౧౦

అనగా 'శ్రీఖండాభ్రపయోధరోపరికరం వేసి కాంచీని జయించి కపిలేశ్వరుడు కర్ణాటరాజుగారియొక్క లక్ష్మితో సానందముగా విహరించెనని. ఉత్తరమందున్న శత్రువులను స్వాధీనము చేసుకొని దక్షిణదేశములనుగూడ జయించిన శ్లోకమువలన దెలియుచున్నది. 'కాంచీ, కర్ణాటరాజ'ని చెప్పుటచే చోళమండలమున్ను విజయనగరమని స్పష్టపడుచున్నది. ఒరిస్సారాజ్యమునకున్ను, చోళమండలమునకును మధ్యనున్న లాంగూల్యా గండిలగామానదుల మధ్యస్థమైన దేశమనాక్రాంతమై యుండియుండునట్లు పైన చెప్పియుంటిని. ఈదేశమును జయించినట్లుగాడ వీరిగారి బిరుదులలో నున్నది. 'గజపతిగౌడేశ్వరనవకోటికర్ణాటకలబరగేశ్వర' యని బిరుదులు కపిలేంద్రదేవుగారు క్రీ. శ. ౧౪౫౦లో మొట్టమొదట ధరించినారు.౧౧ అప్పటికి వీరు యీబిరుదులలో చేర్కొన్న దేశముల కన్నిటికిని ప్రభువైనారు. ఏవి యాదేశములు? గౌడేశ్వరయన్న గౌడదేశాధిపత్యము, నవకోటి౧౨యన్న తొమ్మిదికోటలు గలవారు, కర్ణాటకలబరగేశ్వరయన్న కర్ణాటమునకున్ను కలబర్గకున్ను యధిపతులు. గౌడదేశమునకున్ను కర్ణాటదేశమునకున్ను మధ్యను 'నవకోటి' యని చెప్పుటచే 'గజపతి'యను బిరుదుచే సూచింపబడు నొరిస్సాదేశమునకున్ను కర్ణాటదేశమునకున్ను మధ్యనున్న ప్రదేశము 'నవకోటి' దేశమని చేర్కొనబడినది. ఈప్రదేశములో నుత్తరమునుండి దక్షిణమునకు, పొట్నూరు, వడ్డాది, కలువలపల్లి, పెద్దాపురం, రాజమహేంద్రము, నాగార్జునకొండ, కొండవీడు, కొండపల్లి, బెల్లంకొండ యను తొమ్మిది కొండకోటలని స్వాధీనముచేసికొని పాలించినారు రెడ్డిరాజులు. వీటి నొకదానితర్వాత నొకదానిను త్తరమునుండి జయించినాడు కపిలేంద్రగజపతి. తరువాతికాలములో కృష్ణదేవరాయలు దక్షిణమునుండి కోటతరువాత కోటను పట్టుకుని ఉత్తరముగ సింహాద్రివరకు వచ్చినారు. గండలగామానది మొదలు ఉత్తరమున సింహాచలమువరకు నున్న దేశము 'నవకోటి' యను పేరనుండె. దీనినే పై శ్లోకములో 'శ్రీఖండాభ్ర' యని చెప్పియున్నది. (శ్రీ = లక్ష్మీప్రదమైన, ఘనవంతమైన; ఖండ = తొమ్మిదైన, అభ్ర = కొండలనే, పయోధరోపరి = పయోధరములపై, కరం = చేతిని; నిర్మాయ = వేసి). మాళవగౌడదేశములను జయించి దక్షిణమువైపుకు దిరిగి సింహాద్రినుండి గండలగామావరకు నున్న దేశమును జయించినపైని కర్ణాటమును కలబర్గమును జయించినట్లు పైశ్లోకమువల్లను వారి బిరుదులవల్లను దెలియనగుచున్నది. ఇన్ని దేశముల నెప్పుడెప్పుడు జయించియుండును?

౧౦. Idid.

౧౧. J. A. S. B. Vol. LXII, pt. 1. Jagannatha Temple Insc. Rightside No. III.

౧౨. 'నవకోటి' నవానాంకోటానాం=నవకోటానాం; నవకోటానాయస్యాసౌ 'నవకోటిః'. గాని శాస్త్రిగారు 'నవకోటి' 'కర్ణాటము'నకు విశేషణముజేసి 'తొమ్మిదికోట్ల జనంగల కర్ణాటదేశమని యర్థముజేసిరి. కపిలేంద్రదేవుగారికి లోబడిన కర్ణాటదేశమంతయు నొక్క యుదయగిరిరాజ్యమే. ఇది నెల్లూరుమండలములో నొకభాగము. దీనిలో తొమ్మిదికోట్లజనం యుండెననుమాట విశ్వసనీయముగాదు; సప్రమాణమునుగాదు. ఒకవేళ యట్లే యొప్పుకొనిన్ను సింహాద్రి మొదలు గండలగామానది వరకున్న రాజ్యము కపిలేంద్రదేవుకు పూర్వము రెడ్డిరాజులదే. ఇది కర్ణాటములో జేరలేదు. దీనిని జయించిగదా కర్ణాటముపైకి వెళ్లవలె. శాస్త్రిగారి యర్థమునే ఒప్పుకొనినయెడల బిరుదులలో రెడ్డిరాజ్యస్వాధీనతకనబడదు.

భువనేశ్వరం దేవాలయద్వారముకుడిప్రక్క నున్న మాధవశాసనము౧౩లో క్రీ. శ. ౧౪౩౭ మే ౨౭ మంగళవారమున కపిలేంద్రదేవు ఇట్లాజ్ఞాపించెను. "నా రాజ్యములోనున్న యావన్మందరాజులు సార్వభౌముని క్షేమముకొరకు పనిచేయవలెను. న్యాయప్రవర్తకులై నీచమార్గములను విడువవలె. సార్వభౌమునియెడల ట్లెవ్వరైన ప్రవర్తించిరేని వారి రాజ్యము లాగుకొని శిక్షగొట్టుదును." ఈశాసనకాలము నుండి క్రీ. శ. ౧౪౪౯ నవంబరు ౨౭ బుధవారమున వ్రాయబడి సింహాచలశాసన౧౪ కాలముపర్యంతము కపిలేంద్రదేవుగారి శాసనము లెచ్చటను గన్పించలేదు. ఈ పదునొకండు వర్షములు సమాపె నరుగబడిన సామంతరాజులను స్వాధీనముజేసికొని పూర్వము గంగవంశీయుల క్రిందనున్న దేశమును జక్కపరుచుకొనుటలో నీరాజు గడపియుండవలెను. ఇందుకు ప్రత్యక్షప్రమాణములు దొరకలేదుగాని మరికొన్నిరాజ్యముల చరిత్రలనుండి స్పష్టమైయుండునని యూహింపవచ్చును.

నందాపురశిలావంశపు ప్రతాపగంగరాజు క్రీ ౧౪౩౫లో నారాజ్యంవరకు జయించెనని యిదివరకే చెప్పియుంటిని. ప్రస్తుతము జయపురసంస్థానమని పరగుచున్న విశాఖపట్నంజిల్లా పశ్చిమప్రదేశము పూర్వము నందాపురరాజ్యములో నొకభాగము. ఇప్పుడు జయపురసంస్థానము ననుభవించుచున్న రాజకుటుంబము యొక్క ప్రథమపురుషుడు శిలావంశపు రాజకుటుంబకన్యను వివాహముమాడి నందాపురసింహాసనము నధిష్ఠించెనని యొకప్రతీతి గలదు. తరువాతిగాథలలో నీ ప్రథమపురుషుని పూర్వవృత్తాంత మెటుల గల్పితమైనను క్రీ. శ. ౧౭౮౪లో ఆర్ముదొంగగారు జయపురంవచ్చి వంశవృత్తాంతము గనుగొని వ్రాసిన వ్రాత విశ్వసనీయము; పైప్రతీతి కనుగుణ్యము. అది యిట్లున్నది:—

"Ramchbandra Deo, Rajah of Nandapuram is descended of a Rajah formerly a servant and favourite to an ancient king of Jagannath and sovereign of these Northern Circars, who gave him his daughter in marriage and bestowed this tributary principality upon them."౧౫

ప్రతాపగంగరాజుచరిత్రను దీనితో గలిపి యాలోచించిచూడగా క్రీ. శ. ౧౪౩౭ తరువాత కపిలేంద్రదేవు నందాపురరాజును జయించి యతనికొమార్తెను తనకు విశ్వాసపాత్రుడును, తనవంశీయుడైన యోధుననప వివాహముజేసి నందాపురరాజ్యమును నతనికి నప్పజెప్పెనని తోచుచున్నది. జయించిన రాజ్యముల దనకు విశ్వాసమైనట్టిన్ని, తనవంశమైన సూర్యవంశమునకు జెందిన యోధులనే రాజులుగా జేసినట్లు మున్ముందు జూచెదము. కనుకనే యిప్పటి జయపురరాజులు సూర్యవంశీయులు. కపిలేశ్వరదేవుగారి కాలమునాటి శాసనమొకటి బొబ్బిలిలో నున్నది. అప్పటికి నందాపురరాజుల రాజ్యములో బొబ్బిలి యొకభాగము. ఇప్పటికిని బొబ్బిలికి పశ్చిమముగా నున్న కొండపై నందాపురరాజుల చిహ్నలతోనున్న పాడుబడినకోట యొకటి యున్నది.

ఇటులనే వీరఘట్టాం మొదలైన సామంతులను స్వాధీనముజేసికొని గంగానదినుండి దక్షిణమున సింహాద్రివరకు నున్న దేశమందు తన నిరంకుశాధికారమును స్థాపించి తరువాత నంతకుదక్షిణముగా నున్న రెడ్డిరాజులపైకి దాడివెడలెను. క్రీ. శ. ౧౪౫౪ లో మల్లికార్జునకొండను స్వాధీనము జేసికొనెను.౧౬ ఈ లోపుననే రాజమహేంద్రము వరకు స్వాధీనముజేసికొని రఘుదేవనరేంద్రమహాపాత్రుని

౧౩. J A. S. B. Vol LXII, pt. I Rightside No. II.

౧౪. S. I. I. Vol. VI, No. 1089.

౧౫. A. Collection of Precis Papers about Jeypore, No. LXXXI. Printed at the united Scottish Press, in 1864 and also Manual of the District of Vizagapatam by D. F. Cormishael, M. C. S. p. 284 Para 2.

౧౬. J.A.S. B. Vol. LXII, Part 1. Jagannatha Temple Inscriptions. Rightside No.2.

నచ్చట రాజుగా నియమించె. ౧౭ క్రీ. శ. ౧౩౫౪ - లకి గుంటూరుజిల్లా శ్రీకాకుళంవరకు ౧౮ దేశమును జయించి బాహమనీ రాజ్యమునుండి తెలింగాణమునకు కవాటమైన కొండవీడు ఆస్థానముగా గాణదేవకాతు రాయిని రాజుగా నుంచెను. ఇక్కాలపు చరిత్ర కొంత వరకు గాణదేవుని కొండవీటి తామ్ర౧౯ శాసనమునందు దొరకును.

సువాదేవ పాత్రుని కొమారుడైన గాణదేవుడు సూర్యవంశజుడు. ఇద్దరు తురుష్క యోధుల నోడించి నందున రాతురాయి యను బిరుదును బడసెను. ఈ యిద్దరు తురుష్క యోధులలో నొకని మనము 'బుర్హానీమజారు' ౨౦ అను బాహమనీ రాజుల చరిత్రనుండి గ్రహించవచ్చును. అల్లాయుద్దీన్ - అహమద్ - షాహ క్రీ. శ. ౧౩౪౭ నుండి క్రీ. శ. ౧౩౫౭ వరకు పాలించె. ఇతడు కామలోలుడై రాజ్యవ్యవహారముల నుపలక్షించుటచే నితని యోధులు, ఉద్యోగస్థులు తమ తమ నియమిత కార్యములమాని నవాబుగారికి నుత్సాహము గలుగజేయు చర్యలనే చేయుచు వారి మందిరము ప్రక్కనే నివసించి యుండెడివారు. ఇట్టి కాలమందు షాజహాన్ అను యోధుడు కొంత సైన్యమును దీసికొని తెలింగాణములోనికి వెళ్లి యచ్చటి హిందువులను చెర బట్టి తెచ్చి మహమ్మదీయులుగా జేయుచుండెడివాడు. ఇట్లు కొన్నాళ్లు జరిగినపిమ్మట తెలింగాణమునకు ప్రభువులైన యాంధ్రరాజులతో జట్టిపడ్డది. బుర్హానీమజారు చరిత్రకారుడు షాజహాను డోడి పోయెనని స్పష్టముగా వ్రాయకపోయినను షాజహాను చేయుచున్న దౌర్జన్యమువిని సుల్తానన్న మాటలవలన గ్రాహ్యమే. "వేలకొలది నేనుగులు గల నోంధ్రరాజుతో వీని కేమిపని?" యని యన్నాడట సుల్తాను. ఈ షాజహాను ఒకడు. రెండవ తురుష్క యోధు డెవరో తెలియరాలేదు. తురుష్క యోధుల నోడించిన విషయము క్రీ. శ. ౧౩౫౫ సంవత్సరపు శాసనమందున్నదిగావున నింతకు పూర్వమే యీవిజయము గలిగియుండవలెను.

---

ఈ శాసనమును మరికొన్నిటివలెనే మనోమోహన చక్రవర్తిగారు చదువుటలోను, గమనించుటలోను గూడ పొరబడిరి. వారు చదివినదానిని బట్టి యిట్లున్నది. 'మల్లికాపర' దిక్కున జయించి తిరుగుటలో జగన్నాథంవచ్చి దేముని సేవించె దీనికి వ్యాఖ్యానము R. D. Eenerjiగా రిట్లు వ్రాసిరి. 'మల్లికాపరిమ' బంగాళములోని యేమహమ్మదీయ యోధుడో యై యుండును. ఏచరిత్రలోనూ ఇతనిని జేర్కొనలేదు' బంగాళములోని యోధునిజయించి తిరిగి వచ్చుటలో కటకంముందుగనుటనా, జగన్నాథం ముందుగనుటనా? ఒరిస్సా భూగోళ చరిత్ర దెలిసినవా రెవ రిట్లు జెప్పరు. అందుచే బంగాళముతో నీవిజయ మేమిసంబంధించదు. 'పరిమ' యను పదము దక్షిణ మహమ్మదీయుల కెవ్వరి నామధేయమునకు చేరియుండుట యింతవరకు దెలియరాలేదు. గావున 'మల్లికాపరిమ' యనునది మనిషి నామధేయముగాదు. అసలు పదము 'మల్లికాపరసాదిగ' యని యున్నది. 'పరసాద' 'ప్రసద' కపోభ్రమము. 'మల్లికాప్రాసాద' యనునది 'మల్లికాపరసాద్' అని యొక గ్రంథములో వ్రాసివారు. కొండవీటి కొండకు 'జగన్నాథప్రాసాద్ గడ్' అని S I. Vol. VI, No. 654లో జెప్పియున్నది. అలాగుననే మల్లికార్జునకొండకు 'మల్లికాపరసాదగడ్' అని యుండవచ్చు. శాసనముచదువుటలో పొరపాటు ఉండియుండవచ్చు. మల్లికార్జునకొండను జయించి తిరుగుటలో జగన్నాథ మేతగులును. అచ్చట స్వామిని సేవించి తమ నిజనగరమునకు వెళ్లెను.

౧౭. S. I. I. Vol. V, No. 100.

౧౮. Ibid, vol. IV, No. 988 & M. E. R. 1914, No. 70.

౧౯. I. A. Vol. XX, pp. 390-393.

౨౦. I. A. Vol. XXVII, Chapter X.



గౌ. శ్రీనివాసశాస్త్రిగారు

శ్రీ చావలి నాగేశ్వరరావుగారు రచించిన తైలవర్ణ చిత్రమునకు ప్రతికృతి.
ఈచిత్రము చిదంబర విశ్వవిద్యాలయమున ప్రతిష్ఠింపబడినది. ఈచిత్రము కళాభిజ్ఞుల ప్రశస్తిను గన్నది.



షోలాపూర దృశ్యము

V.

శ్రీకాకుళం,[౨౧] చింతపల్లి పొడుగు[౨౨] శాసనములనుబట్టి క్రీ. ౧౪౫౩ కు పూర్వమే కృష్ణానదాటి కపిలేంద్రగజపతి కొండవీడుప్రదేశమును స్వాధీనముచేసికొనుచుండె. ఈసమయములో విజయనగరరాజైన మల్లికార్జునదేవరాయలు మారుటూరు వచ్చిన శ్లోకశాసనమున్నది.[౨౩] మారుటూరు కొండవీటికి నైరృతిమూలగా నిరువదిమైళ్లదూరమున నున్నది. ఈమల్లికార్జునదేవరాయలరాక యితరచరిత్రకారుల మతప్రకారము నేరుద్దేశమని యున్నా, కపిలేంద్రదేవుచేయు ఉద్యమములను గనిపెట్టుటకో, లేక వారి నరికట్టుటకో యని నాయూహ.

కొండవీడు స్వాధీనమైనంతవరకు బాహమనీ సుల్తానునితో చెయ్యిచేసుకోవలసివచ్చె. ఆసుల్తాను పరికి మాలినవాడై యతని సేనానాయకులు తననాయకుల వలన నెప్పుడు పరాజితులయిరో యప్పటినుండి పశ్చిమము వైపునుండే భయములేకయుండెను. కొండవీడుప్రదేశము స్వాధీనమైనది మొదలు విజయనగరరాజ్యముయొక్క హద్దును నాంధ్రరాజ్య మంటుటచే నిప్పుడు వారితో చేయికలుగజేసుకోవలసివచ్చె. అందుకు తార్కాణముగా క్రీ. శ. ౧౪౫౩ లో మల్లికార్జునదేవరాయలు మారుటూరు వచ్చియుందురే.

విజయనగరరాజ్యముయొక్క పరిమితి కొంచెము విచారించవలసియున్నది. తుంగభద్రానదీతీరమం దున్న విజయనగరము ముఖ్యస్థానమైనను తూర్పుపడమరసముద్రములవరకు వ్యాపించుటచే భాగములుగా జేయబడి యొక్కొకభాగముపై నొక్కొక యధికారివి రాజాధికారములతో నియమించియుండెను. కపిలేంద్రగజపతి కొండవీడు స్వాధీనముజేసికొనగా దానికి దక్షిణమున కర్ణాటరాజ్యము కాంచీ ముఖ్యస్థానములో నుండె.

కావున నోఢ్రులకన్న సరిగా దీనిపై బారెనేగాని, మూలస్థానమైన విజయనగరమునుండి సహాయమువచ్చునసే భీతియు నుండె. విజయనగరము నొకవైపునుండి, కాంచీపురము నొకవైపునుండి ముట్టడివేసిన నొకరికొకరు సహాయముజేసికొనుటకు వీలుండదని నిశ్చయించి తాను స్వయముగా విజయనగరము నెదుర్కొని తనకు నమ్మకస్థుడైన కుమారహంవీరమహాపాత్రులను కొంతసైన్యముతో కాంచీరాజుపై కంపెను.

ప్రసహ్య కర్ణాటమహీపతేః శ్రీ
న్నిరుధ్య విద్యానగరీ న్నిజై ర్బలైః,
సమున్నతం మానమివోచ్ఛ్రియం శరం
సమూడదే కర్కశచక్రవిక్రమః.
కుమారహంవీరవిభు ర్యదాజ్ఞయా
విజిత్య కార్తాంతదిశం ప్రతాపవాన్,
అశోధయ చ్చాత్రవశోణితోక్షితాం
కృపాణికాం దక్షిణసాగరాంబుషు.[౨౪]

విజయనగరంపైకి వెళ్లి యా పట్నమును ముట్టడిచేయగా మల్లికార్జునదేవరాయలు విస్తారం కప్పము చెల్లించుకుని రాజీ చేసుకున్నారు. ఈ శాసన మిట్లు ఘోషించుచుండ గజపతి నోడించెనని జెప్పిన గంగదాస ప్రతాపవిలాసమను సంస్కృతనాటకము మన చరిత్రకారులకు ప్రమాణమైనది. గ్రంథకర్త గూర్జరదేశపు రాజువద్దనుండి యతనిని బిలిపించి ఈ పుస్తకము మల్లికార్జున దేవరాయలు వ్రాయించుకొనెనని యా గ్రంథమందే యున్నది.[౨౫] రాజపోషణ నభిలషించి వ్రాసిన గ్రంథమందు యథార్థచరిత్ర యెట్లుండును?

ఇక హంవీరకుమారమహాపాత్రుడు దక్షిణసముద్రతీరమువరకు జయించె. వీరి ధాటి కోర్వలేక చంద్రగిరి రాజు (కాంచీరాజని కూడా యనెదరు.) తనరక్షణా

౨౧. S. I I. Vol IV, 988.

౨౨. M. E. R. 1914, No. 70.

౨౩. M. E. R. 1915, No. 386.

౨౪. Andhra Patrika Annual, 1929. Anantavaram Copper Plate Grant.

౨౫. Sources of Vijayanagar History, No. 5.

ర్థమై దేవుళ్లకు దేవళలకు మొక్కులు చెల్లించుకొనెను. చెంగల్పట్టుజిల్లాకు నమత్తూరు దేవళములో ౨౬ క్రీ. శ. ౧౪౫౪ లో నొకదానము. ఉత్తరార్కాటుజిల్లా కోవిలూరు (జావాదిసు) ౨౭ గ్రామం తిరుమలనాయనారుకు రాజుగారి జయముకొర కొకదానము. ఈ యోఢ్రదండయాత్రప్పుడు పాడుపడిన దేవళములు క్రీ. శ. ౧౪౬౧ వరకు బాగుచేయలేదట ౨౮.

ఈ దండయాత్రవలన కపిలేంద్ర దేవు గజపతికి నుదయగిరి రాజ్యము లభించిన ట్లూహింపవచ్చును. వీరి కుమారులైన పురుషోత్తమ గజపతిగారు కాంచిపై దాడివెడలుట, నెల్లూరు మండలములో దానముచేయుట చూచితే వారి కదివరకే యీప్రాంతమందు పాదమూనిక యుండియుండకపోతే ఇట్టికార్యములు చేయ నవసరమూ యుండదు, శక్యమూ గాదు. ఇట్లు దక్షిణదేశము జయించి యుదయగిరి రాజ్యస్థాపనచేసి కుమార హంవీరమహాపాత్రుడు క్రీ. శ. ౧౪౬౦లో నోరుగల్లుకోటను బట్టుకుని స్వాధీనముచేసికొనెను. ఓరుగల్లు కొండవీటికి సమీపముగా నున్నది గదా; కొండవీటికి క్రీ. శ. ౧౪౫౫ లో గాణదేవు రాతురాయి ప్రభువుగా నుండెనని మాచితిమే. ఆగాణదేవుడు స్వాధీనము చేసికోక యీ హంవీరుడెందు కక్కడికి వెళ్లె? అంటే గాణదేవుడు చనిపోయియుండును. అతని కొడుకు లెవరు ప్రాజ్ఞులు, ప్రముఖులు లేక పోయియుండవచ్చును. అందుచే నుదయగిరి రాజ్యభారమును వహించిన కుమారహంవీరునకే కొండవీడు రాజ్యము కూడా వప్పజెప్పి కొండవీడునుండి దక్షిణముగానున్న దేశమంతయు నితని స్వాధీనములో నుంచెను. క్రీ. శ. ౧౪౬౪ లో కుమారహంవీర మహాపాత్రులు చనిపోగా వీరి కుమారులైన దక్షిణ కపిలేశ్వర కుమార మహాపాత్రులు కొండవీడు మొదలు దక్షిణముగా నున్న దేశమంతటికి ౨౯ నధికారి యయ్యెను గావున పై యూహ యాధారభూతమైనది.

ఈ హంవీరమహాపాత్రులే మహమ్మదీయసేనల నోడించి దేవరకొండరాజును గాపాడెను. హుమాయూన్‌షాహ బీదరుసింహాసనముపై క్రీ. శ. ౧౪౫౮ నుండి క్రీ. శ. ౧౪౬౧ వరకు పాలించెను. ఈకాలములో ఖ్వాజాజహానుడను మహమ్మదీయయోధుడు ౨౦,౦౦౦ గుఱ్ఱపుదళము, ౪౦ యేనుగులు, లెక్కలేని కాల్బలములతో వచ్చి దేవరకొండను ముట్టడించెను. ఇది చాలా బలవంతమైనకోటయగుటచే నిదివర కెవ్వరును దీనిపైపు చూడలేదు. ఈ దేవరకొండరాజు సహాయము కొరకు నప్పటికి విగ్రహారాధకులకు ముఖ్యుడైన ఓఢ్రరాజుకు వర్తమాన మంపెను. అప్పు డాయోఢ్రరాజు నూరు ఏనుగులను సహాయముకొరకు పంపెను. ఈ ఓఢ్రసైన్యము దేవరకొండసైన్యముతో గలియకముందే ఖ్వాజాజహానుడు తన సైన్యము నాకోటకెదురుగానున్న బైలుమీదకి దీసుకుబోయెను. ఓఢ్రరాజసైన్యము దూరమున నగపడినతోడనే దేవరకొండసైన్యము కోటతలుపులను దెరచి శత్రువులపై బడగా రెండుహిందూ సైన్యముల మధ్యను తురుష్కసైన్యము చిక్కువడి మడిసెను. హిందువులు కొల్లబెట్టి మహమ్మదీయుల యేనుగులను, గుఱ్ఱములను బట్టుకొనిరి. ౩౦ ఇట్లు దేవరకొండను రక్షించి కాపాడిరి. ఈదేవరకొండను బహమనులకు, మహమ్మదీయులకును మధ్యమెత్తగా (buffer) ఓఢ్రరాజు పాలించుచుండె.

ఇట్లు కపిలేంద్రదేవుగజపతి రాజ్యము నుత్తరమున గంగానది మొదలు దక్షిణమున పెన్నానదివరకును పూర్వసముద్రమునుండి పశ్చిమమున ఓరుగల్లుపైగా నున్న దేశమును స్వాధీనముచేసికొని నిరంకుశాధికార

౨౬. **M. E. R. 1928-29, No. 207.**

౨౭. **Ibid. 1911, No. 241.**

౨౮. **Ibid. 1919, Nos. 310 & 1928-29, No. 287.**

౨౯. **Ibid. 1919, Nos. 51 & 92. & Part II.**

౩౦. **Burhan-i-musaar, Chapter Xiii**

ములో బాలించెను. అనేకమంది సామంతరాజులు కప్పముచెల్లించేవారు.

> నమ్రావనీశా[న]కిరీటనూత్న
> రత్నాంశునీరాజితపాదపీఠః. ౩౧

తనకున్న శత్రువులనెల్ల స్వాధీనముచేసుకుని తనపేరంటే వారికి గుండెలలో దడపుట్టించె.

> నిర్ఘాతశత్రుర్నిలపతి కపిల
> స్సూర్యపతిః కుంభిరాజః. ౩౨
> గౌడద్రావిడనేపాళ
> పాండ్యమాళవకేరళాః,
> కపిలేంద్రనృపే క్రుద్ధే
> యుద్ధే కర్ణాటకీర్తయః. ౩౩

శత్రుపక్షమున నిల్చువాడని క్రూరుడును, దుర్గ్రహుడును గాడు. దైవబ్రాహ్మణభక్తిగలిగి తమ రాజ్యవైభవముకొరకున్ను, ప్రజాక్షేమముకొరకున్ను పాటుపడియుండె. వీరిశాసనములలో ననేకమైనవి దేవాలయములకు జేసిన దానములే. యుద్ధమందు జయము పొందితిరుగుదలలో జగన్నాథస్వామిని దర్శించి గాదెమునకైన కట్నము చదివించనిదీ తమనిజస్థానమునకు జేరలేదు. ఒకశాసనములో౩౪ తనకున్నవాటిలో ప్రశస్తమైనవాటిని జగన్నాథస్వామికిని బ్రాహ్మణులకు ఇచ్చితినని వ్రాసియున్నాడు. దక్షిణదేశమునకు వెళ్లినప్పుడెల్లా మంచిమంచి యలంకారములు మొదలైన వస్తువులను దెచ్చి యుత్తరదేశములో ప్రచురించేవాడు. ఇట్లు దేశమును వృద్ధిచేసి విఖ్యాతిగాంచి కపిలేంద్రగజపతి క్రీ [illegible] ౧౬ [illegible] నవంబరు ౨౫ మంగళవారమున కృష్ణానదీతీరమున పరలోకగతుడయ్యెనని మాదలాపంజీలో చెప్పియున్న దీనినిబట్టి యీరాజు [illegible] సంవత్సరములు సింహాసనముపై నుండినట్లు తేలుచున్నది. భక్తిభాగవతములోగూడ నీరాజు ముప్పదిరెండువత్సరములు పరిపాలనమొనరించి స్వర్గస్థుడాయెననియే చెప్పియున్నది. అయినప్పటికి మనమోహనచక్రవర్తిగారు, వారి ననుసరించిన యితరచరిత్రకారులుగూడ మాదలాపంజీలో జెప్పిన తిథివారములను సమ్మరైరి. మాదలాపంజీ ఎంత యవిశ్వసనీయమైనా మృతతిథి యబద్ధమౌనా? హిందువులలో, నందులో మహాగ్రజాతులలో మృతతిథి మిక్కిలిశ్రద్ధ జ్ఞాపకముంచుకొనియెదరు. అనేకులు చనిపోయినవాని పేరున శ్రాద్ధము జేసెదరు. ఏకరు విడిచెపెరుగాని తల్లితండ్రుల శ్రాద్ధము మాత్రము విధిగా నొనరించెదరు. అందులో పరమతస్థుల సంపర్కలేని కాలమందు, వేదాచారములు నియమముగా ప్రబలినకాలములో వేదపురాణశాస్త్రములజదివి తర్కించి వాటిసారమును దీసి లోకోపకారమైన గ్రంథములు వ్రాసిన రాజకుటుంబమువారు మృతతిథిని మరతురా? కపిలేంద్రదేవుగారి కుమారుడు పురుషోత్తమదేవు హిందూమతాచారములయందు భక్తిశ్రద్ధలుగలిగి సుమారు ౩౬ సంవత్సరములు తనతండ్రిశ్రాద్ధమును జరిపెనుగదా! అట్టిశ్రాద్ధమే తిథివారములయందు జరిగెనో గారెలుతిన్న బ్రాహ్మణులకు జ్ఞాపకముండక పోవునా? ఈవిషయమై మాదలాపంజీని నమ్మకపోవుట పొరబాటేకాని యీపొరబాటుకు కారణములు లేకపోలేదు.

జగన్నాథాలయములో కపిలేంద్రదేవుగారి కాలము ౪౧వ అంకములో వ్రాసిన యొకశాసనములో౩౫ కొంతమంది మహాపాత్రులు మరియొక మహాపాత్రుని యధ్యక్షతక్రింద కొన్ని నగలు దెచ్చి ప్రమాణపూర్తిగా దేవునికిచ్చినట్లున్నది. దీని తారీఖు క్రీ. శ.

౩౧. Kondavidu C. P. of Ganadeva.

౩౨. Ibid

౩౩. Sarasvativilasam.

౩౪. J. A. S. B Vol. LXII, 1893, part 1, Jagannatha Temple Inscriptions, Right side No. III.

౩౫ Ibid, Left side No IV.

౧౪౬౭ డిశంబరు ౧౪ రవివారము. రాజుగారు నవంబరులో చనిపోతే డిశంబరు రాజుగారికాల మెట్లగును? వీరిసంవత్సరము లనగా నంకములు సింహభాద్రపద శు. ౧౨ కి మారుతవని యిదివరలోనే మనవిజేసి యుంటిని. నవంబరు, డిశంబరుమాసములు రెండుకూడ నొక్కయంకములోనివే. రాజగారు నవంబరులో చనిపోయినను వారి యంకము మారలేదుగా! క్రొత్తరాజగారికింకనూ పట్టాభిషేకముగాలేదు. అందుచే కపిలేంద్ర దేవుగారి కాలమందు అని వ్రాసియుండె. ఈ శాసన భావ మేమంటే, 'కపిలేంద్ర దేవగజపతి దేవునికి కొన్నినగలను జేయించి తాము వచ్చేటప్పుడు తెచ్చుటకుద్దేశించెను. ఇంతలో నాయుద్ధాయము చెల్లి కృష్ణాతీరమందు కాలధర్మము నొందుచుండగా కొంతమంది నౌఖర్లకు నానగలను వప్పజెప్పి వారు సరిగా తీసుకుని వెళ్లి శ్రీ జగన్నాథస్వామికి సమర్పించుటకు ప్రమాణము చేయించుకొనెను. వారు ౧౯ రోజులలో (౨౫ నవంబరునుండి ౧౪ డిశంబరుకు) కృష్ణాతీరమునుండి శ్రీ జగన్నాథముజేరి ప్రమాణముగా నన్ని వస్తువులను వప్పజెప్పిరి. ఈ శాసనభావమును మనోమోహన చక్రవర్తిగారు గమనించలేకపోయిరి. దీనిబట్టియే యితరులు గూడనట్లే చేసిరి. అందుచేతనే కపిలేంద్రదేవు గజపతి మాదలాపంజిలో నిచ్చిన తిథిని మృతుడుగా లేదని నమ్మెను. ఈ నమ్మకమునకు మరియొక కారణముగూడ నున్నది.

బుర్హానీమజారులో నొక అంశము వ్రాయబడినది-

'In this year the Queen Mother Makhdumah Jahan died, and in A. H 875 (A. D. 1470) the Sultan assumed the reins of Government.

In the midst of these affairs a messenger arrived from Telingana and informed the Sultan that the Raya of Orissa, who was the principal Raya of Telingana, was dead.'

ఇందులో 'the Raya of Orissa who was the principal raya of Telingana' అనగా కొండవీడు నేలుచున్న యోఢ్రరాజని యర్థము స్పష్టముగా నున్నను Sewell మొదలైన విజయనగర సామ్రాజ్యచరిత్రకారులు ఓఢ్రరాజ్యమున కెల్ల ముఖ్యుడైన కపిలేంద్రుడే యని యర్థముచేసికొనుటచే వారిదారినే చక్రవర్తిగారు గూడా వెళ్లి కపిలేంద్రదేవు క్రీ. శ. ౧౪౭౦ లో చనిపోయెనని భావించిరి. క్రీ. శ. ౧౪౬౭ నుండి కొండవీడుప్రాంతముల (తెలింగాణము) యందు ముఖ్యమైన ఓఢ్రరాజ దక్షిణకపిలేశ్వర కుమార మహాపాత్రోయని మనము పైన జూచితిమి. ఈ క్రీ. శ. ౧౪౭౦ లో చనిపోయినాడని చెప్పబడినవారు ఈ దక్షిణకపిలేశ్వరుడు గాని ఓఢ్రరాజ్యమున కెల్ల సార్వభౌముడైన కపిలేంద్రదేవ గజపతి గారు. వారు గతించి యప్పటికే ౪ సంవత్సరములు గతించనే గతించినవి. వారెక్కడనో మహానదీతీరమందున్న వారిని మహమ్మదీయు లెరుగనే యెరుగరు. ప్రక్కలో బల్లెమువలె నున్న కొండవీటి ప్రభువుయొక్క క్షేమలాభములు ఎప్పుడును వారికి గావలెగాని యెక్కడో ఉన్న సార్వభౌముని సంగతి వారి కేల? వారికి నుత్సాహజనకమైనది కొండవీటిప్రభువు మరణము. కాన మనోమోహన చక్రవర్తిగారు మొదలైనవారు పొరబడిరి. వీర శ్రీ గజపతి గౌడేశ్వరనవకోటికర్ణాట కలబర్గేశ్వర ప్రతాప కపిలేంద్రదేవుగారు క్రీ. శ. ౧౪౬౭ నవంబరు ౨౫ మంగళవారమున స్వర్గస్థులైరన్నదే నిశ్చయము.

కపిలేంద్రదేవుగారు రాజ్యమును పునరుద్ధారణచేసి ఓఢ్రసామ్రాజ్యమును బలపరచినందుకు వీరిపేరున నొక శక మేర్పడి నేటివరకును నోఢ్రపంచాంగములలో గణనచేయబడుచున్నది.

వీరు గజపతినాణెములను ముద్రవేయించిరి. అందు ఒకవైపున సర్వాలంకారసంపన్నమైన గజేంద్రుడు

౨౮. Burhan-i-Masa'ar.

ముద్రించియున్నది. దీని ఛాయాచిత్రము R. D Banerji గారి History of Orissa, Vol. I లో ఇచ్చియున్నది. V. A. Smith గారి Catalogue of Coins in the Calcutta Museum, Vol VIII లో ఉన్నదనికూడ వ్రాసినారు. బానర్జిగారు యీ యీగజేంద్రుని పోల్చలేక జిలుగని యన్నారు. ఇది వీరన్నదో, V. A Smith గారన్నదో నేను స్పష్టముగా జెప్పలేను. కాని బానర్జీగారి హిస్టరీలోమాత్రం యెవరెవరు చెప్పిన సంశేములో యెక్కించినారుగాని వారు స్వంతముగా నాలోచించి వ్రాసిన సంశ మొక్కటియు లేకపోవుటచే గజమును జిలుగుగా బోల్చుటకూడా V. A. Smith గారిదే యాయని నా కనుమానము.

కపిలేంద్రదేవుగజపతిగారి యనంతరము వారి పుత్రులు పురుషోత్తమదేవుగజపతిగారు ఓఢ్రరాజ్య సింహాసనము నధిష్ఠించిరి.

(సశేషము)



జీడిపప్పు బట్టీ　　　　A. N. S.

# రా ద్రో హి

శ్రీ శ్రీనివాసశిరోమణి

౧౯౧౬ సంవత్సరము ఏప్రిల్ నెల ౨౨ వ తేది శనివారమునాడు వచ్చిన(లండన్) "టైమ్సు" పత్రికలో యీక్రిందిశీర్షికతో ఒకవర్తమానము కనుపించినది. "పడవలో యుద్ధసామగ్రి. ఐరీషు సముద్రతీరాన పట్టుకొనడమయినది." కర్ హౌస్ స్ట్రాండులో "అర్డుఫర్ట్" పోలీసువాండ్లు నిన్న తెల్లవారుఝామున నాల్గుగంటలకు ఒకపడవలో చాలామందుగుండుసామగ్రి పట్టుకొన్నట్టు "ట్రాలి"కి రాత్రి వర్తమానము వచ్చినది.

ఆప్రాంతములలో — ఏజాతివాడో తెలియని ఒకణ్ణిపట్టుకొని ఖైదులో అట్టిపెట్టినారు. ఆ పడవ ఏదేశమునుంచి వచ్చినదో, ఆ ఆయుధసామగ్రి ఎవరికోసరము వచ్చినదో ప్రస్తుతము తెలియలేదు."

ఈవార్త పత్రికలో కనుపించినప్పుడు యింగ్లీషు దేశములో ఎవళ్లూ అట్టేశ్రద్ధతో యోచించలేదు. కొద్దిరోజులయినతరువాత "సర్ రోజరు కేసుమెంటు" అనే ఆయన ఆమందుగుండుసామగ్రిని ఐరీషుదేశానికి దిగుమతిచేసినాడని తెలిసేసరికి యావత్తు బ్రిటీషుప్రభుత్వము నిర్ఘాంతపోయినది. సర్ రోజర్ కేసుమెంటు అటువంటిపని చేస్తాడని ఎవళ్లూ కలలోనైనా అనుకోలేదు. అప్పటికి కొద్దిరోజుల కిందటివరకూ బ్రిటీషు సామ్రాజ్యములో ఉన్నతపదవులలో ఉండి సామ్రాజ్యముయొక్క మన్ననలను పొందినాడు. ఏదో ఉద్యోగధర్మము చక్కగా నిర్వర్తించి ఊరక కీర్తి గణించినవాడుకాడు. దక్షిణ అమెరికా మధ్య ఆఫ్రికా దేశాలలో బ్రిటీషుకన్సలేటు (రాజప్రతినిధి) గా ఉండి ఆయన బ్రిటీషుసామ్రాజ్యానికి చేసిన సేవను — ఒక్క బ్రిటీష్‌దేశమేకాదు, యావత్తు నాగరకప్రపంచమూ వెయ్యినోళ్లతో పొగిడింది. "కాంగో"(మధ్యాఫ్రికా) లో ఉద్యోగముచేస్తున్నరోజుల్లలో కేవలమూ ఆయన ప్రయోజకత్వమువల్ల, ఆయన ఔదార్యమువల్ల ఆదేశస్థులకు జరుగుతున్న అపకారాలను లోకానికి వెల్లడిచేసి అటు అనాగరకజనులకూ, ఇటు నాగరక ప్రపంచానికీ తలలో నాలిక అయినాడు. బ్రిటీషుసామ్రాజ్య ధురంధరులలో ముఖ్యుడుగా పేరు గణించినాడు. సామ్రాజ్యానికి ఆయనచేసిన ఉపకారానికీ, ఆయన తీసుకొని వచ్చిన ఖ్యాతికీ మెచ్చుకొని బ్రిటీషుప్రభుత్వము ఆయనకు సి. యం. జి. అనే బిరుదాన్ని యిచ్చింది. నలభైయెనిమిదో సంవత్సరము వచ్చేవరకు అనేక అనాగరకపు దేశాలలో కొలువుచేసి ఓపికపోయి పింఛన్ పుచ్చుకొని స్వదేశమయిన ఐరీషుదేశములో కాలము వెళ్లబుచ్చడానికి వచ్చినాడు.

౧౯౧౨ సంవత్సరములో పింఛన్ పుచ్చుకొని కేసుమెంటు యింటికిచేరేనాటికి ఆయనదేహదార్ఢ్యము సంపూర్ణముగా పోయినది. ఒంటరివాడు. పెండ్లి అయినా చేసుకోలేదు. విశేషము ధనార్జన అయినా చేయలేదు. ప్రభుత్వమువారుయిచ్చే పింఛన్ అయినా సామాన్యమయినది. ఏదోఉద్యోగముచేస్తూ సంపాదించిన కీర్తితప్ప మరొకటిలేదు. పదిమందిలో కలసిమెలసి తిరిగి ఏవో వ్యవహారాలునెత్తిన వేసుకొని చక్కబెట్టి పదిడబ్బులు సంపాదించే తెలివితేటలయినా ఆయనకు లేవు. దేశాలుకాని దేశాలలో జీవితమంతా ఉద్యోగములో గడిపినందువల్ల ఆరోగ్యము సంపూర్ణముగా పోయినది. ఏకాంతముగా, ఏకాకిగా స్వదేశములో కాలక్షేపముచేస్తున్నాడు. అటువంటివాని భవిష్యత్తు ఎంత అంధకారముగా ఉంటుందో ఎవరు చెప్పగలరు! అయితే ఆయన అనేక రకమయిన మనిషి. కుర్రవాండ్లలాగా వెర్రిఊహాగానాలు చేయడము ఆయన కలవాటు. ఊహాగానము చేయడమే ఆయనస్వభావము. ముందువెనకలు ఆలోచించకుండా యుక్తాయుక్తములు గుర్తించకుండా యుద్ధానికి సన్నద్ధుడయ్యే యోధుడిలాంటి స్వభావ మాయనది. అయితే పదిమందితో తన అభిప్రాయాలు నచ్చచెప్పి వాండ్లను వెంటవేసుకొని తన

పనులు నెరవేర్చుకొనే చాకచక్యము లేదు. ఇటువంటి వాడు ఐరిషుదేశములో నివసించడానికి వచ్చినాడు.

ఐర్లాండుదేశములో ఆరోజులలో స్వాతంత్ర్యోద్యమము గందరగోళముగా సాగుతున్నది. ఐరిషువాండ్లకున్నంత దేశాభిమానము భూభాగములో ఏదేశమువాండ్లకూ లేదు. అదొకపిచ్చవంటిది. ఆపిచ్చ దేశాభిమానానికి అంతూపంతూ లేదు. స్వాతంత్ర్యముకోసరము కుర్రవాండ్లు ఏవేవో పిచ్చిపిచ్చిపనులన్నీ చేయడానికి తలపెడుతున్న రోజులవి. అయితే ఐరిషువాండ్లలో బుద్ధిమంతులయినవాండ్లు తొందరపడి పిచ్చికల్లోలాలు తీసుకొనిరాగూడదని హితబోధ చేసేవారుకూడా ఉన్నారు. అయితే కుర్రసజ్జుతోండిసకూ, సాడావిడికీ అడ్డు ఏమిటి? మారదృష్టి తక్కువ. రాజకీయాలలో ఎంతో మారదృష్టికలవాండ్లుకూడా రాజ్యముచేతులో బోల్తాకొడుతూ ఉంటారు. కేసుమెంటు వెర్రిఉత్సాహము కలవాడు. అతనిజన్మ ఐరిషుదేశస్థులాగానే వెర్రిదేశాభిమానము. పైగా ఊహాగానము చేసేవాండ్లలో అగ్రసరుడు. అందువల్ల కుర్రకారుతో దేశాభిమానములో పడిపోయినాడు. ఇక ఊహాగానాలు స్వాతంత్ర్యముకోసరము చేయడము మొదలుపెట్టినాడు. కేసుమెంటు స్వార్థరహితుడు. తన స్వార్థరహితమయిన బుద్ధివల్లనే బ్రిటీషుసామ్రాజ్యపు మెప్పులను పొందినాడు. సహజ స్వార్థరహిత బుద్ధితోటే సాడావిడికుర్రకారుతో కలసిపోయినాడు. అయితే ఉపన్యాసాలిచ్చి జనసమూహాన్ని ఉద్రూతలూగించే శక్తిలేదు. సమస్తాన్ని దేశముకోసరము త్యజించి త్యాగమూర్తి అనే ఖ్యాతి సంపాదించడానికి- ఆయనకున్నదంతా ఆయన భోజనానికి బొటాబొటీగా సరిపొయ్యే పింఛనే. ఇక పదిమంది యువకులను చేరదీసి వాండ్ల చిత్తవృత్తులను కనిపెట్టి ఉత్సాహపరచి పనులు చేయించే నేర్పరితనము అయినా లేదు. కాని వెర్రిమంత్రాంగము-తిక్కమంత్రాంగముచేసే తెలివితేటలుమట్టుకు కావలసినవాటికన్న ఎక్కువగా ఉన్నవి.

ఇటువంటివాణ్ణి ఐరిషుయువకులు - దేశభక్తులంతా నాయకుణ్ణిగా పెట్టుకోదలచుకొన్నారు. నాయకత్వము వహించడానికిమాత్రము ఆయన ఒప్పుకోలేదు. నాయకత్వము వహించడానికి తనకున్న యోగ్యతలు స్వయముగా గుర్తుపట్టి కాబోలు, కేసుమెంటు అంగీకరించలేదు. పాపము, కేసుమెంటుకు దేశసేవ ఎట్లా చేయవలెనో తెలిసిందికాదు. స్వాతంత్ర్యముకోసరము తానేమిచేయవలెనో అసలు ఊహించనేలేకపోయినాడు. అమాయకులు, అనాగరకులు అయిన ఆఫ్రికాదేశమువాండ్లు తెల్లవాండ్ల చేతులలోపడి వాండ్లు అనుభవిస్తున్న ఘోరబాధలుచూసి ఓర్వలేక, తాను ఉన్నతోద్యోగములో ఉన్నందున ఆఘోరకృత్యాలను ప్రభుత్వానికి తెలియజేసి ప్రభుత్వసహాయముతో నివారించడానికిన్నీ, బలవంతమయిన ప్రభుత్వానికి దాస్యముచేస్తున్న దేశానికి మోక్షము యిప్పించడానికిన్నీ ఏమీసంబంధము లేదు. అక్కడ బలవంతమయిన ప్రభుత్వబలము ఉంటుంది. ఇక్కడ ఏరెండుతలలూ కలియని కుర్రమూక ఉంటుంది. ఈ కుర్రమూకతో స్వాతంత్ర్యముకోసరము పాటుపడి ప్రభుత్వముతో పోట్లాట సాగించవలెను. అసమానమయిన ప్రజ్ఞ ఉంటేనే కాని సాధ్యముకాదు. అనుచరులను నీళ్లలో మునగమనడానికి కానీ, నిప్పులో దూకమనడానికి కానీ, ముడుచుకొని కూర్చోమనడానికి కానీ ఎంతో ప్రజ్ఞ ఉన్నవాడికికూడా అప్పుడప్పుడు అసాధ్యమే అవుతూ ఉంటుంది. అక్కడ ప్రభుత్వములో యీ విధముగా ఉండదు. తమప్రతినిధి ఏమి చెపుతున్నాడో తెలుసుకొని ప్రపంచములోకల్లా బుద్ధిమంతులని పేరుపొందిన మంత్రులంతా జాగ్రత్తగా విషయాన్ని పరిశీలించి అవసరమయినపనులన్నీ నెరవేరుస్తారు. న్యాయము, ధర్మము అనేది ప్రభుత్వము ఆచరణలో పెడుతుంది. ఇక్కడనో అర్థబలము, అంగబలము, బుద్ధిబలము, సమస్తబలమూ కల ప్రభుత్వము ప్రబలవిరోధి. జనసామాన్యము రాజకీయవిషయాలు చప్పున అవగాహనచేసుకొనలేదు. సమస్తమూ ఉత్సాహముతో గంతులువేసే యువకులమీద ఆధారపడిఉంటుంది. అటువంటి యువకులమీద ఆధారపడి రాజకీయవ్యవహారములో జోరబడడముకంటె బుద్ధిమాంద్యము యింకొకటి ఉంటుందా! అయితే

ఆ ఉత్సాహములో, ఆ ఉద్రేకములో, ఆ ఆవేశములో సర్ రోజరుకేసుమెంటుకు యుక్తాయుక్త వివక్షతా జ్ఞానము పోయినది.

ఐర్లాండు స్వాతంత్ర్యోద్యమములో రెండురకాల వాండ్లున్నారు. ఒకళ్లు మితవాదులు. రెండోవాండ్లు అతివాదులు. కేసుమెంటు అతివాది. "కార్సన్" అనే న్యాయవాది. ఐరిషువాడు. తరవాత న్యాయమూర్తి కూడా అయినాడు. ఐరిషు రాజకీయాలలో మితవాది. కేసుమెంటు రాజకీయజ్ఞానమంతా "కార్సన్" వల్ల నేర్చుకొన్నదే. కార్సను అంటే ఆయన ఉత్సాహముతో పొంగిపొయ్యేవాడు. ఒకప్పుడు అతివాదులసభ ఒకటి జరిగింది. పాపము కేసుమెంటు ఉత్సాహాతిశయములో సభాసదుల చిత్తవృత్తులను గుర్తించకుండా కార్సన్‌కు వందనము లర్పించినాడు. మితవాదికి ఆసభలో వందనాలు చెప్పినందుకు సభాసదులకు పట్టరాని కోపమువచ్చినది. బల్లలూ, కుర్చీలు తీసుకొని కేసుమెంటును కొట్టడానికి సిద్ధము అయినారు. కేసుమెంటు రాజకీయజ్ఞానమూ, లోకజ్ఞానమూ యిటువంటిది. పసిపిల్లవాడికి ఉండే ఉత్సాహమూ, ఉద్రేకమూ తప్ప మరొకటి ఆయనకు లేదు.

కేసుమెంటుకు రోజురోజుకు దేశాభిమానము ఎక్కువయిపోవడము మొదలు పెట్టినది. ఐరోపా మహాసంగ్రామానికి కొద్దిరోజులకుపూర్వము "ఐరిషురెవ్యూ" అనే పత్రికలో "ఐర్లాండు - జర్మని, రాబోతున్న యుద్ధము" అనే శీర్షికతో ఒకవ్యాసము వ్రాసినాడు. "ఐర్లాండుద్వీపములో ఉన్నవాండ్లంతా యూరోపియనులు. వాండ్లు యింగ్లీషువాండ్లుకారు. అందువల్ల అనేకశతాబ్దాలనుంచి ఐర్లాండువాండ్లు యింగ్లీషు ప్రభుత్వములోనుంచి తొలగిపోవలెనని మొరపెట్టుకొంటున్నారు." ఇంతేకాదు. ఇంకా చాలా విపరీతవిషయాలు ఆయనవ్రాసినాడు. ఐర్లాండుదేశాన్ని జర్మని ప్రభుత్వము పరిపాలించినా మంచిదేకాని ఇంగ్లీషు ప్రభుత్వము పాలించడముమాత్రము పనికిరాదన్నాడు. ఆయన అభిప్రాయము పాలకులు జర్మనీవాండ్లు అయితే ఐర్లాండుకు స్వాతంత్ర్యము వెంటనే యిస్తారనికాబోలు!

౧౯౧౪ సంవత్సరము వచ్చేసరికి కేసుమెంటుకు యీ పిచ్చి ఊహ ఎక్కువయిపోయింది. ఇందుకోసరమనే ౧౯౧౪ వ సంవత్సరము వేసంగిలో అమెరికాదేశము వెళ్లినాడు. అక్కడ-అమెరికాలో-ఉన్న జర్మనురాయబారితో ఈవిషయాన్ని అంతా ముచ్చటించినాడు. జర్మనీవాండ్లు ఐరిషువాండ్లతో సఖ్యము కుదుర్చుకో వచ్చునని సలహాయిచ్చినాడు. ఇంగ్లీషు ప్రభుత్వములోనుంచి ఐర్లాండు తొలగిపోవడానికి మరొకదేశమువాండ్లతోచేరి వాండ్ల సహాయమువల్లనే తప్ప మరొకవిధముగా సాధ్యముకాదని ఆయన విశ్వాసము.

ఇక ఒకచెంప యుద్ధము ఆరంభమయినది. ఇంగ్లీషువారు 'మిత్రమండలి' లో ప్రవేశించినారు. ఇటు ఐర్లాండుదేశములో వాండ్లలో వాండ్లకు అభిప్రాయభేదములు వచ్చినవి. చివరకు రాజభక్తి విజృంభించినది. అనేకమంది యుద్ధములో భటులుగా తయారుఅయినారు. కేసుమెంటు ఆశలన్నీ మట్టిలో కలిసిపోయినవి. ఆయనమాదిరిగా ద్రోహాలోచనచేస్తున్నవాళ్ల సంఖ్య చాలాస్వల్పము. బ్రిటిషుసామ్రాజ్య గౌరవమే ఐరిషుగౌరవమని అసంఖ్యాకులు నిర్ణయించినారు. కేసుమెంటు రాజకీయవిషయాలలో కూడా ఏకాకి అయిపోయినాడు. ఆయనకు అనుచరులనేవారే లేకపోయినారు. ఆయన త్రికరణశుద్ధిగా విశ్వసించిన ధర్మాలను ఆయనే ఒంటరిగానే ఆచరణలోకి తీసుకొని రావడానికి నిశ్చయించుకొన్నాడు. మరొకరి ప్రోత్సాహముకానీ, ప్రోద్బలముకానీ ఆయనకులేదు. ప్రపంచమంతా వ్యతిరేకమయినా ఆయనది వెనుదీసే స్వభావము కాదు. ఒకవేళ ఐరిషుదేశస్థులంతా ఆలోచించుకొని తమకు స్వాతంత్ర్యము అక్కరలేదని నిశ్చయించుకొన్నా కేసుమెంటుమాత్రము ఐరిషుదేశస్వాతంత్ర్యానికే ప్రాణాలు ధారపోస్తాడు.

ఈ యుక్తాయుక్తములు తెలియని దేశాభిమానముతో జర్మనీదేశము పోవడానికి అమెరికానుంచి ఒక 'ప్యాసుపోర్టు' సంపాదించినాడు. ఒకనౌకరును నార్వేదేశపువాణ్ణి వెంటపెట్టుకొని యుద్ధము మహాభయంకరముగా జరుగుతున్నరోజులలో జర్మనీకి బయలుదేరి

వాడు. ఆసమయములో జర్మనికి సరాసరిపోవడము సాధ్యముకాదు. అందుకోసరము చుట్టు తిరిగిపోవడానికోసరము ముందు నార్వేదేశానికి వెళ్లదలచుకొన్నాడు. "ఆస్కార్" అనే నార్వేదేశపు ఓడలో ప్రయాణము సాగించినాడు.

అనుకొన్నంత సుఖముగా ప్రయాణము సాధ్యపడలేదు. మార్గమధ్యములో బ్రిటీషుఓడ ఒకటి ఆనార్వే ఓడను అటకాయించి అందులో ప్రయాణముచేస్తున్న వాండ్ల నందరిని సోదాచూసినారు. ఆప్రయాణీకులలో అర్గురు జర్మనీవాండ్లను పట్టుకొని ఖైదీలుగా తీసుకొన్నారు. అయితే కేసుమెంటుదగ్గిర అమెరికాదేశపు "ప్యాసుపోర్టు" ఉన్నది. ఆయననౌకరు నార్వేదేశపువాడు. వాండ్లుభయులూ నార్వేదేశమే వెళ్లుతున్నారు. వాండ్లు ఆశంకించినప్పటికిన్ని యీయిద్దరిని యుద్ధనిబంధనలప్రకారము ఖైదుచేయడానికి అవకాశము లేకపోయినది. కాని వీండ్లమీద అనుమానమయితేమాత్రము కలిగింది. అనుమానము కలిగినా ప్రయోజనము లేకపోయినది. కేసుమెంటూ ఆయననౌకరూ సురక్షితముగా నార్వేదేశము చేరినారు.

నార్వేదేశములోఉన్న బ్రిటీషులెగేషన్ (రాయబారి) వారు కేసుమెంటును గురించి అనుమానపడినారు. వెంటవెంట యింగ్లీషుగూఢచారులు ఆయనజాడలు కనిపెట్టసాగినారు. ఆయననౌకరును పట్టుకొని అనేకరకములయిన ప్రశ్నలువేసినారు. కాని ఆయన ఏవ్యవహారముమీద వచ్చినాడో వాండ్లకు అంతుచిక్కలేదు. కేసుమెంటు రహస్యాన్ని బయటపెడితే ఎంతో బహుమానము వస్తుందని ఆనౌకరుతో వాండ్లు చెప్పినారు. కేసుమెంటు జర్మన్ లెగేషన్‌వారిని పట్టుకొని మెల్లిగా జర్మనుదేశము వెళ్లవలెననే ప్రయత్నములో ఉన్నాడు. ఆయన్ను ఎట్లాగైనా పట్టుకొని ముందుగా ఇంగ్లీషు లెగేషన్‌వారికి ఒప్పగించవలెననే ప్రయత్నములో యింగ్లీషుగూఢచారులు ఉన్నారు. ఈ సంగతి ఆయన తెలుసుకొన్నాడు. వాయువేగమనోవేగములతో నౌకరును జర్మన్ లెగేషన్‌వారివద్దకు పంపించినాడు. ఉదయము ఏడుగంటలకు జర్మన్ లెగేషన్‌వారిని కేసుమెంటు కలుసుకొనడానికి అనుజ్ఞ అయినది. ఉదయమే తెల్లవారగనే ఒకకారులో బయలుదేరినాడు. వెంట యింగ్లీషుగూఢచారులు వస్తున్నారని తెలుసుకొన్నాడు. కారు ఒకసందుదగ్గిర మలుపుతిరుగుతూఉన్న సమయములో కారులోనుంచి మెల్లిగా బయటకుదిగి ఆకాస్తసేపూ దాగుకొని ఎవరికండ్లాబడకుండా జర్మన్ లెగేషన్‌వారి దర్శనముచేసినాడు. ఆయన ఉద్యమాన్ని జర్మన్ విదేశాంగమంత్రికి ఫోనులో చెప్పి ఆయన అనుజ్ఞ అయినతరువాత కేసుమెంటుకు కబురు పంపేటట్లు జర్మన్ లెగేషన్‌వాండ్లు చెప్పినారు. తిరిగీ బసకు చేరినాడు. అత్యాత్రముతో ఎప్పుడు వర్తమానము వస్తుందోనని కనిపెట్టుకొని కూర్చున్నాడు.

బ్రిటిషులేగేషన్ గూఢచారులు అత్యంత జాగ్రత్తతో ఆచోకీ తీస్తున్నారు. ఆయననౌకరును నిర్బంధించినారు. రహస్యము చెపితే విశేషముగా బహుమానము చేస్తామన్నారు. ఆనౌకరు తాత్కాలికముగా వాండ్ల చేతులలోనుంచి తప్పించుకొని వచ్చి యజమానితో యావద్విషయాలూ చెప్పినాడు. కేసుమెంటు వెంటనే ఒకకొత్తఎత్తు వేసినాడు. నౌకరువెళ్లి బ్రిటిషు లెగేషన్‌వారితో చెప్పినాడు. తనను కూడా ఆయనతోపాటు జర్మనీదేశము వెళ్లనిచ్చేటట్లయితే ఆయనదగ్గిర నౌకరుగానే ఉంటూ గూఢచారిగా ప్రవర్తిస్తానని చెప్పినాడు. మార్గాంతరములేక వాండ్లు అందుకు ఒప్పుకొన్నారు.

చీకటిపడింది. జర్మన్ విదేశాంగమంత్రిదగ్గరనుంచి వర్తమానము ఏమీ రాలేదు. ఆ ఆదుర్దాలో తెల్లవార్లూ ఆయనకు నిద్రపట్టలేదు. చిట్టచివరకు జర్మనీ దేశానికి కేసుమెంటును పంపమని ఆజ్ఞ అయినట్లు జర్మన్ లెగేషన్‌వాండ్లు కబురు పంపినారు. ఆయనా, ఆయన నౌకరూ కలసి జర్మనీదేశము ఆ ఉదయమే బయలుదేరి వెళ్లిపోయినారు. కేసుమెంటు జర్మనీలో ప్రవేశించిన తర్వాత అక్కడివాండ్లంతా ఆయన్నుచూసి ఆశ్చర్యపోయినారు. కేసుమెంటుకు జర్మన్ భాషలో ఓనమాలయినా రావు. ఆయనగొడవ వాండ్లకు కానీ వాండ్లగొడవ ఆయనకు కానీ చప్పున తెలియడానికి వీలులేకపోయింది అటువంటి సమయాలలో భాష

రాకపోయినంత మాత్రాన ఆగిపోతుందా? అందులో నిన్న మొన్నటివరకున్నూ బ్రిటీషు సామ్రాజ్య ధురంధరులలో ప్రాముఖ్యతపొంది, వృద్ధాప్యమువల్ల కృశించిపోయి, ఆరోగ్యమంతా చెడిపోయి కాటికి కాళ్లు చాచుకొన్నవాడు ఐరిషుయోధులను తయారు చేస్తాను, జర్మనీవారు సహాయముచేసేట్లయితే బ్రిటీషు వాండ్ల చూరులో నిప్పుపెడతానని వచ్చినవాణ్ణి ఆ సమయములో తోసిపుచ్చుతారా? అయితే వాండ్లకు అనేక సందేహాలు కలిగినవి. ఆయన్ను వాండ్లు పూర్తిగానమ్మడానికి కొంతకాలము పట్టినది. మొట్టమొదట కొంతమంది - ఆయన జర్మనీ వర్తమానాలను కనుక్కొని పోవడానికి యీమిషతో వచ్చినాడని అనుకొన్నా ఇంకాకొంతమంది బుద్ధిమంతులు - ఆయనతలపెట్టినది సాధ్యము అయ్యేదికాదు. కేవలము వృద్ధాప్యమువల్ల మతిచెడిపోయి యీవిధముగా వచ్చినాడని అన్నారు. ఐరిషుదేశములో స్వాతంత్ర్యముకోసరము జరుగుతున్న గందరగోళమంతా పైత్యజ్వరములాంటిదని వాండ్లకు తెలుసును. ఆజ్వరము సంధిలోకి దిగుతుందా దిగదా అనే వారిఅనుమానము. సంధిలోకి దిగేట్లయితే చాలును. అయితే ఆసన్నిపాతమంతా అప్పటికి కేసుమెంటు ఒకడికేపుట్టింది. జర్మనీవాండ్లు అటువంటి సందేహములో ఉన్నారని తెలిసే "నాకు యీషణ్మాత్రమూ సంశయము లేదు. వందలకొలది, వేలకొలది నాకు అనుచరులు ఏర్పడుతారు. జర్మనీలో ఖైదీలుగా ఉన్న ఐరిషు వాండ్లే ముందుగా నాకు అనుచరులు అవుతారు అవకాశమిచ్చి చూడవలసినది." అని జర్మను విదేశాంగ మంత్రికి ఉత్తరము వ్రాసినాడు.

చిట్టచివరకు జర్మన్ ప్రభుత్వము కేసుమెంటుకు అవసరమయిన సహాయాన్ని అంతా చేయడానికి నిశ్చయించుకొన్నది. నిజముగా ఆయనప్రయత్నాలన్నీ సఫలమయ్యేట్లయితే జర్మనీ విజయము చూపుమేర దూరములో ఉంటుంది. ఒకవేళ కేసుమెంటు ప్రయత్నాలన్నీ నిష్ఫలము లయినప్పటికిన్ని జర్మనీవారు అందువల్ల చెడిపొయ్యేదికానీ నష్టపడేదికానీ ఏమీ ఉండదనికూడా నిర్ణయించినారు.

జర్మను ప్రభుత్వానికిన్నీ, కేసుమెంటుకున్నూ ఒడంబడిక జరిగినది. ఐరిషుయోధులను యుద్ధములో ఖైదీలుగాఉన్న ఐరిషువాండ్లనందరినీ కేసుమెంటు వెంట పంపేయేర్పాటు. వాళ్లనందరిని ఒకపటాలముగా ఏర్పాటుచేసి ఐర్లాండుకు తీసుకొనిపోయి యింగ్లీషు వాండ్లమీద తిరగబాటుచేయవలెనని ఆయనసంకల్పము. అందుకోసరము ఖైదీలనందరిని లింబర్గుపట్టణానికి జర్మను ప్రభుత్వము పంపించినది. జర్మను ప్రధాన మంత్రి "జర్మనుప్రభుత్వము ఐరిషుదేశము, ఐరిషు ప్రజలు, ఐరిషు ప్రజాసంస్థల శ్రేయస్సునే కోరుతున్నది. వారి జాతీయాభివృద్ధి, వారి దాస్యమోచనము కాంక్షిస్తున్నది." అని ఒకపెద్దప్రకటనముకూడా చేసినాడు.

కేసుమెంటు తలపెట్టినకార్యము అతనుఊహించినంత సులభమయినదికాదు. అక్కడ బందిఖానాలో ఉన్న ఐరిషుయోధులు రాజభక్తిపరాయణులు. మొట్టమొదట ఫ్రాంసుదేశానికి వాండ్ల బలపరాక్రమము చూపించడానికి బ్రిటీషుప్రభుత్వము ఏరిపంపిన ఐరిషు యోధులు వాండ్లు. తరతరాలనుంచి సేనలో కొలువు చేసినారు. తాత్కాలికోత్సాహముతో స్వాతంత్ర్యము కావలెనని చిందులుతొక్కే కుర్రసజ్జుకాదది. వాండ్ల ముక్కూ ముఖమూ కలలోనైనా కేసుమెంటు ఎరగడు. జర్మనీలో అదివరలో బందిఖానాలో వాండ్లు అనుభవించిన ఘోరబాధలనైనా, పాపము, కేసుమెంటు ఎరగడు. ఉత్సాహము - ఉద్రేకములో ఉన్న కేసుమెంటు వాండ్లను కలసుకొన్నాడు. మనోగతాభిప్రాయాలను వాండ్లకు వెల్లడించినాడు. ఇంగ్లీషువాండ్లు ఐరిషు వాండ్లకు చేస్తున్నఅపచారాలను ఆజయిలులో ఉన్న వాండ్లకు ఉపన్యాసమిచ్చినాడు. "బ్రిటీషువాండ్ల మదము అణచడానికి బ్రిటీషుప్రభుత్వములోనుంచి ఐర్లాండు తొలగిపోవడానికి ఒకపటాలము ఏర్పాటు చేయవలెను. ఆపటాలానికి అవసరమయిన సహాయమంతా జర్మన్ప్రభుత్వము చేస్తుంది. వాండ్లు జర్మను ప్రభుత్వసలహాలను అనుసరించి యింగ్లీషుసేనలతో పోరాడవలెను. ఈ విషయాలన్నీ అంగీకరించినవెంటనే వారు జర్మన్ప్రభుత్వమువాండ్ల అతిథులుగా బయలు

దేరి వెళ్లిపోవలెను ” ఈ విధముగా ఉపన్యాసమివ్వడమే కాకుండా యింకావివరముగా విషయాలన్నీ తెలియ జేస్తూ కరపత్రాలను అచ్చువేయించికూడా వాండ్లకు పంచిపెట్టినాడు. అయితే అక్కడవున్న ఐరిషుఖైదీ లంతా రాజభక్తిపరాయణులు. అటువంటి కష్టకాలములో బ్రిటీషుసామ్రాజ్యవినాశనుకోరేది వాండ్లకు నచ్చలేదు. పైగా ఆనాటివరకూ ఖైదీలుగా అనుభవిస్తున్న బాధలన్నీ ఉపన్యాసముతో మరిచిపోలేదు. ఆ బందిఖానాలో ప్రాణాలు కోల్పోవడానికయినా వాండ్లు సంసిద్ధముగా వున్నారు. కాని కేసుమెంటు అభిప్రాయాలతో వాండ్లు ఏకీభవించలేకపోయినారు. పైపెచ్చు కేసుమెంటుమీద వాండ్లకు విపరీతమయిన కోపము వచ్చినది.

కేసుమెంటు ప్రయత్నాలు కొనసాగేటట్లు కనిపించకపోయినప్పటికిన్ని ఆయన ఉత్సాహము, ఆయన ఆశలు మాత్రము తగ్గలేదు. ఈలోపల జర్మను విదేశాంగ మంత్రితో ఆయన సంధిపత్రముకూడా వ్రాయించుకొన్నాడు. ఆసంధి పత్రములో ముఖ్యమయినవి మూడు షరతులున్నవి. ౧. ఐరిషు పటాలము కేవలము ఐరిషువారి కోసరమే యుద్ధము చేయవలెను. కాని ఏ సందర్భములోనూ జర్మనీ దేశప్రయోజనము కోసరముపనిచేయవలసిన అగత్యము లేదు. ౨. జర్మనీవారు నౌకాయుద్ధములోజయము పొందేట్లయితే జర్మను ప్రభుత్వమువారు జర్మను అధికారులను, సైనికులను, ఐరిషు పటాలాలకు సహాయము చేయడానికి ఐర్లాండుతీరముకు వస్తారు. ౩. ఒకవేళ జర్మనీవాండ్లు ఐరిషుదేశమువచ్చి సహాయముచేయడము సాధ్యము కాకపోయేట్లయితే ఐరిషు పటాలాలు ఈజిప్టుదేశము జర్మనీవాండ్ల సహాయముతో వెళ్లి, అక్కడ ఆ ఈజిప్టుదేశములో ఉన్న బ్రిటీషువాండ్లను ఆదేశమునుంచి వెళ్లగొట్టవలెను. ఇటువంటి షరతులతో సంధిపత్రము వ్రాయించుకొని కేసుమెంటు రెండవ పర్యాయము ఖైదీలను ప్రోత్సాహము చేయడానికి వచ్చినాడు.

మొట్టమొదటిసారి బందీలను చూసినప్పుడు వాండ్లు అనంగీకారాన్ని మాత్రమే కనబరచినారు. ఈ పర్యాయము కేవలము ఆయన్ను కొట్టడానికి ఒకరిద్దరు తయారుఅయినారు. అయితే జర్మను అధికారులు వెంట ఉన్నందువల్ల అట్లా జరిగిందికాదు. లేకపోయినట్లయితే ఐరిషుదేశపువాండ్ల చేతులలోనే ఆయనకు దేహశుద్ధి అయివుండేది. ఆయన ప్రయత్నాలు సాగుతవనే ఆశ ఏ మాత్రమూ కనుపించక పోయినప్పటికిన్నీ ఆయన ఉత్సాహము మాత్రము తగ్గలేదు. హతాశుడయినకొద్దీ పట్టుదల హెచ్చిపోయింది. కొంతకాలము గతించిన తర్వాత ఐరిషుఖైదీలను హెచ్చరిస్తే తప్పకుండా ఉన్ముఖులు అవుతారని ఆయన విశ్వాసము. చివరకు పాపము ఆయన జర్మనీవాండ్ల దృష్టిలోనే వింత మనిషిగా తోచినాడు. పిచ్చివాడేమోనని కూడా అనుకొన్నారు. జర్మను పోలీసువాండ్లు ఆయన యోగ్యతను గురించి కూడా అనుమానించ సాగినారు. అదిఅంతా ఆయనకు తెలుసును. అందుకోసరమని ఆయన లింబర్గుపట్టణము వదలిపెట్టి మ్యూనిచ్‌పట్టణములో కొన్నాళ్లు తలదాచుకొనడానికి వెళ్లినాడు.

కొంతకాలమయినతర్వాత తిరిగి లింబర్గుపట్టణానికి వచ్చినాడు. మూడవసారి ఐరిషు ఖైదీలను చూడడానికి వెళ్లినాడు. మళ్లీ వాండ్లను తన ప్రయత్నముకోసరము ప్రోత్సాహపరిచినాడు. ఒకరిద్దరు ఆయన్ను అనుసరించడానికి మొట్టమొదట ఒప్పుకొన్నారు. చచ్చిచెడి ఎట్లాగైతేనేమి యాభైమంది ఆయన ఉద్యమములో చేరడానికి సంసిద్ధులయినారు. అయితే జర్మనీలో ఆనాటికి రెండువేల అయిదువందలమంది ఐరిషు ఖయిదీలున్నారు. అంతమందిని తన ఉద్యమములోకి లాగవలెనని ఎంతో తీవ్రమయిన ప్రయత్నము చేసినారు. ఎంతెంతమందో ఆ పనికి పూనుకొన్నారు. కాని లాభములేకపోయినది. ఆ ఐరిషు ఖయిదీలంతా నసేమిరా అన్నారు. చివరకు హతాశుడయిపోయినాడు. ఉత్సాహము పోయింది. అటూయిటూ తొరట్లాడడము మొదలు పెట్టినాడు. కాని ఆయాభైమందితోనే తన ఉద్యమము సాగించవచ్చుననుకొన్నాడు. ఈయనకంటె నెత్రివాండ్లు జర్మనీవాండ్లు. జర్మను మిలిటరి వాండ్లు ఆయాభైమందికే కవాతు నేర్పడము ప్రారం

భించినారు. అయితే అంతా హాస్యాస్పదముగా ఉందని వారికి తెలియకపోలేదు. పిచ్చిఆశ ఎటువంటి పనులయినా, ఎటువంటి బుద్ధిమంతులచేతనైనా చేయిస్తుంది. అయితే ఆకాస్త పటాలముతో ఐర్లాండువెళ్లి లాభములేదనుకొని జర్మనీవారి కోరికమీద ఒంటను సిరియాదేశము కేసుమెంటు పంపించినారు.

దైవమాయ ఎవరికీ తెలియదు. ఎందుకు ఎప్పుడు ఏమి జరుగుతుందో ఫలపరిపాకము అయిననాడే తెలుస్తుంది.

ముందుగా ఊహించడానికి శక్యముకాదు. ఈ విధముగా జర్మనీలో కేసుమెంటు ప్రయత్నాలుచేస్తూ ఉండగా, అంటే ౧౯౧౬ వ సంవత్సరములో ఈస్టరు పండగలలో అటు ఐర్లాండు దేశములో పెద్ద కల్లోలము పుట్టినది. ఆల్లరిమూక ప్రభుత్వాన్ని ఎదిరించినది. బజారులలోనే తుపాకులతో కాల్చుకొనడము ప్రారంభమయినది. ఈ వర్తమానాలు జర్మనీలో తెలిసినవి. కేసుమెంటుకు ఇక నవకాశము దొరికింది. పిచ్చి ఉత్సాహము వచ్చింది. ఇక ఐర్లాండు దేశానికి అదనుకు అవసరమయిన మందుగుండుసామగ్రితో వెళ్లిపోతే బ్రిటీషు సామ్రాజ్యాన్ని తల్లకిందులు చేయవచ్చుననుకొన్నాడు. ఆపాళంగా ఐర్లాండుకు బయలుదేరినాడు.

ఐర్లాండుదేశములో కెర్రీ సముద్రతీరాన, ట్రాలీ అనే ప్రదేశములో పల్లెవాండ్లు నివసిస్తూ ఉండేవాండ్లు. అది అట్టే నివాసయోగ్యమయిన ప్రదేశమయినాకాదు. ఆ కుగ్రామములో ఉన్నవాండ్లలో జాన్ మెకార్తె అనేవాడు ౧౯౧౬ సంవత్సరము ఏప్రిల్ మాసములో వచ్చే "గుడ్ ఫ్రైడే" నాడు తెల్లవారు ఝామున రెండు గంటలప్పుడు దైవ ప్రార్థన చేసుకోవడానికి ఒకానొక నూతి దగ్గరకు వెళ్లినాడు. వాడు ప్రార్థనఅయిపోయి యింటికి తిరిగి వస్తూ ఉండగా సముద్రపు ఒడ్డున ఒక చిన్న నావ కనబడింది. అప్పుడు పాటు అయినందువల్ల ఆనావ సముద్రములోకి కొట్టుకొనిపొయ్యేటట్టు తోచింది. అందుకోసరము దాన్ని ఒడ్డుకు తోయవలెననేఉద్దేశముతో నావదగ్గిరకు వెళ్లినాడు. ఆనావ చాలా బరువుగా ఉన్నందువల్ల వాడికొక్కడికి సాధ్యముకాలేదు. సాయముపట్టడానికి వాడిస్నేహితుడి కొకడికి రమ్మని తన కుర్రవాడిచేత వర్తమనము కూడా చేసినాడు. ఆ ఉభయులూ కలసి సాధ్యమైనంత వరకు బయటకు లాగినారు. ఆ నావలో ఒక బాకు సాంట్లకు కనుపించినది. ఆనావలోనుంచి మనుష్యులు దిగివెళ్లినట్టు అడుగుల గుర్తుబట్టి ఊహించినారు. జాగ్రత్తగా పరీక్ష చేసేసరికి ఆ నావలోనుంచి ముగ్గురు మనుష్యులు దిగి ఉంటారని తోచింది. ఆముగ్గురూ ఎవరో, ఎక్కడకు పోయినారో తెలుసుకోవలెనని అడుగుల జాడను బట్టి బయలుదేరినారు. పాతికిముప్పయి గజాల దూరము పోయేసరికి అడుగులజాడ కనుపించలేదు. తిరిగీ రేవు దగ్గిరకు వచ్చేసరికి 'మెకార్తె' కుర్రది - ఏనిమిదేండ్ల పిల్ల అపడవలో కూర్చుని ఆ పడవలోఉన్న రివాల్వర్లతో ఆడుకొంటున్నది.

వాళ్లకేమీ తోచక సమీపములో "ఆర్డుఫర్టు" అనే గ్రామములో ఉన్న పోలీసుస్టేషనుకు కబురుచేసినారు. ఆపోలీసుస్టేషన్ చాలాచిన్నది. ముగ్గురు పోలీసు బంట్రోతులు - ఒకసార్జెంటు యీవర్తమానము వచ్చినవెంటనే - ఒక్క క్షణమయినా జాగు చేయకుండా ఆపడవదగ్గిరకు వెళ్లిపోయినారు. ఆ నావనంతా సోదా చూసినారు. రివాల్వర్లు, తుపాకులు మొదలయిన యుద్ధసామగ్రిఉన్నది. తిరిగి వాండ్లు పోలీసుస్టేషనుకు వచ్చి అవసరమయిన సిబ్బంది తీసుకొని ఆకోటకే తీయడానికి బయలుదేరినారు.

ఆ ప్రాంతాలలో ఒక పాడుబడ్డ కోట ఉన్నది. ఆక్కడికే వాండ్లు ఎవరయినా దాగుకొని ఉండవచ్చు ననుకొని పోయినారు. నల్లటిగడ్డము, ముసలివాడు కేసుమెంటు కనుపించినాడు. సార్జెంటు ఏవేవో ప్రశ్నలు ఆయన్ను అడిగేసరికి "నీవెవడవు నన్ను అడగడానికి" అని జవాబు యివ్వలేదు. ఆయన్ను ఖయిదుచేసినారు. ఆనాడు ఉదయము కేసుమెంటును ఖయిదీచేయడానికి ఒక్క

మెకార్తె వర్తమానమే కాదు. ఆరాత్రి సముద్రములో 'బ్లూబెల్' అనేయుద్ధనౌక ఇంగ్లీషుది సముద్రములో జరుగుతున్న విషయాలు కనిపెట్టేనిమిత్తము తిరుగుతున్నది. అర్ధరాత్రి దూరాన ఒక ఓడ వెళ్లుతున్న బ్లూబెల్ కు కనుపించినది. వాండ్లకు సందేహము కలిగి విచారించినారు. అది నార్వేదేశపుదనిన్నీ, జినివా వెళ్లుతున్నట్టున్నూ తెలిసినది. "బ్లూబెల్" వాండ్లు ఆవిషయాన్ని నమ్మక ఆఓడను తమవెంట హార్బరులోకి రమ్మని ఆజ్ఞాపించినారు. 'బ్లూబెల్' తమవెంట ఆఓడ వస్తుందని హార్బరుకు బయలుదేరినది. అయితే ఆనార్వే ఓడ వెంటవస్తూవస్తూ ఆగిపోయినది. కదలకుండా మెదలకుండా ఉండిపోయినది. ఆఓడమీద ఆఓడలోనుంచి ఒకటిరెండు చిన్నినావలను సముద్రములోకి జారవిడుస్తున్నట్టు 'బ్లూబెల్' వాండ్లు తెలుసుకొన్నారు. వెంటనే ఆఓడమీదికి తుపాకిబారుచేసి కాల్చేసరికి బయలుదేరింది. చివరకు తెల్లవారుఝామువరకు ఆ ఓడను వేటాడి పట్టుకొన్నారు. అందులో కొంతమంది జర్మనుదుస్తులతో ఉన్న సైనికులను పట్టుకొన్నారు. వాండ్లను యుద్ధఖయిదీలకింద తీసుకొన్నారు. ఆఓడ ఆగినచోట జలాంతర్గాములువెళ్లి సముద్రము అడుగుభాగాన వెతికినవి. అక్కడ ఒకనావలో విశేషముగా యుద్ధసామగ్రులు దొరికినవి. మరొకనావ ఏమయినదో తెలియక విచారించగా కెర్రితీరానికి వెళ్లినట్టు తెలిసింది. ఈవర్తమానముకూడా పోలీసువాండ్లకు వచ్చినది.

ఈ విధముగా దైవమాయవల్ల ఐరిషువిప్లవకారులకు జర్మనుదేశమునుంచి వచ్చిన యుద్ధసామగ్రులు అందకుండాపోయినవి. నిజముగా ఐరిషువిప్లవము ఆరంభమయ్యేసమయానికే కేసుమెంటు తెచ్చిన ఆయుధాలన్నీ అందిఉండినట్లయితే బ్రిటిషుప్రభుత్వానికి చాలా ఆపద వచ్చిఉండేదని చెప్పడానికి ఏ అభ్యంతరమూ లేదు. భగవదిచ్ఛ లేనంతవరకు మనుష్యప్రయత్నాలన్నీ యీ విధముగా నెరవేరుతవి.

కేసుమెంటును ఖయిదీచేసి లండనుపట్టణానికి పోతున్నసమయములో యిద్దరుఐరిషుయువకులనుపోలీసు వాండ్లు పట్టుకొని వస్తూఉన్నట్టూ, వాండ్లు మార్గమధ్యములో మోటారులోనుంచి ఒకచెరువులోకి దూకినట్లూ వర్తమానముతెలిసింది. కేసుమెంటుకు యీ విషయము తెలియగానే కండ్లవెంట బొటబొట నీళ్లుకారినవి. ఆయన విపరీతమయిన దుఃఖముతో "అయ్యోవాండ్లు అమాయకులు - యోగ్యులు - చిన్నవాండ్లు. వాండ్లను నేను ఎరుగుదును. వాండ్లు నానుంచి అట్లా అయిపోయినారు. ఆనీళ్లలోతు నాకు తెలుసును" అన్నాడు.

కేసుమెంటు అదివరకు ఎన్నిరోజులనుంచో సరిగా నిద్రపోయిఎరగడు. తన్ను లండన్ కారాగృహానికి తీసుకొనివెళ్లుతున్న సంగతి తెలుసును. కారాగృహాలు ఎట్లాఉంటవో ఏనాడూ ఆయన కలలోనైనా ఎరగడు. చాలా డస్సిపోయిఉన్నాడు. వెంటఉన్న పోలీసుభటులతో "ఓ అక్కడ పడుకొనడానికి పక్క ఏమయినా దొరుకుతుందా" అనిఅడిగినాడు. పాపము ఆనాటికి అతను కండ్లుమూసి పన్నెండురోజు లయినట్టు వాండ్లతో చెప్పినాడు. ఆయన్ను లండన్ కారాగృహానికి - అదివరలో ఎంతమందో రాజద్రోహులు - హంతకులు పవ్వళించిన ఆ కారాగృహానికి - తీసుకొనివెళ్లినారు.

౧౯౧౬ సంవత్సరము మేనెల ౧౫, ౧౬, ౧౭ తేదీలలో కేసుమెంటుమీద రాజద్రోహనేరముమోపి విచారణకు హైకోర్టువారికి పంపించినారు ఆకాలములో రీడింగుప్రభువు - మనకు రాజప్రతినిధిగా పనిచేసినవాడు - ప్రధాన న్యాయమూర్తిగా ఉన్నాడు. ఆయనతోపాటు యింకా యిద్దరున్యాయమూర్తులు యీ రాజద్రోహనేరాన్ని విచారించినారు. ఉభయపక్షములా ప్రసిద్ధులు, సమర్థులు అయిన న్యాయవాదులు వాదప్రతివాదము చేసినారు. ౧౩౬౫ వ నిబంధనకింద కేసుమెంటుమీద రాజద్రోహనేరము మోపినారు.

విచారణ ఆరంభము అయినది కేసుమెంటు తరఫున వాదించడానికి సార్జెంటుసల్లివాన్ అనే జగద్విఖ్యాతమయిన న్యాయవాది వచ్చినాడు. ఆయన కోర్టువారు నిర్ణయించిన ప్రకారము కేసుమెంటుమీద రాజద్రోహము నేరము అపాదించడానికి వీలులే

దన్నాడు. రాజద్రోహ చట్టము ౧౩౬౫ నిబంధనలో "మన ప్రభువయిన రాజుగారిమీద ఎవడయినా యుద్ధముచేయడానికి (ఆయన) రాజ్యములో సైనికులను సిద్ధముచేసినా-కాక రాజుగారిశత్రువులతో రాజ్యములో ఏకమయి వారిష్టపు రాజ్యములో కానీ అన్యత్రా కానీ సహాయము, ప్రోత్సాహము చేసినట్లయితే" అని ఉంది. (If a man do any war against our lord the king in his realm, or be adherent to the king's enemies in his realm giving them aid and comfort in his realm or elsewhere") ఇందువల్ల కేసుమెంటు చేసిన నేరము ఈ నిబంధన కిందకురాదు. ఈనిబంధనకు యీనాడు త జాగా అర్థము ఆలోచించవలసినదే తప్ప ఏవో నేరాలన్నీ తీసుకొని వచ్చి ఉదాహరణలుగా చూపించడానికి వీలులేదన్నాడు. రీడింగు ప్రభువు ఆవాక్యానికి అర్థకల్పనము చేసినాడు. ఆపంక్తిలో నున్న అన్యత్ర (elsewhere) అనే శబ్దము ఉభయత్ర అన్వయము చేసుకోవలెనని ఆవాదాన్ని తోసి పారవేసినాడు.

మూడు రోజులు చాలా శ్రద్ధతో, జాగ్రత్తగా నేరము విచారించినారు. ప్రాసిక్యూషన్ సాక్షులను సల్లివన్ ఎదిరించలేదు. ఆసాక్షులు చెప్పిన విషయములో అసత్యము ఉంటేకదా ఎదిరించడానికి సాధ్యమయ్యేది. కాని చివరకు నేరము విషయము కోర్టువారికివిన్నవిస్తూ అత్యంతధైర్య సాహసములతో సార్జెంటు సల్లివాన్ "సర్ రోజరుకేసుమెంటు ఇంగ్లీషుకాలువులో లేదు, సంయుక్త ప్రభుత్వములో ఉద్యోగము చేసినాడు. .ఐర్లాండు దేశము వేరు- ఐరిషుప్రజలు వేరు. ఐరిషువానికి ఐరిషుదేశభక్తి ఉంటుంది. ఒక దేశముమీద దేశభక్తి తోటిదేశానికి రాజద్రోహము అయి, అందుకు- ఆదేశభక్తికోసరము శిక్షించిన దినము సామ్రాజ్యానికి దుర్దినము. ఐర్లాండు దేశానికి యింగ్లీషు న్యాయము authority) అన్వర్తించదు............ ఐరిషువాండ్లు యింగ్లీషువాండ్లకంటె తక్కువ వాండ్లు కానీ, బానిసలు కానీ కారు." అనిచెప్పినాడు.

రాజద్రోహనేరము స్థిరపడిపోయినది. న్యాయమూర్తులు ఉరిశిక్ష విధించినారు. అయితే రీడింగు ప్రభువు నిందితుడు చెప్పకోతగిన విషయాలకు అవకాశమిచ్చినాడు. అందుకు కేసుమెంటు తయారుచేసుకొన్న ఉపన్యాసము కోర్టులో చదివినాడు. తన్ను విచారించడానికి యింగ్లీషుకోర్టుకు హక్కులేదనీ, తనమీద నేరము మోపడానికి తీసుకొన్న చట్టము చాలా పాతదనీ, ఆనాడు ఆచట్టము ప్రకారము నేరారోపణచేయడము చాలాఅధర్మమనీ చెప్పినాడు. కేసుమెంటు ఉపన్యాసములు ఎన్నడూ చేసెరగడు. తడబడుతూ, అర్థము కాకుండా ఉపన్యాసాన్ని చదివినాడు. అయితే మధ్యలో "స్వరాజ్యము మా జన్మహక్కు అని మాకు ఉగ్గుపాలతో పెట్టినది. అది ఒకరుముష్టిపెట్టేది కాదు. దాన్ని మరొకళ్లు అభ్యంతర పెట్టడమనేది ప్రాణాలు తీసివేయడమే..."అని చదివేటప్పుడు మాత్రము ఎంతో గంభీరముగా గొంతుఎత్తి చదివినాడు. కోర్టులో యిటువంటి ఉపన్యాసాలు రాజద్రోహ నేరముకుగాను చదవడముకల్ల ప్రయోజనము ఏమిఉంటుంది? అయితే ఆ ఉద్రేకము అట్లాచేయిస్తుంది.

౧౯౧౬ సంవత్సరము జూన్ నెల ౨౯ వ తేదిన కేసుమెంటు "చచ్చిపొయ్యేవరకు గొంతుకు ఉరిపోయవలసినది" అని కోర్టువారు తీర్పుచెప్పినారు. ఈతీర్పును అతినిర్లక్ష్యముగా విన్నాడు. ఆయనముఖాన చిరునవ్వు చిందులాడింది.

తర్వాత అప్పీలులోకూడా చాలాశ్రద్ధతో విషయాలన్నీ పరిశీలించినారు. కాని లాభము లేకపోయినది. ఆగష్టు నెల 3 వ తేదిన "పెంటన్‌విల్లీ" కారాగృహములో ఉదయము ఎనిమిదిగంటలప్పుడు సర్ రోజరు కేసుమెంటును ఉరితీసినారు.

ప్రభుత్వము ఆయనశేరాన్ని మన్నించవలసినదని అనేకమంది ప్రముఖులు దస్కతులుచేసి మహజర్లు పెట్టుకొన్నారు. ఆయన్ను క్షమించమనడానికి తండే కారణాలు ఆమహజర్లలో కనుపించినవి. కొద్దిరోజులక్రిందటనే ఐర్లాండులో తిరుగుబాటువచ్చినది. ఆతిరుగుబాటుకల్లోలము యింకా పూర్తిగా సమసిపోలేదు. అందువల్ల యీ కేసుమెంటును ఉరితీస్తే ఐరిషువారికి ఇంగ్లీషువారి సుహృద్భావముమీద అపనమ్మకము కలు

గుతుంది. అందువల్ల ఐరిషువారికి యింగ్లీషువారిమీద క్రోధము ఎక్కువయిపోతుందని కొంతమందిఅన్నారు. కేసుమెంటు దేశదేశాలుతిరిగి ఎంతో పనిచేసి ఆరోగ్యము చెడిపోయి మతిపోయి అట్లాచేసినాడు. చాలా మంచి వాడు. కాబట్టి క్షమించవలసినదని యింకొకళ్ల అభిప్రాయము.

ఈరెండు వాదాలున్నూ చాలా దుర్బలములయినవే. ఐరిషుదేశములో వచ్చిన తిరగబాటుకున్నూ కేసుమెంటుకున్నూ ఏమి సంబంధమున్నది? ఐరిషువాండ్లు యింట్లో అన్నదమ్ముల వ్యవహారముగా పోట్లాటకు తయారుఅయినారు. కేసుమెంటు రాజును, రాజ్యాన్ని, సమస్తాన్ని ధ్వంసముచేయడానికోసరము - అందులో ప్రభుత్వము కష్టకాలములోఉన్నప్పుడు శత్రురాజబలముతో సిద్ధముఅయినాడు. ఇక రెండో కారణము కేవలము అర్థములేనిది. మతిపోయినవాడు చేసేపనులా సర్ రోజర్ కేసుమెంటు చేసినవి!

---



సముద్రతీర ప్రాంతము　　　　K. M. R.

# త్యాగము

బి. లక్ష్మీనారాయణరావు

రాత్రి తొమ్మిదిగంటల సమయం. వాన కురిసి అప్పుడే వెలిసింది. కాని ఆకసంలో మేఘము లాడుతూనేవున్నాయి. వెంకటిరెడ్డియింటి హాలులో 'పెట్రొమాక్సు' వెలుగుతూవుంది. హాలునడుమ నొక చిన్నబల్ల, దానిపై పుష్పములుంచుట కుపయోగించు గాజుకుప్పె, గోడలనానుకొని నాలుగు పేముకుర్చీలు, లక్ష్మీసరస్వతులపటములు, వివేకానంద, గాంధి, దయానందసరస్వతి, టాగోరు, సరోజినీదేవి-వీరి ఛాయాచిత్రములు గోడలపై నందందు వేలాడుచున్నవి. తలవాకిలి కెదురుగా నొకగడియారం. హాలు కిరుప్రక్కల రెండు గదులు. ఒకటి ఆఫీసుగది. రెండవది వెంకటరెడ్డి పడకగది. హాలుముందు వరాండా, వెనక చిన్నలోగిలి. వెంకటరెడ్డిపడకగది నానుకొని, అతనిభార్య సీతమ్మ విశ్రాంతిగదిన్ని, యీభాగమున కైదుగజముల దూరమున భోజనస్నానాదికముల కుపయోగించు మూడు చిన్నగదులున్నూ గలవు.

వెంకటరెడ్డి అప్పుడే భోజనంజేసి సిగరెట్టు కాలుస్తూ కుర్చీలో కూర్చున్నాడు. ముప్పదియేండ్ల వయస్సు. వకీలువృత్తిలో ప్రవేశించి ఆరేండ్లయింది. మంచి చాకచక్యం గలవాడనే పేరుతెచ్చుకున్నాడు. నెలకు రెండునూర్లకు తక్కువకాని సంపాదన వున్నదని వినికిడి. పిత్రార్జితమైన భూస్థితికూడా తగినంత కలదు. ఇతనిభార్య సీతమ్మ మంచి మర్యాదస్థుల యింటి యాడుబిడ్డ. పేరునకుతగిన గుణసంపదకలిగి మగని యనురాగాన్ని పొందింది. ఇప్పుడు మూడుమాసముల గర్భవతి. వెంకటరెడ్డి అన్నివిధముల అదృష్టవంతుడనిచెప్ప వచ్చు. మిక్కిలి ఉత్సాహపరుడుకూడను. సాంఘిక విషయములం దెక్కువశ్రద్ధ. ప్రస్తుతం హిందూసంఘంలోవుండే దోషాలను తొలగించి, సంఘాన్ని సంస్కరించవలెనని మిక్కుటమగు ఆశ. 'హిందూ యువజన సంఘ' మనుపేర నొకసమాజం స్థాపించి, దానికి తాను కార్యదర్శియై ప్రతివార మేదో యొకసభ జరిపిస్తూ వుంటాడు. హిందూసంఘమున బాలవితంతువుల దుస్థితి, స్త్రీల బానిసత్వం, పురుషుని స్వార్థం వీటినిగూర్చి దీర్ఘోపన్యాసములిస్తూ కార్యతః కాకపోయినా, తన శక్తికొలది తానూ సంఘసేవ చేస్తున్నానని మురిసిపోతుంటాడు.

కుర్చీలో కూర్చొని సిగరెట్టు కాలుస్తూ, ఆ సాయంకాలం తాను దుర్మార్గులబారినుండి రక్షించిన యనాథ బాలికల భావిజీవితాన్ని గూర్చి యోచిస్తున్నాడు.

ఇంతలో సీతమ్మ తాంబూలంతట్టతో ప్రవేశించింది. వయసు పదునెనిమిదేండ్లుంటుంది. అట్టే పొడగరి కాదు. కాయకష్టమున కోర్వని పలుచని చామనచాయ. చక్కనివారలలో చేర్పదగిన సౌందర్యం. ముఖం శాంత గంభీరభావములకు నెలవు.

సీతమ్మ. ఏమి చాల యోచన చేస్తున్నారు?

వెంకట—రాణిగారు రింకనూ రాలేదే అని.

సీతమ్మ—చాల్లెండి. ఎప్పుడూ మీకుహాస్యమే.

వెంకట—ఎప్పుడెప్పుడు హాస్యంచేయవచ్చునో తెలవి నే.

సీతమ్మ—మీ పుణ్యం వూరుకోండి. ఆపిల్లలు వినేరు.

వెంకట—అన్నట్టు, ఏరీ వాళ్లు?

సీతమ్మ:— భోజనాలయినాయి. నేవద్దంటూంటే తట్టలుకడుగుతున్నది నాగమ్మ. లక్ష్మి వంటిల్లు చక్కబెట్టుతూంది.

వెంకట:—ఆ చిన్నదానిపేరా లక్ష్మి? భేష్! పేర్లుకూడా కనుక్కున్నావే అప్పుడే.

సీతమ్మ—పేర్లనా! వాళ్ల చరిత్రకూడా కను క్కున్నా. పాపం, నా కయ్యో అనిపిస్తుందండి. ఈవాళ మీరు లేకపోతే ఆపిల్ల జీవితం నాశనమయ్యేది.

వెంకట—మన సంఘంలో యెంతమందిస్త్రీల జీవితము లిట్లు పాడయినాయో ఎవరికి తెలుసు. తమ మానప్రాణాలను కాపాడుకోలేని దీనదశలో వున్నారు హైందవస్త్రీలు. పేపర్లలో నిత్య మిట్టివిషయ మొక్క టైనా వుండితీరుతుంది. మగదిక్కులేని వయసువచ్చిన పిల్లలను బలాత్కారంగా యెత్తుకొని పోవడం అసహా యులైన స్త్రీలను మానభంగం చేయడం, ఆడపిల్లలను దొంగిలించుకొనిపోయి, పెంచి, పాపవృత్తికి దింప డం—ఒకటా!

సీతమ్మ—ఆదుర్మార్గులనుపట్టి సర్కారువారు జైలు కెందుకు పంపగూడదు?

వెంకట—నాంప్లపరం వాదించి వాళ్లను తప్పించ డానికి మా వకీళ్లున్నారుకదూ! తమ ఫీజువస్తే చాలు, యెట్టికేసైనాసరే. జాత్యభిమానం, కులస్త్రీగౌరవం మన వాళ్లలోవుంటే, మనసంఘాని కిట్టిదుర్దశ యెందుకు సంభవిస్తుంది! ఏజాతియొక్క జీవితమునకుగాని, పురోభి వృద్ధికిగాని స్త్రీపాతివ్రత్యమే పునాదియని, అట్టి స్త్రీపాతివ్రత్యాన్ని రక్షించేభారం ప్రతిపురుషునిపైన నూ వున్నదని మనవాళ్లు గ్రహిస్తే, మనస్త్రీల నెవ్వడు నేరిపారచూడగలడు. ఈవిషయంలో మనహిందువుల కంటె మహమ్మదీయులు వేయిరెట్లుమేలు. వారికున్న కులాభిమానం, వారిస్త్రీలగౌరవం నిలబెట్టుకోవడంలో వారుచూపు సాహసం, తెగువ అపారం.

సీతమ్మ—మరి యిప్పుడీపిల్లల గతేమండి? ఎవరూ దిక్కులేరే.

వెంకట—ఎవ్వరూ బంధువులేలేరా? వాళ్ల సంగతి కనుక్కున్నావా?

సీతమ్మ—విచారించినాను. ఈపిల్లలకు చిన్న తనాన్నే తల్లి చనిపోయింది. తండ్రి పెంచి పెద్దజేసి నాడు. పెద్దపిల్లను తగుమైనచోటనే యిచ్చినాడుకాని, యీపిల్ల దురదృష్టం, సంవత్సరంలోనే మగనిని పోగొట్టు కొని పుట్టినిల్లుచేరింది. తండ్రివున్నన్నాళ్లూ యెట్లో పిల్లల్నిదగ్గిరె సాకినాడు. ఆతండ్రి పోయి యిప్పటికి ఆరు నెల్లయింది. వున్నకొంతభూమి యీపిల్ల పెండ్లికి జేసిన అప్పులకు పోయింది. పల్లెలో బ్రదుకుదెరువులేక యీ వూర్లో బ్రదుకుకుందామని చెల్లెల్తో వచ్చింది. వూరు చేరీచేరకమునుపే యెవరో దుర్మార్గులు బాధించడం. మీ రాసమయానికి రాకపోతే వీళ్లగతి యేమయ్యేదో!

వెంకట—పెద్దపిల్ల మంచిధైర్యస్థురాలుగా కన పడుతుంది. కాని యేవిధంగా యీవూర్లో జీవనం చేస్తారని తోచడంలేదు.

సీతమ్మ—ఎవరైనా మర్యాదస్థులు తమఇంట్లో పెట్టుకుంటే యింటి పనంతా చేసుకుంటూవుంటారు. అదికాక, యిద్దరూ చిన్నవయసులో వున్నారు. వంట రిగా వుండడం కష్టం.

వెంకట—నిజమే కాని, అట్టివాళ్లెవరున్నారు. విచారించితేగాని తెలీదు.

సీతమ్మ—మనింట్లోనేయెందుకుండగూడదండి? ఇప్పట్లో నాకూడా సహాయ మెవరూలేరు.

వెంకట—ఓహో! ఇదాయెత్తు? బాగనేవుంది. ఇద్దరిని మనం భరించగలమా?

సీతమ్మ—ఇప్పుడు మీరు జవానుకు పదిరూ పాయ లిస్తున్నారు కదండి. వాడేంపని జేస్తున్నాడు? వాణ్ణి పంపివేయవలెనని మీరుకూడా అంటున్నారు. ఇంటిపనులకు సహాయంలేదు. మీరు వూరికిపోయి నప్పుడు నాకు తోడుకూడా లేరు. ఈ పిల్లలయితే యింట్లోనే వుంటారు. నా కన్నివిధములా సహాయం.

వెంకట—నీ కిష్టంవచ్చినప్పుడు అర్గ్యుమెంటు కేంకొదవ. కానీ వాళ్ల నడిగి కనుక్కో, మనింట్లో వుండడాని కిష్టపడతారేమో?

సీతమ్మ—అది నాకు వదలండి. మీకిష్టమయితే వాళ్లుండడానికేమి?

వెంకట—నీ ఇష్టమని చెప్పకూడదూ! మీకు వ్యతిరేకంగా మగవాళ్లు నడిస్తే వుందిగా సత్యాగ్రహం.

సీతమ్మ—అబ్బా, గడుసుదనం! మీ మగవాళ్లు చేసే ప్రతిపనీ ఆడవాళ్ల యిష్టప్రకారమేనేమో? చాలు వూరుకోండి.

ఇంతలో నాగమ్మ చెల్లెలితో వచ్చి వాకిటివద్ద తలవంచుకొని నిలబడింది. నాగమ్మ కిరువదియేండ్ల వయస్సు. ఎఱుపరి. పొలముపని కలవాటుపడిన బలిష్ఠమగు దేహం. మంచిఛాయ. ముఖం తీర్చి తిద్దినట్లుంది. ఈకాపుబిడ్డ సహజసౌందర్యానికి చూపరులహృదయాలనట్టె యాకర్షించగల శక్తివుంది. చెల్లెలు లక్ష్మి అన్ని విధముల అక్కనుపోలినది. అక్క వెనుకబడిగి సీతమ్మ ముఖం చూస్తూ నిలబడింది. ఆణిముత్తెములవలెనున్న ఈ యక్కచెల్లెండ్ర నిప్పుడు తేరిపారజూచి, వెంకటరెడ్డి చకితుడైపోయినాడు.

సీతమ్మ—నాగమ్మా, మీకిష్టంవచ్చినన్ని నాళ్లు మా యింట్లోనే వుండొచ్చు. నాకూ అక్కచెల్లెండ్లులేరు. మనం వకతల్లిపిల్ల లున్నట్టుందాం.

నాగమ్మకు నోట మాట రాలేదు. వంచినతల యెత్తి, తన విశాలమగు కన్నులతో సీతమ్మముఖం చూస్తూ నిలబడిపోయింది.

## ౨

ఐదుమాసము లయింది. నాగమ్మ చెల్లెలితో వెంకటరెడ్డియింట యెంతో భయభక్తులతో కాలంగడపుతూవుంది. దిక్కులేని యీ యక్కచెల్లెండ్రను సీతమ్మ యెంతో ఆదరిస్తూ, తనతోబుట్టువులవలె చూస్తూంది. నెలక్రింద లక్ష్మి వ్యస్తరాలయినప్పుడు సీతమ్మ యెంతో సంతోషంతో నలుగురినీ అమ్మలక్కలను జేర్చి నలుగు పెట్టింది. వెంకటరెడ్డికూడా వీరినెంతో అభిమానంతో చూస్తూన్నాడు. నాగమ్మ ధైర్యము, చాకచక్యము వెంకటరెడ్డిమెప్పును బొందినవి. కాపుబిడ్డలలో ఆదర్శ ప్రాయురాలు నాగమ్మ అని వెంకటరెడ్డి నిశ్చలమైన యభిప్రాయం. ఇంటిపనులలో మగ్నయై, నాగమ్మ యటునిటుతిరుగుతూన్నపుడు రెడ్డి యామెను త్రిప్పనిచూపులతో చూస్తూ తన్నుదా మరచిపోతుంటూ డొకప్పుడు. అంతలో తెలివి దెచ్చుకొని నటుచూడడం భావ్యంకాదని తన్నుదా విమర్శించుకుంటాడు. కాని నాగమ్మ తనకంటబడినంతనే నిశ్చలుడైపోతాడు. సోదరిగా జూచుకొనదగిన యీయనాథయందు తానట్లు లక్ష్యముంచడం పాపమని నిశ్చయించుతాడు కాని మరుక్షణమే తనకట్టి పాపపుటూహయు లేదే యని తన్నుదా సమర్థించుకొంటాడు. తన హృదయంలో రేగుతూవున్న భావాలకుమాత్రం అంతంలేదు. సాధ్యమైనంతమట్టుకు నాగమ్మవైపు కన్నెత్తి చూడక తనమనసును శాంతింపజేయవలెనని గట్టి ప్రయత్నం చేసినాడు. కాని తనహృదయంలో చిత్రితమై తనకండ్లలో ప్రతిబింబిస్తూన్న ఆరూపాన్ని ఎట్లు తుడిచివేయగలడు? ఆమెవైపు చూడకూడదను తలపు నిశ్చలంగా వుంది కాని, చూపు లప్రయత్నంగా ఆమె విగ్రహా న్ననుసరిస్తున్నవి. ఇట్టిస్థితిలో తేనెలోబడిన ఈగవలె కొట్టుకొంటున్నాడు వెంకటరెడ్డి.

ఇటు నాగమ్మ తనపాలిటిదైవమువలె భావిస్తున్నది వెంకటరెడ్డిని. ఇంతటి యుదార హృదయుని యింట తనకాశ్రయం దొరకడం తన పూర్వజన్మసుకృతమని యెంచి యతని నెంతో భక్తి గౌరవములతో చూచుకొంటూ వుంది. నిత్యమూ రాత్రి భోజనానంతరం వెంకటరెడ్డి భార్యకు వార్తా పత్రికలలోని విశేషములు జెప్పుతూ, సందర్భాన్ని బట్టి సాంఘిక విషయాలను గూర్చి యుపన్యసిస్తూంటే నాగమ్మ యీలోకాన్నే మరచి వెంకటరెడ్డి మాటలను వింటూ కూర్చుంటుంది. పల్లెటూరిలో పుట్టి పెరిగిన యీ ముగ్ధ యితని నొక దేవాంశసంభూతునిగా నెంచింది. బాల వితంతువుల దుస్థితిని వెంకటరెడ్డి జాలిపుట్టినట్లు వర్ణిస్తూ వుంటే ప్రపంచములోని దుఃఖాన్ని అంతం చేయడానికై పుట్టిన మహానుభావు డితడని తన విశాలమైన కండ్లతో అతన్ని ఒకటే చూపుగా చూస్తూ వుండేది. వెంకటరెడ్డి తన్ను చూస్తూవుండడం మొదట మొదట గమనించలేదు కాని, కొన్నాళ్లకు తన్నదే పనిగా దృష్టించి చూస్తూన్నాడనే విషయం గ్రహించింది. ఆచూపులకేమిన్నీ అర్థంచేయలేకపోయింది.

ఒకప్పు డిరువురి చూపులు తటస్థమైతే నాగమ్మకొక విధమగు భీతిచే దేహం జలదరించేది, తలవంచుకొని

యట్లే నిలబడి పోయేది. ఆభీతి కేమికారణమో తన కే మాత్రం అర్థమయ్యేదికాదు.

ఒకనాడు మధ్యాహ్నం మూడు గంటల సమయం. సీతమ్మ లక్ష్మిను వెంటబెట్టుకొని పాతూర్లో పరిచయస్థుల యింటికి వెళ్లింది.

నాగమ్మ వంటయింట రొట్టెలుచేస్తూ కూర్చుని పరధ్యానంగా వుంది. ఇంతలో వెనక అడుగుల చప్పుడు విని వులిక్కిపడి తిరిగి చూచింది. అప్పుడే వెంకటరెడ్డి కోర్టునుండివచ్చి కాఫీకోసం వంటయింటికి వచ్చినాడు. నాగమ్మ తటాలునలేచి చెరగు సవరించుకొని తలవంచి నిలబడింది.

వెంకట—ఇంట్లో యెవరూ వున్నట్టులేదు?

నాగమ్మ—అమ్మగారు లక్ష్మిను పిలుచుకొని పాతూర్లోకి పోయినారు. ఇంతలో రావచ్చు.

వెంకటరెడ్డి తిరిగిపోయినాడు. అతడు పోయిన తర్వాత కాఫీయివ్వలేదని నాగమ్మకు జ్ఞాపకంవచ్చింది. కాఫీకప్పు తీసికొని వెంకటరెడ్డిరూముకు వెళ్లింది. రూములో అద్దంముందరనిలబడి వెంకటరెడ్డి కాలరు తీస్తున్నాడు. నాగమ్మ వాకిటనిలబడి కాఫీ తెచ్చినానని చెప్పింది. తెమ్మన్నాడు. నాగమ్మ రూములోకివెళ్లి కాఫీఅందించునప్పుడకస్మాత్తుగా అతనిచేయి సోకింది. ఆమెదేహ మాద్యంతం జలదరించింది. వెంకటరెడ్డి పరవశుడయినాడు. కాఫీకప్పు టేబిలుపైనుంచి, "నీవు కాఫీతీసుకున్నావా" యని యడిగినాడు. ఇదివర కిట్టి ప్రశ్న యెప్పుడునూ అడిగినదిలేదు. తన్ను అంతటి కారుణ్యంతో ప్రశ్నించువా రున్నారని నాగమ్మ కలనైన దలపలేదు. తలయెత్తి అశ్రువులతోనిండిన కన్నులతో వెంకటరెడ్డిముఖాన్ని చూచింది. వెంకటరెడ్డి భౌతికప్రపంచాన్నే మరచినాడు. నాగమ్మను తన బాహువులతో హృదయమున జేర్చుకున్నాడు. నోట మాటలేక అతనిబాహువులలో వాలిపోయింది నాగమ్మ.

3

క్రిసుమసు సెలవులు. సీతమ్మతమ్ముడు కృష్ణారెడ్డి అక్కను కాన్పుకు పిలుచుకొనిపోవడానికి అనంతపురం వచ్చినాడు. ఇదివరకూ రెండుకాన్పులు సీతమ్మకు పుట్టింటినే జరిగినవి. కాని, పాపం రెండు మార్లునూ పిల్లలు పురిటింటనేపోయిరి. ఈసారి పుట్టింటికిపోవడం సీతమ్మ కిష్టంలేదు. పైగా మూడవకాన్పు పుట్టింటని జరుగకూడదని నలుగురూ అంటారు. ఇంట తనకు నాగమ్మ సహాయంకూడా వుందనిచెప్పి తమ్ముణ్ణి సమాధాన పరచింది. సెలవులు నాలుగు రోజులూ యిచ్చటనే గడపమని బావకూడా కోరినందున కృష్ణారెడ్డి నిలిచినాడు. క్రిష్ణారెడ్డి కిరవైయేండ్ల వయస్సు. స్కూలు ఫైనలుపాసయి, ట్రైనింగు ముగించుకొని స్వగ్రామమగు తాడిపత్రిలో స్కూలుమాస్టరుగా వున్నాడు. నెలకు ముప్పై రూపాయీల జీతం. కొద్దిగా భూస్థితి కూడావుంది. తండ్రి బాల్యంలోనే గతించినాడు. తల్లి గారాబంతో పెంచింది. సీతమ్మకితనిపై యెంతో మక్కువ. సీతమ్మ వివాహమైన తర్వాత అక్కయింటనే యుండి చదివినాడు కృష్ణారెడ్డి.

గుణవతియైన పిల్లను దెచ్చి తమ్ముని నొక కుటుంబీకునిగా చేయవలెనని సీతమ్మ ప్రయత్నంజేస్తూవుంది. తనమనసులో లక్ష్మి మెదలుతూనే వుంది. ఆపిల్ల గుణాన్ని బాగా తరచి చూచింది. ఇంతటి చాకచక్యము, వినయము, విధేయత గలిగినపిల్లలు తమజనంలో దొరకుట అరుదని నిశ్చయించింది దానికితోడు మంచి రూపవతి లక్ష్మి. అన్ని విధముల సీతమ్మ మనస్సుకు లక్ష్మి బాగానచ్చింది. కాని, తమ్ముని మన సెట్లుందో, తల్లి యిట్టిబీదపిల్లను కోడలిగా జేసుకోడాని కిష్టపడుతుందో లేదో అను సందేహం సీతమ్మకు. తమ్ముడు వచ్చిన రెండుగోజులకే సీతమ్మ మొదటి సందేహంతీరింది.

ఇదివరకు క్రిష్ణారెడ్డి అనంతపురంవస్తే యింట వుండడమే అరుదు. ఎప్పుడూ స్నేహితుల్తో కాలం గడిపేవాడు. ఈసారి సదా యింటనే ఉండడం. లక్ష్మి సీతమ్మవద్ద యున్నప్పుడు క్రిష్ణారెడ్డి యేదో మిషపైన వచ్చి కూర్చుని కబుర్లుచెప్పడ మారంభించినాడు. సీతమ్మ వెనుకనుండి లక్ష్మి క్రిష్ణారెడ్డిని పిళపిళ చూస్తూవుండేది. మధ్యాహ్నం 'క్యారం' (Carrom) ఆడవలెనంటే తప్పకుండా క్రిష్ణారెడ్డి లక్ష్మమ్మలొకజట్టు. ప్రతియాటా

వెంకటరెడ్డి సీతమ్మలకు ఓటమి తప్పిందికాదు. ఒకసారి వెంకటరెడ్డి "ఈ ఆలుమగండ్లు మనల్ని బాగా ఓడగొట్టుతున్నారే ప్రతిమాటా"యని నవ్వుతూఅన్నాడు సీతమ్మముఖంచూస్తూ. సీతమ్మ పకపకానవ్వింది. కృష్ణారెడ్డికూడా నవ్వినాడు. సిగ్గుతో లక్ష్మి వంటింటిలోకి పరుగెత్తిపోయింది.

సీతమ్మ—ఈడుజోడూ బాగుందిక దేమండీ?

వెంకట—నీవ దేపనిగా తయారుచేస్తున్నావుగా పిల్లను. మొగానికి సబ్బు రాసుకోవడం నేర్పినావు. నీచీరలు కట్టపెట్టుతుంటావు. చదువు నేర్పుతున్నావు. వెంటబెట్టుకొని స్నేహితుల యిండ్లకు పోతుంటావు. అన్నివిధములా పట్నవాసంపిల్లగాతయారుచేస్తున్నావు. ఇంతశ్రద్ధ మరదలిని చేసుకోడానికేకామా.

సీతమ్మ—ఎంత అన్యాయమండీ! ఏదో, పిల్ల చలాకీగావుందని నాకు వచ్చినంత చదువు చెప్పడం, శుభ్రంగావుండమని చెప్పడమూ, ఎవరింటికైనాపోతే తోడుపిలుచుకొనిపోవడమూ తప్పా. వీటికన్నిటికి వక కారణమా? చాల్లెండి.

వెంకట— కారణ ముందోలేదో యిప్పుడెం దుకు? శ్రమ ఫలించిందిగా. నాకూ సంతోషమే. ఏమోయి కృష్ణారెడ్డీ, నీయభిప్రాయమేమి?

సీతమ్మ—వాన్నడగడమెందుకు? వాని యభిప్రాయం నాకు బాగాతెలుసు. మీ రీసారి తాటిపర్తి పోయినప్పుడు మీయత్తగారితో మాట్లాడిరండి. మిగత విషయం నేనుచూస్తాను.

వెంకట—నీవు తలచింవాని కడ్డేముంది? కాని, పిల్ల నాది. సీతమ్మకు సామ్మేం పెడతాడు?

సీతమ్మ—అబ్బా! పిల్లమీది? మీరేఅన్నారు కామా పిల్లను నేను తయారుచేసినానని. పిల్ల నాది. పిల్ల వారిపక్షంగా సొమ్ము మీరేపెట్టవలసింది.

వెంకట— చాల గట్టిదానివేలే. కానీ, కానీ అయిందేమో చూతుపో.

ఏప్రిలు నెలారంభం. ఎండలు తీక్ష్ణంగా వున్నాయి. సీతమ్మ ప్రసవించి రెణ్ణెల్లయింది. తల్లి తోబుట్టువులకంటె యెక్కువగా నాగమ్మ రాత్రనక, పగలనక కష్టపడి బాలెంతనూ, పిల్లవాన్నీ కాపాడింది.

సీతమ్మకు నాగమ్మయందు దిదివరకున్న యభిమానం యినుమడించింది. తనకు తోబుట్టువులు లేని కొరత తీరింది. లక్ష్మిను తనతమ్మునికి చేసుకోవడంతో బాంధవ్యం యేర్పడుననను సంతోషం. పురుటిలో చూడిపోవడానికి తల్లి వచ్చినప్పు డీవిషయం ప్రస్తావించగా ఆమె పిల్లనుజూచి తనమనసుకు నచ్చిందని చెప్పింది. వేసవి నెలవులలో వివాహం జరపవలనని సీతమ్మతలంపు.

ఇప్పుడు వారంరోజులనుండి నాగమ్మకు జ్వరం. ఉష్ణ మంతతీవ్రంగాలేదు కాని మనిషి చాలా జడిసిపోయి మంచంపట్టింది. లక్ష్మి సహాయంతో యింటి చూచుకొంటూ సీతమ్మ చాలశ్రద్ధగా పథ్యం చేసి యిస్తూ నాగమ్మను పరామర్శిక వుంది. నాగమ్మ చాలబలహీనంగా వుంది. ఎంత బలవంతం జేసినా ఆహారం తీసుకోదు. కండ్లుమూసుకొని యేదో చింతచేస్తూ వుంటుంది. లక్ష్మి, పాపం, చాల భయపడి పోయింది.

ఆదివారం మధ్యాహ్నం నాగమ్మ మంచంమీద పడివుంది. కండ్లకొలుకులలో నుండి నీళ్లు ధారగా పోతున్నాయి. అప్పుడు సీతమ్మ,

"నాగమ్మా, నీ కేం భయం? ఇంతమాత్రం జ్వరానికే జడిసిపోవాలనా. వూరికే పిల్లను జడిపుస్తున్నావు. ప్రొద్దున్నుంచి కొంచెమైనా ఆహారం తీసుకోలేదు. ఇప్పుడు కొంచెం గంజి కాచియిస్తాను తీసుకుంటావా."

నాగమ్మ కండ్లుమూసుకునే "సరే" అంది. సీతమ్మ, "లక్ష్మి, పోయి వంటచేయి పో. నేను గోధుమనూక చూస్తాను" అంటూ వంటింటికి లక్ష్మితో పోయింది.

హాలులో పేపరుచూస్తూవుండిన వెంకటరెడ్డి ఆనగదిలోనుండి భార్యరూములోకి వెళినాడు. నాగమ్మ మంచంపై పడివుంది.

వెంకట—(మెల్లగా) నాగూ, నీకు జ్వర మెట్లుంది?

నాగమ్మ కండ్లువిప్పి చూచింది. కండ్లు నీళ్లలో తేలుతున్నాయి. నోటమాటరాలేదు. తల పక్కకు తిప్పింది.

వెంకట—ఎందు కంతగా యేడుస్తున్నావు? డాక్టరుకు చెప్పినాను. సాయంకాలంవస్తాడు. యేం భయం లేదులే.

నాగమ్మ తటాలున వెంకటరెడ్డివైపు చూచింది. ఆకండ్లలో యింతవర కెన్నడూలేని తీక్ష్ణత కనబడుతూవుంది.

నాగమ్మ—నాకు మందివ్వొద్దు, వైద్యుడూ రానక్కరలేదు. కొంచెం విషముం టేయిచ్చి పుణ్యం కట్టుకోండి.

అని యేడ్వ నారంభించిది.

వెంకటరెడ్డి కేమీ అర్థంకాలేదు. దగ్గరగా చేయిపట్టుకొని "ఏమికారణం? చావవలసినంత పని యేమున్నది? నీ కేకష్టమున్నా నే తీర్చలేనా. నాతో చెప్పు"

నాగమ్మ—నే నింక బ్రతకకూడదు. నాకు మాత్రమేకాక మీకూడా మర్యాదపోతుంది.

అని రెండుచేతులతో ముఖం కప్పుకొని యేడ్వ నారంభించింది. వెంకటరెడ్డి నెత్తిన పిడుగుపడినట్లయినాడు. తలవంచుకొని మెల్లగా వెళ్లిపోయినాడు.

నీళ్లివ్వడానికి వచ్చినసీతమ్మ మగనుమాట్లాడుచున్నది విని బైటనే నిలబడింది. సంభాషణ పూర్తిగా విని నిశ్చేష్టురాలయింది. అంతలో లక్ష్మమ్మరాగా నాగమ్మకివ్వమని నీళ్లగ్లాసు చేతికిచ్చి, తాను చరచరవంటింటికి వెళిపోయింది.

౫

సదా కలకలలాడుతూవున్న గృహ మిప్పుడు కళావిహీనంగా కనబడుతూవుంది. భార్యాభర్తల కెడమొగము పెడమొగమయింది. సీతమ్మ దినమంతా వంటింటునే గడపడం. వెంకటరెడ్డి భార్యను పలకరించడానికూడా జంకుచున్నాడు. తనకేకాక తనభార్యకూడా నిద్రాహారములు లేవని గ్రహించి పిచ్చివానివలె కాలం వెళ్లబుచ్చుతున్నాడు. నాగమ్మకు జ్వరం హెచ్చింది. అప్పుడప్పు డేవేవో కలవరింతలు, లక్ష్మమ్మ గుండెనీరయింది. ఏమీ తెలియని యాపిల్ల కేడ్పేశరణ్యం. మనస్సు కెంతకష్టమున్నా సీతమ్మ నాగమ్మను శ్రద్ధగా విచారిస్తూవుంది. తనసంసారాన్ని భంగపరచిందని యేవగింపొకప్రక్క. ఇప్పట్లో తానుచేయివదలిన యాపిల్లగతి యేమనిజాలి యొకప్రక్క. బాలవితంతువుల దుర్గతిని గూర్చిన తనభర్త యుపన్యాసములన్నీ జ్ఞప్తికి వచ్చినవి సీతమ్మకు. "సర్వత్ర, వారిదుస్థితికి పురుషుడే కారణము" అని తనభర్త పలుమారు బలుకుచుండిన మాట యామెస్మరణకు వచ్చినది. ఈ సందర్భమందునూ ఆపలుకులే తథ్యములై యుండునని తోచిం దీమె మనస్సుకు. ఎట్లైననూ నాగమ్మ నిప్పట్లో చేయివిడువకూడదని నిశ్చయించి స్త్రీసామాన్యమునకు సాధ్యము కాని ఔదార్యంచూపింది. భర్త తనయెదుట వచ్చినప్పుడుమాత్రం కోపమూ, దుఃఖమూ యేకమై సీతమ్మ హృదయాన్ని రంపపుకోత కెరజేయుచున్నవి.

ఈస్థితిలో మూడురోజులు గడచినవి. వేసవి సెలవులకు కోర్టులూ, పాఠశాలలూ మూతబడినవి. కృష్ణారెడ్డి వివాహాన్ని స్థిరపరచుకోడానికై వచ్చినాడు. అక్కగృహము సంతోషరహితమై యుండుట గోచరించినది. నాగమ్మజ్వర మందులకుకారణమైయుండునని మొదటయూహించినాడుకాని, అక్కబావలకు విరసము గానుండుట చూచి తనయూహ సరికాదనుకున్నాడు. అక్కను ప్రశ్నించినాడుకాని, ప్రయోజనం లేకపోయింది. బావయందు తనకుండుచనవుతో అతన్ని పీడించినాడు. లోననేకుళ్లి కుములుతూవున్న వెంకటరెడ్డికిప్పుడు తనహృదయభారం తగ్గించుకోడాని కవకాశం గల్గింది. మనసిచ్చి సంగతంతా వెళ్లగ్రక్కినాడు. తప్పంతా తనదేనని వప్పుకొని, దిక్కులేక తనయింట జేరిన స్త్రీజీవితాన్ని నాశనంజేసినానని పశ్చాత్తాపపడినాడు. ముందుగతి యేమని బాలికవలె యేడ్చినాడు.

క్రిష్ణారెడ్డి అక్కతో బావప్రీతిని వర్ణించి, ఆమె మనస్సుపై యిరువురిజీవితము లాధారపడి యున్నవని తెలియజెప్పినాడు. స్వభావముగనే కారుణ్యమయమగు సీతమ్మ హృదయమును ఉదారహృదయుడగు తమ్ముని హితబోధ మెత్తబరచింది.

సీతమ్మ—మగవారు చేసినపనికి స్త్రీ యేం చేస్తుంది? నేనిప్పుడు వారి నేమనేటట్టున్నాను! భరించక తప్పుతుందా.

క్రిష్ణా—అట్లుకాదు. బావను క్షమించడమేకాక నీవు గొప్పమనస్సుచేసి నాగమ్మ కొకమార్గం చూపవలసివుంది. తప్పంతా తనదేనని అతడే వప్పుకున్నాడు. నీమగడు చేసినదానికి నాగమ్మజీవితం నాశంకావడం యేమిన్యాయం? అతడుచేసిన తప్పును నీవు సరిదిద్దవలసింది.

సీతమ్మ—ఏ తే నన్నేంచేయమంటావు? నాకేం సాధ్యముంది?

క్రిష్ణా—గొప్పమనసుచేస్తే సాధ్యముంది. బావకీ అపకీర్తికూడా లేకపోతుంది.

సీతమ్మ—నాకేం తోచడంలేదు. నీవేచెప్పు. నా సాధ్యమయింది అయనకై చేయడానికి సిద్ధమేకదూ!

క్రిష్ణా—నాగమ్మను బావ పెండ్లిచేసుకుంటే అన్నీ సరిపోతాయి. నీమాటమీదుం దీవిషయం.

సీతమ్మ బొమ్మవలె నిలబడిపోయింది కొంతసేపు. ఆమెహృదయంలోనికలత ముఖంలో ప్రతిబింబిస్తూవుంది. స్త్రీసహజమైన యీర్ష్యను గెలువజాలింది తుదకు. తలవంచుకొనే,

సీతమ్మ—అవును, వేరుమార్గంలేదు. ఆయన వప్పుతున్నారా?

క్రిష్ణా—నేనడుగలేదు కాని, నీమాట కెదురాడే స్థితిలో లేడు.

సీతమ్మ—వప్పుకొనితీరవలసిందే. లేక నన్ను కూడా వదలుకోవలసిందే.

అంటూ, చరచర భర్తగదిలోకి వెళ్ళింది. ఆమె చూపు నెదుర్కోలేకపోయినాడు శంకటరెడ్డి. మాటల కవకాశమియ్యక సీతమ్మ,

"మీరు నాగమ్మ జీవితాన్ని నాశంచేసినారు. అందు కిప్పు డామెను మీరు పెండ్లి చేసికోవడం తప్పదు. ఇందుకు నేను మనసార వప్పుకుంటున్నాను" అని గంభీరంగా పలికింది.

సీతమ్మ గదికిని, యీగదికిని మధ్యతలుపు తెరచి వుంది. అప్పుడేలేచి లక్ష్మియిచ్చిన నీళ్లు తాగుతూన్న నాగమ్మ యీమాటలువిని, 'ఆ' యని యరచి మంచముపై వ్రాలి యేడ్వడ మారంభించింది. సీతమ్మ తక్షణం వెళ్లి నాగమ్మపక్కన కూర్చుని,

"నాగమ్మా, మనమిప్పుడు నిజంగా అక్కచెల్లెండ్లయినాము. నీతప్పేంలేదు. అంతా విధి. ఆయన సిగ్గుతో కుంగిపోతున్నాడు. ఇకముందు మనిద్దరమూ ఆయన్ను సుఖపెట్టవలసివుంది. నీవు ధైర్యం తెచ్చుకో" అని యామెను ఓదార్చి, తమ్ముని పిలిచింది.

సీతమ్మ—క్రిష్ణా, లక్ష్మిను పెండ్లిచేసుకోడానికి నీవుసిద్ధమేనా?

క్రిష్ణా—నీమాటకు బదులేముంది? సంఘసంస్కర్తభార్య కదూ నీవు.

సీతమ్మ—నీహాస్యం చాలు. పులి గోతిలోబడిందని రాళ్లేస్తున్నావు. ఆయనవింటే యింకానొచ్చుకుంటారు. కాని, రెండుపెండ్లిండ్లు, యీవూర్లో బాగుండదేమో?

క్రిష్ణా—ఎటూ సెలవురోజులు. అందరూ బెంగుళూరుపోతే బాగుంటుంది.

సీతమ్మ—అవును.నీవూ మీబావా కలిసి ప్రయాణాని కేర్పాటుచేయండి. నాగమ్మా, లే. వంటింట్లోకి పోదాం. నేను గంజికాస్తాను. నీవూ అక్కడనే కూర్చుండు.

# ఆ ది క

అనువాదకురాలు : పోణకా కనకమ్మ

ఇది చాలా కాలమునాటి విషయము. ఇంతకాలము నాటిది అని స్మరణశక్తికి కూడా కనుగొనజాల నంతటి దీర్ఘకాలపువిషయము.

స్త్రీ చెట్టుతొర్రలో నివసిస్తూ ఉండినది. మరి పురుషుడో విహితస్థానవాసి గాక, అడవియడవి, కొండ కొండ తిరుగుతూ ఉండెను. ఏల? పురుషుడు ప్రతిచోటఅన్నమును వెతుక్కొంటూతిరుగుతుండేవాడు. అపుడు వృక్షకోటరవాసినియగు స్త్రీనిచూచి ఇట్లను కొనేవాడు. "ఈ రమణి ఎట్టిది? బాహువులయందా బలము లేదు, హృదయమునందా సాహసము పూజ్యము, పిడికిలియందా దృఢత అభావము. రెండడుగులువడి నేనే బడలికచే ఆపసోపాలుపడుతూ వాడి వత్తయి పోతుంది. మరి ఇక కొంచెము పరిగెత్తినా ఆయాస ములో కుమిలిపోతుంది. ఛీ, ఛీ! విధాత ఈ అనుపయో గవస్తువును ఎందుకు సృష్టించాడు? అయ్యో! అయ్యో! వెనుదవిలి ఒక జింకనుకూడా తరిమి పట్టుకోలేదు! ఏదేని క్రూరమృగ మెదురుపడితే తప్పించుకోడానికి కొంచెము మారమేనియు పరుగెత్తలేదు. ఈమెను వెం టతీసికొనిపోవడమంటే కొరవితో తలగోక్కొనడమే. రెండురోజులుకూడా ప్రాణాన్ని కాపాడుకోవడము కష్టమైపోతుంది.

నారి పురుషుని దృష్టియందు పడకుండ తాను వృక్షకోటరములో దాగుకొంటుండేది. ఆమెకు పురు షుడు ఒక రాక్షసుడివిధముగా కనుపడుతూ ఉండే వాడు. అబ్బా! అబ్బా!! వానిసర్వాంగాలు ఎంత కఠిన ముగా నున్నవి. అయ్యో! అంతకంటే వాని హృద యము కఠినతరమే. కాని ముఖములో నెక్కడా ఈ షణ్మాత్రమేనియు క్షమతాలేశము కానుపించదు. మరి ఆకారములోనో కోమలతయొక్క పేరుకూడా లేదు. అబ్బా! చూస్తేనే శరీరము వణుకుతుంది. అంతరాత్మ శుష్కమైపోతుంది. విశ్వవిధాత ఎందుకొరకు ఈ నిరుపయోగ సృష్టిని చేశాడు? కేవలము నిష్ఠురతాసాఫ ల్యమున చరితార్థుడగుటకు కాబోలు!"

* * * *

ఈవిధముగా రోజులు గడిచినవి. ఒక టొకటిగా అనేకదినాలు గడచిపోయినవి. కాని పురుషుని హృద యము కేవలము స్త్రీ విషయమున అవజ్ఞతతో నిండి పోతూ ఉండినది. మరి ఇక నారీహృదయమో పురు షుని విషయమున భయముతో నిండిపోతూ ఉండినది.

అకస్మాత్తుగా ఒకనాడు ఏలనో తెలియదు, ఒక విధమగు పరివర్తన ప్రారంభమైనది.

బహుశా నాడు వనాంతరమున ప్రకృతి తన విశేషరూపమును విలాసముగా బయటపెట్టియుండ బోలును. అకాకున్, తీగతీగ వీనితో ఎట్టితరంగాలు అడుకొంటూ ఉండినవో తెలియదు. వనము నాచ్ఛా దించిఉండిన ఆరణ్యత కుసుమనిర్గతసుగంధము దశదిశల నిండి వాని నొక ఉన్మాదావస్థకు పాలుచేసెను. బహుశా ఆదినము ఎండుటాకుల మర్మరధ్వని, మందమృ దుల సమీరమనోహరచాంచల్యత ఇవి ఎదియో మంత్ర ముతో ఆకసాన్ని, భూమిని తమవశము కావించుకొని ఉండబోలును

నారి కోటరాంచలమునుండి పురుషునిచూస్తూ ఉండినది. నాడు ఆమెకు మనసు యిట్లు చెప్పింది. "ఇతడు రాక్షసుడా, మరియొకరన్నా నా! తెలియలేదే! వానికళ్లు యింతతీక్ష్ణముగాను, ఎఱ్ఱగాను ఎందుకున్నవో తెలియదు. కాని .....ఎంత అందముగా నున్నాడు!

ఆవల ప్రతిదినము స్త్రీ కోటరాంతరాళమునుండి పురుషుని చూస్తూ, ఆనందముగ్ధయగుతూ క్రమక్రమ ముగా వానివంకకు వంగుహృదయము కల దగుతూ ఉండెను.

నారీహృదయమున ఒకవంక మెలమెల్ల సుందరత యొక్క మేలి యనుభవావిర్భావ మగుచుండది వెన్న

వెంట రెండవదినమునుండి మెలమెల్ల భయము జారిపోతూ తన అనుభావము ప్రదర్శింప దొడగింది.

తుద కొక నాడు నారి తనహృదయము సంపూర్ణముగా భయవిముక్తయై ఉండుటయు, కేవలము ఒక అపూర్వమగు ఆనందోపలబ్ధిచే నిండియుండుటయు కనుగొన్నది.

ఆనాడామె తన చిరకాలనివాసమగు చెట్టు తొరటనుండి బయలుదేరి పురుషునిఎదుటకు వచ్చినది.

* * * *

పురుషుడు ఆమెనుచూచి ఉలికిపడ్డాడు ఏమ్! ఈమెను ఈవిధముగా నుండుట ఇంతకుమును పెప్పుడు నేను చూడలేదు! ఆ భుజముల మాంసపేశులలో బలమే లేదు. కాని ఆహా! ఆహా! ఎట్టి ఆకర్షణశక్తి ఉన్నది! ఆ వ్రేళ్లకు బాణాలను విసిచేశక్తి లేదు కాని ఏదో ఒక విధమైన నిపుణత్వము గోచరిస్తున్నది. ఆమె హృదయములో సాహసము లేదుగాని, ప్రపంచమును జయించడానికి ఏదో మంత్రమున్నట్టుల తోస్తుంది.

పురుషుని పెదవులనుండి నాడు అవజ్ఞాభరితహాసము వెలువడలేదు. కాని వానిహృదయము ఏదియో ఒక తెలియని వేదనాపూరిత మైపోయింది.

నాటినుండి వానికి ఆహారాన్వేషణాయత్నములోకూడా హృదయమున నొక నవీనానందస్పర్శలాభము కలిగి ఎదురుతూ వచ్చింది. అది క్రమముగా ఆహారాభిలాషకంటేఅధిక మైపోయింది. ఒకనాడు వానికిట్లు తోచింది. "భోజనము లేకపోయినా కూడా జరిగిపోతుంది. కాని ఈ ఆనందస్పర్శ లేకపోతే జీవించడము కష్టము." అని.

మెలమెల్లగా ఒకటినుండి రెండు కాదొడగినవి.

* * * *

నారి వనకుసుమములను మాలగాగూర్చి కంఠమున దాల్చును. నెమలితోకయీకలతో పురుషుడు ముకుటమును నిర్మించి తలదాల్చును. మరి ఏదో తెలియని ప్రాపంచికసంబంధియగు నొక నవీనమాత్రస్పర్శచే ఇరువురి జీవితములందును క్రొత్తందనము రాసాగింది.

ఈ అడవిలో నొక సుఖము కలదు. లతాభోగవనస్పతులు మందపవనచలితములై ఆందోళితములగుచుండ తత్స్పర్శచే సిగ్గుపడి సంకుచితములగు పల్లవిత లతలలో నది గలదు. ఇంకను ఈవనకుసుమముల ఛాయావిలాసములలో నొక మనోహర సౌందర్యమున్నది. వీనియందలి పక్షుల రుతములలో, తుమ్మెదల ఝుంకారములలో నొక వినమగు సంగీతముకలదు. వీనిని ఇంతకుమునుపు ఎప్పుడు కూడా లేశమేనియు గమనించికాని, అనుభవించికాని నారుండలేదు. వనకురంగాలు తమ విశాలనేత్రాలతో అన్యాసీనదుర్లభమగు మోహనదృక్చమత్కారముల నేర్పు ఉపాధ్యాయినులై జిజ్ఞాసాపూర్ణమగు జీవలోకము నెదుట విలాసగమనముల క్రుళ్లుతూ పరుగిడుతున్నవి. ఎదియో అవ్యవిషయమున లగ్నమైనవాని మనము అపుడు సుదూరమునుండి వస్తున్న ఒకఅస్పష్టవంశీనినదమును తన చెవులతో ఆకర్షించి పట్టిఉంచ ప్రయత్నించకోరుతున్నది- అది ఏదియో తెలుసుకొనన నారంభిస్తున్నది. అడవి కేవలము ఇపుడు ఆహారాన్నియిచ్చు సాధనముమాత్రమై యుండలేదు. అది ఆనందనికేతన మైపోయింది.

* * * *

తుదకు పురుషుడు ఒకనాడు నారిఎదుటకు పోయి ఇట్లు నుడివాడు, "రమణీ! ఇపుడు పూర్ణముగా నాలో నేను లేను. నేను నాయొక్క జీవన చింతయందర్ధము నిన్నావరించింది. అందువలన నీవు నాకు అర్ధాంగివి, సగముప్రాణమవు, సగపాలుచేతనమవు అయిఉన్నావు. నీవులేక నేను పూర్ణుడవగుట యిపుడసంభవము—నిన్ను నేను కోరుతున్నాను."

స్త్రీ ఇట్లు చెప్పింది. "సునూక్ష్మగుణనిర్మితమగు నీప్రేమజాలము నలుదిశల నన్నావరించి పట్టావరచుకొని లోపర్చుకొనుటను నే ననుభవిస్తున్నాను. నీవు నన్ను దాసీనిగా చేసికొంటివి. అయిన ఈ బంధనములోనే నాకు సుఖమున్నది. సార్థకమున్నది. నన్ను గ్రహించుము. నేను నీదానను,"

రమణి తన కంఠస్థసుమహారమును తీసి పురుషుని మెడలో వేసింది. పురుషుడు తన మయూరపుచ్ఛ

మనోహర పత్రనిర్మిత మకుటాన్ని తీసి ఆమెతలపై నుంచాడు.

పురుషునిచే విడువబడిన బాణముచే జింక హత మైన ఆనాడు ఒక అపూర్వ విశేషానందస్పర్శము వారి హృదయములలో వాయించబడినది. నాటి ఆహా రాన్వేషణములో మనుజుని ఆత్మ వాని దేహమునీడి ముందుకు నడచినది.

ఒకటినుండి రెండైనవి. దేవలోకమున విజయ దుందుభులు మ్రోగినవి.

* * * *

అయినను ఇపుడుకూడా అస్థిరతకు తుది దొరక లేదు.

పురుషునిచేతులు కాంతకొరకు కఠోరమైనవి. ఆమెరక్షణకై పురుషుడు తనబాహుదండమాంసపేశలను దృఢతరముల కావించుకొన్నాడు—తన హృదయమును భయవిముక్తముగా చేసుకొన్నాడు—తన మానసమును అలంకరించుకొన్నాడు—అంతరాత్మకు స్థిరమును, ధీర మును కావించాడు.

కాని అస్థిరతాస్పర్శము ననుసంటనే తానును వేడుకుతూఉండినది.

కాంత ప్రక్కనుండి అటునిటు జరుగునపుడు ఆమె నడతయందొకవింతయందము వానికి గోచరిం చేది—వెనువెంట ఎదియో మధుర సంగీతము వినవచ్చేది —ఆమె దృక్కులనుండి యొక అవ్యక్తాభాసము జిగుల నీనుతూ వెలువడినటు లుండేది —ఆమె కురులనుండి వెడలుసుగంధము ఓః! ఎట్టి ఉన్మాదదాయి! పురుషుడు వనపుష్పములను కోసుకొనివచ్చి ఆమె కుంతలభారమున ముడుచును—వివిధభూషణముల నామె సర్వాంగముల నలంకరించును—ఆమె చూపులతో తన చూపులు మేళవించి వాని నొకటిగా కలిపివేయును.

కాని అస్థిరత యెదిగిపోతూనే ఉన్నది.

* * * *

ఒకనాడు పురుషుడు విస్మితకంఠముతో యిట్లన్నాడు "నారీ! నీవు ఏమి పదార్థము! ఇన్నాళ్లవరకు నాకోరికలను నీవు పూర్ణముగా స్పృశిస్తూ ఉండినావు- కాని అస్పర్శ ఇపుడు తన అపూర్ణత్వమును పొగొట్టు కొన్నది. నీవనగానేమి? ఎక్కడకుపోతే తెలుస్తుంది? నీ ఏమంత్రము ఏ రహస్యమును వికసనము కావిస్తున్నది.

ఆమెవలన అతనికి యెట్టి ఉత్తరమును లభించ లేదు. కేవలము నయనయుగళము ఉజ్వలములైపో యేవి. ఆమె పెదవులు ఒకమనోహరహాసముచే ఆభా సితములై వికసితములైనట్లు స్ఫురించేది.

ఒకానొకదినము పురుషుడు హతాశాభావముతో గద్గదకంఠుడై ఇట్లు వచించాడు. "నారీ! నీవు ఏ పదా ర్థము? నాదృష్టి ఇన్నాళ్లవరకు నిన్ను సంపూర్ణముగా గ్రహిస్తుండినది. కాని ఆగ్రహణము కూడా అంతకం తకు తన పూర్ణతను కోలుపోయింది. నీవు ఏమిపదా ర్థము? నారీ! ఏ రహస్య సరోవరమునకు, ఏయవనికను వైచి అందు నీవు అవగాహనమాడుతున్నావు."

నారి ఎట్టిజవాబును చెప్పలేదు. ఆమె తలవంచు కొని కేవలము క్రిందచూస్తూ నిలబడెను—మెలమెల్లగా కిలకిల నవ్వుతూ రెండుచేతులతో వక్షమును కప్పుకొని వంగును.

అస్థిరత యెదగిపోతూనే ఉన్నది. రహస్యము ఇంకను నిబిడమగుతూనే ఉన్నది.

* * *

ఏనాడు దినమంతయు అడవి తుదివరకు చుట్టి చూడబడెనో, ఆనాడు అచట వసంతానందోత్సవ మగుతూ ఉండెను. శ్యామలవనస్నిగ్ధ హృదయము ఇంకను శ్యామలమును, ఇంకను స్నిగ్ధమును అయిపో యెను. వనాత్మను ఏదియో గంభీరాంతరాళమునుండి ముకుళిత ఆమ్రవీథి స్వీయఆకులసుగంధభారమును సుదూ రమువరకు వ్యాప్తముచేసివేసింది. ఆ గంధభారమున వన మధుపముల చంచలత లాసకొనబడింది. పగటి పూర్ణవ్యాకులత దినాంతమున సంధ్యారూపమున సాం ద్రమైపోయింది. సంధ్యాచ్ఛాయ కాననమునంతను తన క్షుద్ర కృత్రిమవర్ణములచే పూతపూసింది. నిశి మొలక చీకటులు నిబిడాటవిని పూర్ణముగా ఆక్రమించినవి. ఆ

అంధకారరూపియగు వనకన్య నీలిచీరపై, ఆకసమను చాందినిపై చెక్కియుండే నక్షత్రములను రత్నముల కాంతులు ప్రతిఫలించి జలతారుబుటాలవలె మిలమిల మెరుస్తూఉండెను. ఆవింత వస్త్రశిల్పచాతుర్యము విపినమును మరియు మనోహరముగా చేసివేసెను.

పురుషుడు ఒక క్షణముక్రింద చింతాధీన హృదయుడై నిలబడిఉండెను.

నారి తిన్నతిన్నగా కుటీరమునుండి బయలువెడలి పురుషుని ఎదుటకు వచ్చి నిలబడెను.

పురుషుడు ఆమెను చూచాడు. అపుడు ఆమె కడకన్నులు కాటుకదిద్దినరంగుల నీడచు మిక్కిలి మెరయసాగినవి. ఆమె అంగప్రత్యంగసంగీతము ఒకటకే మదోన్మత్తమై ఉప్పొంగి విజృంభించింది. ఆమె కేశగంధభారము అనుక్షణము ఉన్మత్తావేశమై అహంకారమును విరియజిమ్మకొనసాగింది.

పురుషుని హృదయశోణితము ఝుంఝూమారుతాందోళితమగు వృక్షశాఖనుబోలి అతివేగముగా స్పందితమాయెను. తీవ్రవేదనా స్వరమున భీషణవిద్రోహ కంఠమున అతడిట్లన్నాడు. "నారీ! నీవు ఎట్టి ఆరాడుతున్నావు? మాయావినీ! నేను నిన్ను ఎంతసమీపిస్తున్నానో, నీవు నాకంత అపరిచితవై దూరదూరముగా పోతున్నావు. ఓః! ఎట్టివేదన? ఎట్టి విద్రోహము! దీనిని శాంతించునది యెవరు?"

నారి మెల్ల మెల్లగా పురుషునిదాపునకువచ్చి ఊరక వాని తట్టు చూస్తూ నిదానముగా కూర్చున్నది. ఆమె నేత్రములయందు ఎట్టి ప్రార్థనాభావము మెరస్తుండెనో తెలియదు కాని, అతను ఆ నేత్రోజ్వలతను జూలుకొన్నాడు.

అకస్మాత్తుగా ఆవేశపూరితుడై పురుషుడు ఆమెతట్టుకు ఒక్క గంతువేసి తన మనోహర బాహుబంధయుగళముతో నారీదేహలతను ఆశ్లేషించాడు. నారి దేహస్పర్శచే వానిశరీరము రోమరోమము, స్నాయువుస్నాయువు తటిత్స్పర్శకలిగినటులై ఒకవిధమగు అనివార్య పశనుపొంది పులకీకృతమై పోయింది. రమణీ కేశభారము ఆమె ఎడపైనను, ముగముమీదను అకులలై లుంఠితమగుచు ఉండెను. ఆమెమస్తకమువాడి క్రమక్రమముగా వాని భుజముమీదకు వ్రాలెను. ఒకరి హోష్ఠద్వయము మరియొకరి పెదవుల జంటను వెదుకకొనసాగింది.

ఇపుడు ఒకటినుండి అనేకమై పోయెను.

దేవలోకమున మరల నాడు విజయ దుందుభులు మ్రోగినవి.



# నక్షత్రమండలము

గొబ్బూరు వేంకటానందరాఘవరావు

(యువసంవత్సర కార్తిక-మార్గశీర్ష మాసములు)

ఉత్తరము




దక్షిణము

[ఈపటమును ఆయాదిక్కులు సరిగాచూపునట్లు తలమీదుగాపెట్టి చూడవలెను. ఇందున్నట్లు నక్షత్రాదులు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| నవంబరు 8 తేదీని రాత్రి 8-52 గంటలకును, | నవంబరు 15 తేదీని రాత్రి 8-25 గంటలకును | } |
| ,, 22 ,, ,, 7-57 ,, | ,, 30 ,, ,, 7-26 ,, | } కనబడును.] |
| డిసంబరు 7 ,, ,, 6-58 ,, | | } |

"దివి నల్లనక్షత్రదీపమాలికలచే
నీజయోత్సవమును నిశలు సల్పు;
ప్రాగ్వాద్రిపై నుండి బోరునఁ బాటు నీ
చండశాసనము సూర్యుండు దినము;
నీయశోమృతమును నించి చందురులోన
నిలువక కాలమ్ము గొలుచుచుండు;
నిర్నిద్రమై భూతనిచయంబు నిరతంబు
ప్రకటించుచుండు నీప్రాభవంబు;
విశ్వమంతయు నీసేవ విరతి లేక
యిట్లు సలుపుచునుండియు నెఱుఁగకుండఁ
దెలిసి నిను భక్తుఁ డొక్కఁడే కొలుచుచుండు
సకలకల్యాణగుణఘనన్య సర్వమాన్య."

ఈ నవంబరు ౧౫ వ తేదీనుండి డిసెంబరు ౧౫ వ తేదీవఱకు నగు యువ కార్తిక-మార్గశిర మాసములలో రాత్రి తొలిజామున నగపడు ఖగోళచారులను పరికింతము.

## పాలవెల్లి

ఈ మాసమునందు పాలవెల్లి తూర్పున Orion నక్షత్రమండలమునుండి పడమట ధనూరాశివఱకు కొంచెము వంగిన ధనురాకారము కలిగి వ్యాపించియున్నది. తూర్పున ఆర్ద్రానక్షత్రమునుండి సారథి, భృగుపరశు, అప్సరస, ఊర్వశీపురూరవసులు, రాజహంస, వీణా మండలములమీదుగా ధనూరాశి వఱకు వ్యాపించి యున్నది. ఆర్ద్ర సమీపమునందుకంటె బ్రహ్మహృదయనక్షత్ర ప్రాంతమునందు సన్నమై, అప్సరసలకడ లరివిచెంది, ఆవల శ్యామసీమలదిగువ, రాజహంసమండలములో రెండుగా చీలి, పాయ వెడమగుచుండ, పడమటి దిక్చక్రమున నదృశ్యమగుచున్నది. పురూరవసునకు పశ్చిమముగా ౧-౨- గుర్తులు గల శ్యామసీమలు (Ccal sacks) ఉన్నవి. ఆదిగువ పాయలమధ్య ఛాయాపథము తెల్లని పాలవెల్లిపాయలమధ్య నల్లనల్లగా చూపనగుచున్నది.

### First Magnitude Stars.

మిక్కిలి తేజోవంతమైన నక్షత్రములు ఈతొలి జామున ఎనిమిది కనబడుచున్నవి :-

౧. పడమట అస్తమింపనైయున్న వీణామండలములోని బ్రహ్మ. (Vega in Lyra.)

౨. దగువ పాలవెల్లిఅంచున, గరుడమండలములో శ్రవణము. (Altair in Aquila.)

౩. దక్షిణమున గగనమధ్యరేఖదాటి, పడమటకు వ్రాలిన ఇంద్రద్యుమ్నుడు. (Fomalhaut-ఫోమలో.)

౪. ఆగ్నేయాకాశమున శంతమను Acherner )

౫. వృషభరాశిలో రోహిణి. (Aldebaran.)

౬. సారథిలో బ్రహ్మహృదయము. (Capella in Auriga.)

౭. ఆర్ద్ర. (Betelgeaux) }
౮. రిగెల్. (Rigel.) } in Orion

## గ్రహములు

ఇంతవఱకు పశ్చిమాకాశమున నద్భుతతేజముతో వెలుగుచుండినశుక్రుడు అస్తమించినాడు. ౧౪-౧౧-౩౫ తేదీనుండి గురు డగపడడు. కుజుడు ఈ మాసములో పూర్వాషాఢ, ఉత్తరాషాఢ నక్షత్రములలో సంచరించును. శని శతభిషమందు కుంభరాశిలో ఇంకను వక్రగతుడైయున్నాడు.

## ఉత్తరమున

ఉదయాస్తమానము లెఱుగక, చిన్నయెలుగు ధ్రువక్షితిలో పరిభ్రమించుచునేయున్నది. తోకచివర అను ధ్రువుడును, తోకలో కశ్యప, మహేంద్రులును, తోకమూలను అగ్నియు, అగ్నిదిగువ మిత్రుడును ఉన్నారు. అగ్నికిని, మిత్రునకును ఎదురుగ పడమటకు వ్రాలి ధాతవిధాత లున్నారు. ధ్రువునిమట్టి ఊర్వశీ నక్షత్రములు దిగువ పాలవెల్లిలో పురూరవసువఱకు ఉన్నవి. వాయవ్యమున నరకాసురుడు లఘుబుక్కమును చుట్టుకొనియున్నాడు. త్వరలో అస్తమించును. నరక మండలములో చేరిన వసువు, అరుణుడు, నభస్వంతుడు, విభావసుడు అను నక్షత్రములు వాయవ్యమున వీణా మండలమున దిగువ కానవగుచున్నవి.

మీనరాశి



శింశుమార నక్షత్ర సమూహము

పడమర

శ్రీ మహావిష్ణుస్వరూపము పూర్తిగా అస్తమించినది. విష్ణునాభిసంజాతుడగు బ్రహ్మయు, వీణాపాణియై యతని ముఖముననున్న సరస్వతియు రాజహంసపై నెక్కి పడమటకు పోవుచున్నారు. ద్యావా, పృథ్వీ దంపతులకు శిరత్స్నాగమముకూడ ఇందువలన చక్కగా స్ఫురించుచున్నది. పాలవెల్లి దిగువ నైరృతి దిగ్భాగమున బ్రహ్మసోదరుడగు ధన్వికూడ అస్తమింపనైయున్నాడు.

దక్షిణమున

ఇంద్రద్యుమ్న మహారాజు తనమిత్రులు-నాళీకజంఘుబకము, ప్రావారకర్ణఘూకము, యుగంధరకమఠములతో కూడి దక్షిణమున చక్కగా మెఱయుచున్నాడు. భాగవతకథ ననుసరించి, ఏపర్వతసానువునందు వరుణుడు నివసించుచున్నాడో ఆ త్రికూటపర్వతము దిగువ ఇంద్రద్యుమ్నుడు నీటిలో ఆడుచుండగా మకర మాతని బట్టి పోరాట మారంభించినది. విష్ణుచక్రము (కాలచక్రము) మకరి తలద్రుంచువఱకును ఈ పోరాటము సాగుచునే యుండును. భారతార్థములో భీముడు-(స్వాతినక్షత్రము)- అజ్ఞాతముగా ఏకచక్రపురమున నున్నపుడు కొంతకాలము బకాసురునిఆటలు సాగినవి. స్వాతి ఉదయించగానే బకుడు చావగలడు.

## యుగంధరకమఠము: క్షీరోదదక్షిణధ్రువము

క్షీరోదము, లేక పాలసముద్రము అనబడు మండలమునకు ఉత్తరధ్రువము కన్యామండలముకడ నున్నది. దక్షిణధ్రువమున కమఠము - తాబేలున్నది. దక్షిణధ్రువమున తాబేలుండుట ఈపటమున చక్కగా చూడనగును. పాలసముద్రము మథించునపుడు ప్రమాదము రాకుండ కూర్మమయి శ్రీహరి రక్షించెనని చెప్పు పురాణగాథకు మూలము క్షీరోదదక్షిణధ్రువమున నీకమఠ ముండుట యే కావలెను. పాలసముద్రమథనము పూర్తియైన పిదప దేవతలకు, రాక్షసులకు, అమృతము పంచియిచ్చినది

కన్యా-జగన్మోహిని - క్షీరోదమునకు ఉత్తర ధ్రువము కన్యారాశికి పడమం డున మనము చూచియున్నాము.

### తూర్పున

బ్రహ్మహృదయము, అజశాబకములతో కూడిన సారథిమండలము ఆగ్నేయమున నుదయించినది. అల్లిమించనైయున్న బ్రహ్మ (Vega) నక్షత్రమును, ఉదయించిన (Capella) బ్రహ్మహృదయమును తేజోవిమయమున పరికించి మెచ్చదగి యుండును. తూర్పున Orion యోధుడు ఇపుడే ఉదయించినాడు. ఆర్ద్ర ఎఱ్ఱగా మెఱయుచుండ, దానికెదుర పరిన్యక్త (Bellatrix) ఆ దెసను Rigel చుక్కయు చక్కగా మెఱయుచున్నవి. యమున తీరా సమీపమున నుదయించి ఎన్నో వంకరలు తిరుగుచు సుదరు శంతనునికడ ముగియున ట్లగపడుచున్నది.

### మత్స్యను

పాలవెల్లి అంచున గరుడసమీపమున శ్రవణము తేజరిల్లుచున్నది. శ్రవణమునకు తూర్పున ధనిష్ఠ కలదు. ధనిష్ఠ దెసను మకరమును, మకరము దెసను కుంభమును గలవు. వీటికి తూర్పుగా పేష్వపూర్వము గగనమధ్యరేఖపై ఉన్నది. దాని కుత్తరముగా ఇంద్రమదయు, అప్సరసలును ఉన్నారు. ఇంద్రమదను పీడించిన పులోముడు ద్రుష్ట మిటకరించుకొనుచు పాలవెల్లి దెసనే ఉన్నాడు. ఆమె గర్భచ్యుతుడైనచ్యవనుడు రేవతికి తూర్పుగా అశ్విని సమీపమున నున్నాడు. అశ్వులకెదుర భరణియు, భరణికావల మిలమిలలాడుచు కృత్తికలును, కృత్తికల కుత్తరముగా భృగు-పరశుమండలమును కలవు. కృత్తికలకు తూర్పుగా శకటాకారము గల నక్షత్రములలో రోహిణి ఎద్దుకన్నులాగున ఎఱ్ఱగా మెఱయుచున్నది. రోహిణికావల తూర్పుగా మృగశిరచుక్కలు మూడును ముత్యములవలె తళతళలాడుచున్నవి.



శింశుమారము

### శింశుమారము

మీనరాశిదెసను అశ్వులరక్షమున కొకప్రక్క వాహనమైన శింశుమారమున్నది. శింశుమార మనునది యొక ఘోర జలచరము. దానిరూపము పైన చూపినను అందలి వివిధనక్షత్రములు ఆయా పుటలో గల చిత్రములో చూపనగును.

చూచుటకు భయంకరమైతోచు ఘోరరూపముతోనున్న యీజలచరము రాక్షసులతో మిక్కిలి సంబంధము గలిగియున్నట్లు కనబడుచున్నది. చిత్తగింపుడు.

పాశ్చాత్యు లీచుక్కలగుంపును (Ceti) 'సెటి' అందురు. వాల్మీకి రామాయణము ఉత్తర కాండలో రాక్షసవంశవర్ణన మారంభించుచు, మూలపురుషుల నిట్లు వర్ణించినాడు:—చూ. ఉత్తరకాండ 4.9 - 18.

౯. "ప్రజాపతిః పురా సృష్ట్వా హ్యాప స్సలిల సంభవ."

౧౦. 'కింకర్మ' ఇతి ధ్యానంతః క్షుత్పిపాసా భయార్దితాః"

౧౧. "రక్షామేతిచ ద్యై రుక్తం రాక్షసా స్తే భవంతు వః—"జక్షామేతి చ ద్యై రుక్తం తేవై యక్షా భవంతు వః"

౧౬. "తత్ర హేతిః ప్రహేతిశ్చ భ్రాతరౌ రాక్షసాధిపౌ"

౧౭. "ప్రహేతి ర్ధార్మిక స్తత్ర తపోవనగత స్తదా."

౧౮. "సకాలభగినీం కన్యాం భయాం నామ భియావహామ్."

*  *  *  *

పూర్వకాలమందు బ్రహ్మ-ప్రజాపతి నీటిని, నీటినుండి కొన్ని ప్రాణులను సృష్టింపగా, అవి రెండు విధములయ్యెను. నీటిని రక్షించునవి కొన్ని, భక్షించునవి కొన్ని. మొదటివి నీటినిరక్షించు ప్రాణులు రాక్షసులును, రెండవరకము నీటిని భక్షించునవి యక్షులును అయ్యెను. నీటిమధ్య నిలిచి నీటిని రక్షించుము, నీటిచే రక్షింపబడుచున్నవారు రాక్షసులు- రాక్షసులలో ఇద్దరన్నదమ్ములు - హేతి, ప్రహేతి. ప్రహేతి వనమునకు బోయెను. హేతి, కాలుడనగా యమునిచెల్లెలు భయ అను నామెను వివాహమయి సంతానము బడసెను. భయయే యమునిచెల్లెలు యమున.

సంస్కృత 'హేతి'యే లాటిన్ 'సెటి' అయ్యెనని నావిన్నపము. హేతి యమునల సంతానము రాక్షసవంశ మయ్యెను. ఇందు మైరానక్షత్రము కుంభకర్ణుడనుటకు ప్రబలకారణము లగపడుచున్నవి. కుంభకర్ణుడారునెలలు నిద్రించి, ఒకనాడు మేల్కాని, క్రమ్మర నిద్రపోవును. మేల్కొన్ననాడు వాని నెవ్వరు జయించ లేరని జనప్రతీతి. రామాయణము యుద్ధకాండము ౬౦-౧౭ లో "సుప్తంస్వపితి నిశ్చిన్తః కాలోపహతచేతనః, నవ, షట్, సప్త, చాష్టౌచ మాసాన్ స్వపితి రాక్షసః" అని చెప్పబడినది. కుంభకర్ణునకు ౬, ౭, ౮, ౯ మాసములు నిద్రపొందును. సరియైననిర్ణయము లేదు. అలాగే ఈ మైరా సెటి నక్షత్రము ఒకొక్కప్పుడు మిక్కిలి తేజముతో మెఱయుచు, క్రమముగా కాంతి గోల్పోవుచు కంటికి కానరాకయుండును. మరల మరి కొంతకాలమునకు తిరిగి తేజోవంతమగును. సరియైన క్రమము లేదు. **Irregular Variable Star** అందురు.

వివరములు వేరొకసారి చర్చింతము. విష్ణు డస్తమించిన పిదప రాక్షసులమిడిసిపాటు.

## ఉల్కాపాతములు

ఈనెల ౧౪-౧౬ తేదీలమధ్య సింహరాశిలో గొప్ప ఉల్కాపాతము కనబడును. మఘలో పల్లకి బొంగు అనదగుచుక్కలు ఉన్నచోటనుండి పడుచున్నట్లు ఉల్కలు కనబడును. ఈ ఉల్కాపాత వివరములు వెనుకటిసంచికలో ఇచ్చియున్నాను. ౧౭-౨౭ తేదీలమధ్య ఇంద్రమవప్రాంతములో మెల్లగాను, ఈజ్వలముగాను ఉల్కలు రాలగలవు.

## విశేష విషయములు

కార్తీక శుద్ధ ద్వాదశినాడు ఉదయము-సూర్యాస్తమానము కాకపూర్వము - శ్రీమహావిష్ణువు తూర్పున ఉదయించును. వైష్ణవులకు ఇది చాల ముఖ్యమైనదినము.

కార్తీక శుద్ధ పౌర్ణమి అందరు హిందువులకును ముఖ్యమైన పండుగదినము. అందులో శైవులకు చాల ముఖ్యమైనపండుగ. ఆరాత్రితొలిజామున జ్వాలాతోరణములు కట్టి శివభక్తులు ఈశ్వరవిగ్రహములను జ్వాలల క్రిందనుండి అటునిటు ఉత్సవముగా తీసుకొని వెళ్లుదురు. ఈజ్వాలాతోరణమును ఉత్సవముకూడ ఆకాశనాటకము ననుసరించి జరుగు ఉత్సవమే. ఎట్లనగా:—

ఆకాశరంగమును ఒకసారి తిలకించి చూచినపుడు మన మీక్రింది అంశములను గ్రహింపగలము.

కార్తీకపున్నమనాడు సాయంకాలము సూర్యాస్తమానముకాగానే పరిశీలించితిమేని, విశాఖనక్షత్రము అపుడే అస్తమించుచుండును. విశాఖ ఇంద్రాగ్ని దైవత్యమైన గుంట్రని నక్షత్రముల రాశి. అగ్నిగుండము వంటిది. కుజుడుకూడ ఇపుడు ధనూరాశిలోఉన్నాడు. మదనుని అగ్నిసోకి సకల భువనములు వ్యాకులము పొందును. ఉత్తరాభాద్రనక్షత్రము గార్హపత్యాగ్ని. (చూడుడు ఐతరేయ బ్రాహ్మణము-III-3-36.) ఉత్తరాభాద్రకు అధిదేవత అహిర్బుధ్న్యుడు. అతడే గార్హపత్యాగ్ని. ఇంకను తూర్పునకు పోవంబోవ, కృత్తిక అగ్నిదైవత్యము. రోహిణి ఎద్దుకన్నువలె ఎఱ్ఱగా ఉద

యమగును. ఆగ్నేయమున యమునకగువ Chemical Furnace వంటి ధుంధుడు సముద్రతీరపులినతలమున జాజ్వల్యమానుడై యున్నాడు. సారథిలో అగ్నినక్షత్రము (బీటా Taurus) చిన్నవెలుగులో అగ్ని మీద ఉత్తరమునను, క్రింద దక్షిణమునను ఉన్నవికాక అగ్ని దేవతాకములును, అగ్నిసదృశములును అగు నక్షత్ర మాలికలు తూర్పునుండి పడమటకు వరుసగా వ్యాపించి యున్నవి.

వీటిని అనుసరించి భూమిమీద కార్తికదీపములు దీపమాలికలు, జ్వాలాతోరణములు అగపడుచున్నవి.



చంద్రభాగానది (పండరిపురము) M. V.

# అల్లాడి కృష్ణస్వామి

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

మానవుడు యాత్రికుడు. ఇట్లని అతడు గుర్తింపవలెను. గుర్తింపనిచో అతడు వ్యర్థజీవి యగును. శిలావిగ్రహమై ఎందో పడియుండును. గుర్తించుచో ముందంజ వేయును. భావికాల ముఖమున



శ్రీ అల్లాడి కృష్ణస్వామిగారు

శమంతకమట్లు వెలుగు ఆశయమును చేరును. కర్తవ్య నిర్వహణము కావించుకొని, విజయానందములను కంఠమాలలు చేసికొనును. కాని, యీతనియాత్ర గులాబి రేకులతో నిండినది కాదు. అందున్నవి వాడిముండ్లు. అం దెదురగునవి ఎత్తుకొండలు; మార్కొనునవి కడగండ్లు. ఒకమారు నిజాంతరంగములోనికి కన్ను మరల్చి, అందు జ్వలించు శక్తిస్ఫులింగమును గుర్తించి, దైన్యమును, దుఃఖమును దాని కింధనములు చేసి, దాని తేజమును తనకృషియందు పూరించునాతడే అంజవేయ గలడు. చెమ్మటబొట్టులేకాక, రక్తబిందువులు కూడ నీయంజయందు నవవర్ష ధారలు కావచ్చును. ఈ యంజ ఆశయవ్రతులును, అమరులును సేవించు తీర్థసోపానమై వెలయును. శతాబ్దులును, సహస్రాబ్దులును ఇందు గ్రుంకులిడి పునీతము లగును. ఇట్టి యంజవేయు యాత్రికులసంఖ్య మిగుల నల్పమైనది. కొంతకాలము వీరు మిలమిల మెఱయు ఐహికసామగ్రిపై కన్ను వేసినను, వాని నతిక్రమించి జేజేలు పాడుచు, పరంజ్యోతియట్లు ప్రకాశించు పరమాశయమును చేరెదరు. మఱి కొందఱు యాత్రికులయ్యు కొంతదూరముమాత్రము సాగిపోయి దృఢనిశ్చయమును జారవిడిచి, ఐహికసుఖమే అధిష్ఠానదేవత యని అపోహపడి దానికే అంజలి ఘటించి తమపని తీఱినదని సంతృప్తినంది చతికిల పడుదురు. వీరి సంతృప్తి వీరిగమనికను పుటుక్కున త్రెంచివేయును. సామాన్యులందు పెద్దలట్లు పరిగణింపబడినను, నిర్వాణమెఱుగని జ్యోతులై వీరు కాలవియత్తలమున కాంతిలరు.

అల్లాడి కృష్ణస్వామి యాత్రికుడు. కొండకోనయందు, రమ్యారామమందు, సుఖ సుగంధమందు ఈతడు పుట్టలేదు. లోతు లోయయందే ఈతడు పుట్టినాడు. పుట్టి, హిమాద్రివంటి భావి జీవనముపై లేతచూడ్కులు సారించినాడు. నిష్పృహత మీతని నోడియందు చేర్చుకొనినది.

దారిద్ర్య_సన్యమును క్రోలు మహాభాగ్య మెంద రికి లభించును ! భాగ్యభోగ్యము లిచ్చుపాలు కండను, క్రొవ్వును పెంచునేమో కాని, వేదజీకమిచ్చు క్షీరము ఆత్మదాహమును దీర్చు అమృతమగును ! శరీరము కొంత కాలము క్షీణించిననేమి ? మనసు మలమలమాడిన నేమి ? అజ్ఞానియై కొంతకాలము నిరుపేద హాహాకారములు పలికిననేమి ? ఈతను పడు బాధలనుండి, వీడు నిట్టూర్పులనుండి, ఓర్పు కన్నీటినుండి, సంక్షుభితమైన ఈతని జీవనజలధినుండి విజ్ఞానలక్ష్మి ఉదయించును! ఈతని భావిజీవనమున పండువెన్నెల వోయు శాంతి శీతాంశువు జనించును ! అస్థిపంజరములందు ఎన్నెన్ని దివ్యదీపములు వెలిగినవి కావు ? ఎందరెందరు రాజాధి రాజులు తమయైశ్వర్యమునకు దిగదుడుపని దారిద్ర్య మును కవుంగిలించుకొనిరికారు ? తన మహత్త్వమును నుతింపదలచినవారికి దేవియై దారిద్ర్యము వరములిచ్చును. తన్ను చూచి 'అయ్యో !' అనువారిని పెయ్యమై పీడించును. వ్యక్తికిగతదృష్టకష్టమునందేకదా అభ్యున్నతిగాని, అనిష్టముగాని జనించును ! ఇచ్ఛాశక్తియనుపు, దృఢ నిశ్చయమనుడు, నిరంతరకృషియనుడు, ఆత్మసంయమ మనుడు దారిద్ర్య మొసగు పాఠమువలననే, దారిద్ర్యము ప్రసాదించు అనుభవమువలననే మానవున కబ్బును. కృష్ణస్వామిజీవనము ఈసత్యమునకు ప్రత్యక్షతార్కాణము. ఈతడు బంగారుతొట్టెలందు పెరిగియుండి నచో, మానసటుపాధ్యాయలలం బెరిగియుండినచో, పండి బంగరుగిన్నెలందు కలమాన్నమును మెక్కియుండినచో, హంసతూలికలపై శైశవమును దొరలించియుండినచో తనజీవనమును సురసుమముల దీపావళి కావించుకొని యుండెడు. తనయాత్రయందు పాడగట్టిన కారుచీకటుల నీదీసావళిచే నెనుర్కొనియుండెడు.

అణువై పుట్టినవానిని మేరువుచేయు శక్తులు ఒక్కొక్కకాలమున ఒక్కొక్క దేశమం దుండును. ఐహికాభివృద్ధికి తోడ్పడు శక్తు లెన్నో పాశ్చాత్యభూము లందు కలవు. భారతసీమయం దవి మిగులనల్పము. నేటి కంటె గత శతాబ్దమున నాత్మోన్నతికి సాయపడు కష్టలు మనదేశమందు విశేషముగ నుండెడివి. కావున గత శతాబ్దమున మనదేశమందు ఎందరో మహాపురుషులు పుట్టిరి. అల్లాడి కృష్ణస్వామి గత శతాబ్దాంతమున (1883 లో) పుట్టినాడు. కడుకష్టమున విద్యార్థిజీవనమును కడపినాడు. ఎదురైన ఇక్కట్టులను అల్లనల్లన నెట్టివేసి,ఆదర్శవిద్యార్థియై,ఆచార్యులదృష్టి నాకర్షించి, బహుమానములంది, ప్రశంసాపూర్వకముగ పరీక్షలం దుత్తీర్ణుడై తాజదివిన కళాశాలయందే (The Christian College) కొంతకాలము ఉపాధ్యాయుడై యుండెను. కాని, కృష్ణస్వామి న్యాయవాది వృత్తిపై మనసుంచినాడు.

నేటివలె నా డీవృత్తిపై వడగండ్లివాన కురియ లేదు. నాకచక్యముగల యువకుల నాదరదృష్టితో చూచు పెద్దలు పల్వురు నాడుండిరి. వి. భాష్యం అయ్యంగార్, పి. ఎస్. శివస్వామి అయ్యర్, వి.కృష్ణ స్వామి అయ్యర్, సుబ్రహ్మణ్య అయ్యర్, పి. ఆర్. సుందర అయ్యర్ మున్నగు వారీతని కన్నుగుట్టిరి. వి. కృష్ణస్వామి అయ్యరు వక్తృతా కౌశలమును ఆవేశపూరితుడై నేమను ఈతడు ప్రశంసించుచుండును. ఎదుటనోచిన దిగ్గజములను, వారి విజయమును అల్లాడి రెప్పవాల్పక విలోకించినాడు. వారి వృత్తిని తనయది గావించుకొన నిశ్చయించినాడు. నేటివలె నా డీవృత్తియం దధికసంఖ్యాకులు లేరు. కావున పోటీగాని,దొమ్మిగాని కృష్ణస్వామికి గోచరింపలేదు. ఎంతయు నెమ్మదిగా ప్రవేశించి అచిరములో తనబుద్ధికుశలత వ్యక్తపఱచినాడు. ఆచార్యు డీయువకునిశక్తి నుత్తించి, యీతని భావిజీవనము భాసమానమైయుండునని జోస్యము చెప్పినాడు. " Child is the father of man " అనికదా వర్డ్స్‌వర్త్ కవీంద్రు డనినాడు. "Morning shows the day" అనికదా మిల్టన్ మహాకవి పలికినాడు! మహాపురుషుల భావిజీవనమునకు వారి శైశవమే కదా చక్కని మున్నుడియై శోభిలును ! సూర్యభగవానుని ప్రభాకలితజీవనమంతయు తొలుదొలుత తూరుపున తోచు రక్తాభయందే తళుక్కుమనుకదా !

అల్లాడి కృష్ణస్వామి

న్యాయవాదవృత్తి ప్రత్యేకప్రాముఖ్యము కలది. దీని కొకతట్టున స్వర్గమున్నది; వేఱొకవైపున నరకమున్నది. నీతినియమములను పాటించువ్యక్తి తనముఖమును స్వర్గముదెసకే త్రిప్పి, తనవృత్తికి విశేషగౌరవము దెచ్చును. నీతినియమములకు నీరువదలువ్యక్తి తనబుద్ధిని పెడదారికి పట్టించి, తాను నరకమున కూలబడి తన వృత్తికి తీరనికళంకము దెచ్చిపెట్టును. మనుష్యహృదయమున దైవమును, మానసమున దయ్యమును ప్రవేశించి తఱచుగ ఘోరయుద్ధము సలుపుచుండునుకదా! దైవచింతగాని, ఆశయారాధనముగాని యెఱుగనివ్యక్తి పిశాచమునకు దాసగుట తథ్యము. ఇట్టివ్యక్తులు వివిధజీవనాంగణములం దుందురు. మంచికిని చెడుగునకును కూడ నవకాశమిచ్చు నావృత్తియందు ఇట్టివారు పల్వురుందురని అనేకులు వాకొందురు. జోనాథన్ స్విఫ్టు "న్యాయవాదులు తెలుపును నలుపనియు, నలుపును తెలుపనియు ఋజువు చేయగల" రనినాడు. (Vide Gulliyer's Travels") అద్భుతప్రజ్ఞానిధియగు నీగ్రంథకర్త దురదృష్టవశాత్తూ తనదృష్టిని సంఘజీవనమున నేమూలయందో, యెపుడో తోచు క్రుళ్లుగోతులమీదనే కన్నువేసి వాడిశూలపులుపోలు మాటలనే విసరి, విధ్వంసగర్భితమైన సాహిత్యనే తయారు చేసినాడు. ఈతని కటూక్తులను త్రోసివేసినను, షెల్లివంటి కవి యీ వృత్తినిగురించి ప్రతికూలాభిప్రాయమును వ్యక్తీకరించినాడు. ఉత్తమ నియమములను తిలోదకములు వదలిన వ్యక్తులు కొంద ఱీవృత్తియందుండిరని, ఈవృత్తి మహత్త్వమును స్మరింపక, ఈవృత్తి కనిన మహాపురుషులను కన్నెత్తిచూడక అనుచిత విమర్శనమునకు కడంగుట పాడికాదు.

ఉన్నతవృత్తు లన్నిటిలో న్యాయవాదవృత్తి మిన్నయైనదనుట నిర్వివాదాంశము. వివిధ విజ్ఞానశాఖలం దాటితేఱినవ్యక్తికి చక్కని ఆటపందిరి కాదగునదీ వృత్తియే! తీక్ష్ణదృష్టి, విశాలభావము, విశేషసహనము, సూక్ష్మపరిశీలనము, సముచిత ప్రపంచానుభవము ఈ వృత్తి కవసరములు.

వివిధ చిత్తవృత్తులపై కన్నిడి మనుష్య చరిత్రయందలి గూఢాంశములను పిడికిటబట్టగల వ్యక్తులు వసుంధరయం దిరువురుమాత్రము కలరు—ఒకడు నాటకరచయిత, రెండవవాడతడు న్యాయవాది. లౌకికశాస్త్రములలో నొక్కటియై వీని యన్నిటికిని ఆధారములైన తర్కసూత్రములపై పెంపొందినను, అది కేవలము శాస్త్రమని తలపరాదు. కనులెదుట గోచరించు దృశ్యములనుండి, జడవస్తువులనుండి భౌతికశాస్త్రవేత్త తన సూత్రములను చెక్కుకొనును. మత్స్యయంత్రమట్లు కనులెదుట గానుపింపక, అనవరతము చలించు మానసమును క్రియాంగణమునుండి పరికించి, అందుండి న్యాయవాది తన సిద్ధాంతములను ప్రోగొనరించుకొనవలెను. నుల్లవలె కానుపించు రికార్డునందు అక్కఱైన అంశములపై కన్నువేసి, దానికతన సత్యమును గ్రహించి, దాని విజయమునకై నడుముగట్టుదిట్ట న్యాయవాది. జటిలాంశములను తృటిలో గ్రహించి, విశేషయోజన సలుపకయే అంతరంగమునుండి భావపరంపరలను వెడలింపగలవాడు న్యాయవాది. (కావున Ready wit, Resourcefulness, clear thinking, free expression లు ఈతని ప్రత్యేకగుణములై యుండును.) అవిరళ భావవ్యక్తీకరణము కళయగుడు అవర్ణ్యన్యాయవాదియం దాటితేఱియుండును. సాహిత్యసామ్రాజ్యమున పట్టభద్రుడు కాగలిగిన వ్యక్తి ఈకళయం దభిరాముడై వెలయును. ఎదుటివారి నీతడు మంత్రముగ్ధుల జేయగలవాడు. కడుకౌశలమున సమ్మోహనాస్త్రము ప్రయోగింపజాలువాడీతడు. కావున మహావక్తలును, రాజకీయవాదులును, పాలకులును న్యాయవాదుల వర్గమునుండియే విశేషముగా వెలువడుచుంట జూతుము. తన యద్భుత శక్తులను న్యాయస్థాపనము కొఱకును, సత్యసందీప్తజీవనము కొఱకును, స్వాతంత్ర్యరక్షణము కొఱకును, ఉత్తమాశయ పూర్ణత్వము కొఱకును ఆత్మజీవనమును బలిదానము గావింపజాలునాతడే నిక్కంపు న్యాయవాది. ఇట్టి న్యాయవాదులు ప్రపంచమం దపుడపుడు అందందు జనింతురు.

ఇట్టివా రొకప్పుడు పల్వురు రోములో నుండువారు. అధునాతన పాశ్చాత్య న్యాయశాస్త్రమునకు రోము పుట్టినిల్లు అయినది. సిసేరో మున్నగువారు ఘనపాండితిని, అద్భుతప్రజ్ఞా ప్రతిభలను వ్యక్తీకరించిరి. ట్యూడరు రాజులనాటినుండి ఆంగ్లసీమయందు ప్రజ్ఞాధురీణులైన న్యాయవాదు లుద్భవించిరి. మేధాసంపదయం దేమి, విద్యల నీతిచారిత్రమం దేమి, దేశభక్తియం దేమి, దైవభక్తియం దేమి, అనన్యసామాన్య ధైర్యసాహసములం దేమి, స్వార్థత్యాగమం దేమి సర్ థామస్ మోర్ అపర్వ పురుషుడు. నేడును ఆంగ్ల అమెరికను రాజకీయములను నడపువారు న్యాయవాదులేయని ఎల్ల తెలుసుదురు.* మనదేశమందును ఇట్టిమహనీయులు కొందఱు జనించిరి. తారకనాథపాలిట్, రాష్‌బిహారీఘోష్, అషుతోషు ముఖర్జీ, చిత్తరంజనదాసు, లజపతిరాయ్, మోతీలాల్ నెహ్రూ, గాంధీ ప్రభృతు లీవృత్తియందు పేరుప్రతిష్ఠ లందినవారే. ఈవృత్తిని నిమిత్తము చేసికొని వీరు బహుళవిజ్ఞానాంశములను దిగ్రమింగిరి. చిత్తరంజనుడు కళోపాసకుడు, దేశభక్తుడు నై వరలినాడు. రాష్‌బిహారీఘోష్ ప్రపంచమహాన్యాయవాదులందొక్కండై భారతరాజకీయములందు విశేషపరిశ్రమ సలిపినాడు; ఒక కాంగ్రెసుమహాసభ కధ్యక్షుడైనాడు. నేడు కవల లట్లు మసలుచున్న జయకరు-సప్రూలు చక్కని న్యాయవాదులు. జయకరు మంచి వక్త. సప్రూ వక్త కాడు, రచయితయును కాడు. ఈతని వాక్కులందు కళాకౌశలము లేదు. కాని శివస్వామిఅయ్యరువలె స్పష్టయోజనమందును, సులభవ్యక్తీకరణ మందును, ఆంగ్ల రాజ్యాంగ పరిజ్ఞానమందును ఇత డాతిశేతేనాడు. నెహ్రూ, పటేలు, జిన్నాలు గట్టిడిబేటరులు. న్యాయశాస్త్రమును, న్యాయవాదవృత్తినిమాత్రము గట్టిగ పట్టియుండి తక్కిన విజ్ఞానాంశముల నంతగా నెఱుగని (యిల్లెఱుగుటకు తనకు సమయములేదనినాడు) ముల్లా స్పష్టరచనయందు మేలుచేయి అనిపించుకొనినాడు. ఈ వ్యక్తులు అపర్వ న్యాయవాది కుండవలయు లక్షణముల నన్నింటిని అలవఱుచుకొనగలిగిరి. ఈ వృత్తియందు విజయమందుటకు ముఖ్యముగ కావలసినది "బరాత్" (నొసలు వ్రాత) అని వంగీయు లందురు. అదృష్టము వలననే ఎన్. ఎన్. సర్కారు పైకి వచ్చినాడు. కోటి రూకలు సంపాదించియే కలకత్తా హైకోర్టులోని తన ఎడ్వకేటుజనరలుపదవిని విసర్జించి, యితడిపుడు ఇండియా గవర్నమెంటువారి లా మెంబ రైనాడు. ఈ మహాశయుడు వక్త కాడు; వ్రాతకాడు కాడు; విజ్ఞాని కాడు. కళోపాసనమం దీతనికి అభిరుచి లేదు. సారస్వతసేవ యీతడు ప్రాపుచూపలేదు. తాత్విక గభీరత నీత డెఱుగడు. మనసైయుండి, యింగ్లాండు పోయివచ్చి తన అదృష్టపురేఖను చూచుకొనినాడు.

పైన పేర్కొనబడిన గొప్ప న్యాయవాదులలో అల్లాడి కృష్ణస్వామికి నిస్సంశయమైన స్థానము కలదు. ఈతనిది సైన్సు బ్రెయిన్. బహుళాంశములను భారతీయులు 'సైన్సుదృష్టి'తో చూడవలెనని యీతనితలంపు.† ఇతని మెదడు వాడికత్తికంటె వాడియైనది. క్లిష్టాంశముల నునిముసములో భేదించి ఎట్టిగట్టివిఐనకేసునైనను తనపక్షమునకు మరలించి, తనకేసుచుట్టు పదాతులై నిలువజాలు ప్రమాణములను కనునేర్పున నెలువజేసి, ఎదుటి లాయరునకు సందీయక, న్యాయమూర్తి సంశయమునకు చోటీయక

* "In England lawyers are the envy of the people and in America they are so prominent a section that they had to be approached for everything, particularly in administrative matters." Vide: T. R. Venkatrama Sastry's Trichur Speech, "Hindu" 7 th september 1935.

† "The feeling is growing strong that the scientific attitude of men must come out of the laboratory and be applied to the events of daily life and it is only by the adoption of the scientific attitude that you can fight disease, squalor and dirt the great enemies of humanity"—Sir Allady Krishna Swamy

కృష్ణస్వామి తనకేసు నెగ్గించుకొని తీఱును. ఈతని జ్ఞాపకశక్తి అసాధారణమైనది. తనకేసునకు వలసిన ప్రమాణముల (Authorities) నీతడు Index నూత కొలచేసికొని వెతకుకొనడు. ఇతని బ్రెయినే ఒకపెద్ద Iudex గ్రంథము. స్మృతిపథమునుండి, అది అవసరమైనసరకును బరబరలాగుకొని వచ్చును. ఒకానొక Authority కై రామసంద్రుబలెనుండు నీతనిజూనియరులు లారిపోర్టులపై దుమికి యుండును అందును వ్రేలాడుచుండ, జిరునగవు ఆననమునఁదోప కృష్ణస్వామి అది యడగియున్న తావును చెప్పివేయును.* వివిధహైకోర్టులందును, ప్రీవీకౌన్సిలులోను, వివిధసమయములందు, వివిధన్యాయమూర్తులు, వివిధములైన కేసులందు వ్యక్తపఱిచిన తీర్పులను తన మానసమంజూషమున దాచుకొని అక్కరగునియుసమున వాని నీతడు బయటబెట్టును. ఈతని న్యాయశాస్త్రవిజ్ఞానమే యీతనిశక్తి. అఘతోషుముఖర్జీ యింగ్లీషు అమెరికన్ కేసులను త్రవ్వి అందలి విజ్ఞానప్రకారమును తనతీర్పులందు పాటించువాడు. అల్లాడి కృష్ణస్వామి ఆంగ్లకేసులనుండి తనవాదనలకు అక్కరైనసామగ్రిని గైకొనును. కొండొకనిబంధనము ఆంగ్లేయకోర్టులం దెపుడుపుట్టెనో, ఎట్లు ప్రయోగింపబడెనో స్పష్టవాక్యలం దీతడు తెలుపుచుండును. కేసునకు అక్కరలేనిఘోరశిలోని కీతడు దిగడు. అసలు పోయుంటును ఒకమూలనుంచి, చుట్టును గుడుగుడుకుంచముచు, 'వానాలప్ప' ను అడుచు రేమేమో వడవడ వాగుచూ, పెద్దవక్తలమని అనుకొనుచూ, తమకేసుచే పల్టీకొట్టించి, తాము పిల్లిమంత్రము వేయు న్యాయవాదులకు కృష్ణస్వామి చాల ఆమడలదూరమందుండును. వ్యర్థవిజృంభణ మీతనిప్రకృతికి విరుద్ధము. వట్టివాచాలత్వముగాని, ఢోకదంపుడుకాని, చిట్టుచెరుగుడు గాని, డబ్బా వాయింపుగాని యీతనికి గిట్టవు. అక్కరైన సరుకును, నాణెమైనసరుకును (అది అల్పమైనను, అధికమైనను) ఇతడు ప్రయోగించును. కారణకార్య సూత్రముపై కన్నువేయగలవాడే ఆఱితేఱిన న్యాయవాది కాఁగలడు. తత్త్వశాస్త్రమునకు తర్కశాస్త్రము తొలిమెట్టయినట్లు, న్యాయశాస్త్రమునకు తర్కశాస్త్రము అవసరమయిన మెట్టుఅయినది ఈశాస్త్రసూత్రములను పిడికిటబట్టగలవాడు చక్కని న్యాయవాది కాజాలును. చెట్లగొంపమున నెందో అడగియున్న పిట్టపై సూటిగ తూపువదలు విలుకానివలె అక్కరైన అంశముపై న్యాయవాది చూపు సారింపవలెను. యోధుని కనుగొని మార్కొనవలెగాని యితడిందును అందును బస్కీలు తీయరాదు. మానసికముగ తృటిలో వస్తువిభజన మొనరించి కారణసూత్రము చుట్టుచేరిన కలుపు నూడబెఱికి వేయుట న్యాయవాది తొలికర్తవ్యము;† సూత్రమును

* ఎన్నడో ఏలూరుకోర్టు ఆవరణమందు తానును, రామేశమును ఇటలీచరిత్రనుగుఱించి సలిపిన ప్రసంగము నివేవల నీత డేకరువుపెట్టినాడు. (Vide: Sir Allady's Speech delivered on the eve of Sir Ramesam's retirement)

† "The first step of elimination is to analyse the situation mentally" అనికదా Bain పలికినాడు. "The cause is equal to the effect" అనియు, "The cause is the immediate, unconditional, invariable antecedent to the effect" అనియు గ్రహించి The canon of agreement, the joint method of agreement in Presence and in Absence, the canon of defference, the canon of concomitant variations, the canon of. esidues సాయమున కారణకార్యముల గనుగొని deductive method చే ఋజువుచూపుకొనుటయు, నిజము కనుగొనుటయు సైన్‌టిస్టునకే కాక, న్యాయవాదికికూడ అవసరమైనక్రియలు. ఆతనివలెనే యీతడు Plurality of causes ను, Vicarious causes ను, Intermixture of effects, Fallacies ను ఎనుగొనవలెను. ఇట్లెనుగొనజాలు న్యాయవాదియే Relevancy ఎందున్నదో, Irrelevancy ఎందున్నదో, సత్యమెందున్నదో, అనృత మెందున్నదో గుర్తింపగలడు.

చేబట్టి నిజము ఋజువుచేయుట (Combination of Induction with Deduction) తరువాతి కర్తవ్యము. ఈకర్తవ్యములను నిర్వహించుటయందు కృష్ణస్వామి సిద్ధహస్తుడు.

విజయుడు కాగోరు న్యాయవాదికి వట్టి న్యాయశాస్త్ర పరిజ్ఞానము చాలదు. ఇతడు గట్టి లౌకికుడై యుండవలెను. అప్రతిభు డగువాడును, నీళ్లు నములువాడును, బిక్కమొగమువాడును, నిట్టూర్పు విడువాడును, చేతులు నులుముకొనువాడును, 'హతోస్మి' యనువాడును న్యాయవాదవృత్తినుండి దూరముగా తొలగిపోవలెను. ఇక్కట్టును నెట్టించు ఎత్తులం దితడు మేలు చేయి కావలెను. నెగ్గితీరవలెనని గట్టిపట్టు పట్టువాడు కావున, గామావలె తుదవఱకు జరిగి ప్రతికక్షిని అల్లాడి చిత్తుచేసి తీఱును.

న్యాయవాది జడ్జినాడిపట్టు గట్టిఘటము కావలెను. అల్లాడి యిట్టి గట్టిఘటము. ఇతడు తన చూపులను న్యాయమూర్తిముఖమునకు బిగించివేయును. తనమందు ఎట్లు పట్టెచ్చినదో యితడు కనిపెట్టుచుండును. ముఖలక్షణములు తన కనుకూలముగ నున్నట్లు తోచెనేని తనపని నీతడు సరసముగ జరపుకొనును. అందవలక్షణములు చూపట్టెనేని చప్పున నీతడు తన వాపనలో కొంత కషాయమును కలుపును అతని మానసమున భావప్రవంతి యెట్లు పాఱుచున్నదో కనుగొనును. ఎదురుతిరిగిన పూరమును అనుకూలదిశకు త్రిప్పుకొనును. తన ఆశయమునకు భంగముదెచ్చు పరిస్థితులు గోచరించుతఱి వెంకటరామశాస్త్రివలె మంచిమాటలతో నీతడు న్యాయమూర్తికి మఱికొన్ని గోరుముద్ద లీయడు: అవిచలితచిత్తుడగు టి. రంగాచారి వలె పుట్టిమునుగ లేదని యూరకొనడు; ఏమియు జరుగనట్లు అల్లనల్లన కొండచిలువవలె నితడు ప్రాకడు. కోడె త్రాచువలె నెగిరిపడును. విచలిత చిత్తుడయ్యు సి. పి. రామస్వామి అయ్యరువలె ఉద్రేకమును లోపల నడంచి ఆననమున చిరునవ్వును తళుక్కొత్తింపడు. వరదాచారివలె వినమ్రుడై పని సాగించుకొనడు. అపజయముయొక్క ఛాయయైనను, చిహ్నమైనను, సూచనయైనను ఈతని రుద్రుని జేసివదలును. రణోర్వియందు ప్రవేశించిన సెపాయి యట్లు వెనుకముందులు చూడక మహావేశమున తన గుఱ్ఱమును ముందుల కుఱాయించువాడట. విజయకాంక్షియైన అల్లాడి వెనుకముందులు చూడడు. ఇతనిధైర్యసాహసము లపారములు. ఆగ్రహావేశుడగుతఱి రాష్బిహారీఘోష్, జె. ఎన్. రాయ్, తారకనాథ పాలిట్, చిత్తరంజనదాసులవలె నీతడు జడ్జి నెదుర్కొనడు.* ఎస్. శ్రీనివాసఅయ్యంగారివలె నొక్కొకప్పుడు వాపననడుమ జడ్జియెడల గోపించి కేసుకట్టను జూనియరు ముఖమునవేసి, యితడవ్వలికి జారడు. న్యాయమూర్తిని డీకొనుటగాని, అతనితో వాదించుటగాని విజిగీషునకు తగదని యీతడెఱుగును. పక్కాగడసరి కావున నాతని తనకేసుకు మరలించి ప్రతికక్షి కెదురుగ త్రిప్పును. ఇట్టివాదనాకౌశలమున నీతడు కె. శ్రీనివాసఅయ్యంగారికెందును దీసిపోడు. అనుకూలమైన తీర్పొకటి తనకేసునకు బలమైన ప్రమాణమైయున్నను, యీ యంశము న్యాయమూర్తి మనసున నెక్కనిచో సామాన్యన్యాయవాదివలె నాతురపాటున దానినే మాటిమాటికి రెట్టింపక, పెడదారిపట్టిపోవు జడ్జియూహను అనుకూలమోచనాపంథలోనికి మరల్చి, అట్టితీర్మాననిర్మాణమునకు తోడ్పడిన అంశముల నన్నిటిని పుంఖానుపుంఖముగ వివరించి, దానివిశ్వసనీయత దీతడు న్యాయమూర్తికి గట్టినమ్మిక పుట్టించును. వివిధములైన లారిపోర్టులందలి తీర్పులలో తన కనుకూలమైనవానిని 'భళాభళి' వతుగా నైకొనక వానియందంతఃసలిలయై ప్రవించు హేతు

* ఒకప్పుడు చిత్తరంజనుడు జడ్జి నెదుర్కొని "న్యాయమూర్తి ఏలికకు ప్రతినిధిమాత్రమే. నేను ఏలికను సంబోధించుచుంటిని." అని రోషమెసగ గర్జించుచు పలుకసాగెను. Full Bench లో అషుతోషు ముఖర్జీ యుండెను. చిరునవ్వునవ్వి చేసన్నచే నతడు దాసును శాంతిపఱచెను. పాలిట్ ఒకప్పుడు బెంచి కెదురు తిరిగి "న్యాయమూర్తి నన్ను నౌకరుగ నెంచుచుండెనో ఎడ్వకేటుగ నెంచుచుండెనో యెఱుగ" ననెను. వీరావేశుడై రాష్బిహారీ పలుమాఱాడిన మాటలను లాయరుప్రపంచ మెఱుగును.

వుపై కన్నుంచులాయరే బుద్ధిమంతు డనిపించుకొనును. ఏన్యాయవాదిగాని ప్రమాణములను మిషనువలె గాక స్వతంత్రబుద్ధిగల మనుజునివలె గైకొనవలెనని కృష్ణస్వామిదృష్టాంతము నొక్కి చెప్పుచున్నది.

కృష్ణస్వామి అగునాతన ఆంగ్లపార్లమెంటు డిబేటులను అనుకరింప మక్కువపడును. డిబేటరు పనియును న్యాయవాదిపనియును ఒక్కటియే. తాను ఉపపాదింపనున్న తీర్మానమును గుఱించి మాట్లాడి, ఎదుటిపార్టీనాయకుని వాదనలకు వీనులొగ్గి, దానిని తునియలు చేయుట డిబేటరు కర్తవ్యము. తనకేసునకు వలసిన ప్రారంభోపన్యాసమొసగి, ప్రతికూలపక్షపు న్యాయవాది వాదనలను పదంపడి ముక్కలు చేయుటయు, తన వాదనయందలి బలమును నిరూపించుటయు న్యాయవాది పని. కావున పార్లమెంటరీడిబేటుపద్ధతి న్యాయవాదికి మేలుబంతియై యుండవలెనని అల్లాడి అభిప్రాయము. నేటి పార్లమెంటులోని డిబేటులు వ్యవహారరీతిని (Business method) జరుగుచుండును. పని చెల్లిపోవుటయే నేటి సభ్యుల ఆశయము. చెప్పదలచినదానిని కొలది మాటలందు, చిన్నిమాటలందు, స్పష్టమైన మాటలందు, అక్కరైన మాటలందు, బలమైనమాటలందు చెప్పి పని ముగించుకొనువాడే గట్టి డిబేటరని తలపబడును. ఘనపాండితిని విజృంభింపజేయుచు, వరుసగ నాలుగైదుగంట లుపన్యసింపగల బర్కునకు నేడు చోటులేదు. వేషభాష తెలుగుక పల్లెటూరికాపువలె రంగస్థలిపై నిలిచి, జలధరమట్లు గర్జించి, ఆంగ్ల డెమస్తెనీసని పేరందిన చార్లెస్‌పాక్సునకు నేడు తావులేదు. పిన్నవయసునందే పెద్దలనుండలను దడదడలాడింపగల పిట్* నకును నేడు తావలము లేదు. నాటి విజ్ఞానము, నాటి వక్తృత్వధోరణి నేటి పార్లమెంటులో నిండుసున్నయై యున్నవి. ఇది యుగరీతి. నేటిజడ్జీ లీరీతినే అభిలషింతురు. న్యాయమూర్తికి రుచించు ఆటలనే న్యాయవాది ఆడవలెను; అతనికి రుచించు పాటలనే యీతడు పాడవలెను. కావున కృష్ణస్వామి (కళను ప్రశంసించువాడయ్యు, మహావక్తపై పూలచెండు విసరువాడయ్యు) నేడు అమలులోనున్న సైన్సుయుగమర్యాదనే మన్నించుచుండును.

కేసునుబట్టి, కేసునందు లాయరునకు గల నమ్మకమునుబట్టి న్యాయవాదిమాటలు దొరలును. సివిలుకేసులందు సెగలును, పొగలును పనికిరావు. అక్కరకు మాలినపట్ల వీనిని ప్రదర్శించు న్యాయవాది తన కేసును పాడుచేసుకొనును. కేసువిజయమున విశ్వాసము లేని లాయరు, లాను సరకించిన సరుకులేని లాయరు, ఏదో కొంత స్టీమ్ క్రక్కును! ముండ్లకంచెలను, సాంద్రవనమును ఛేదించి, చక్కని దారిచూచి, ఆ దారిగుండా న్యాయమూర్తిని దోకొని, నిజమెఱుగుట కాతనికి సాయపడు న్యాయవాది జడ్జీకి ప్రీతిగూర్చును. కేసునందున్న తెట్టెకి అక్కరలేనిఘోష జేర్చి, బల్లగ్రుద్ది, నాల్కగ్రెంచుకొని, తాను ఉక్కిరి బిక్కిరియై ఎదుటి న్యాయమూర్తిని అయోమయమందును, అంధకారమందును కూలద్రోయు లాయరు పామరులైన క్లయింటులచే "వహవ్వా!" అనిపించునేమో కాని నిశితబుద్ధి గలవారికి రోతపుట్టించును. కొంత విజృంభణము క్రిమినలు కేసులందు చూడవచ్చును. క్రిమినలు కేసులందు మెదడుకంటె హృదయమునకు, యోచనకంటె ఆవేశమునకు పనియుండును. వీనియందు క్లిష్టాంశము లంతగా నుండవు. క్రిమినలు లాయరు జడ్జీ మెదడుమీద కంటె

* "Pitt's eloquence soon became the pride of his friends and the terror of all that opposed him. Sir Robert Walpole in his pride of place, with all the dexterity of ministerial management which a life had been spent in acquiring, was awed before this champion of simple virtue. Detected in his sophistries, stigmatized for his corruptions, baffled in his attempts at retaliation or defence, this intriguing statesman came at length to dread, as the signal of defeat, the very sound of his adversary's voice "Let us before all things" said he, "try to muzzle this terrible cornet of horse." Vide: "William Pitt, Earl of Chatham" By Thomas Carlyle.

జడ్జి సుండెపై నధికముగ నాధార పడును. కొంత emotion వున్నగాని యీతడు ఎదుటి హృదయమును సంబోధింపనేలేదు. ఈతనికి ఉపన్యాస కౌశల మధిక ముగను. సివిల్ లాయరు శైలి argumentative గా నుండును; క్రిమినలు లాయరుశైలి declamatory గా నుండును. సివిలు క్రిమినలు కేసులం దొకే తెలివిశక్తిని వ్యక్తపఱచినవారు సకృతు. మోతీలాలు సివిల్ లాయరు. బి. చాటర్జీ క్రిమినల్ లాయరు. ఎన్. ఎన్. సర్కార్ సివిల్ లాయరు. చిత్తరంజన సేనగుప్తాలు క్రిమినల్ లాయరులు. వీరి కావేశము మెండు. ప్రత్యేక రాజధానియందలి వాతావరణమునుబట్టి సివిల్ క్రిమినల్ లాయరులు తలనూపుచుందురు. మన రాజధానియందు పెద్ద క్రిమినలు లాయరులను కను వాతావరణము లేదు సామాన్య క్రిమినలు కేసులు లెక్కింపదగినవికావు. కలకత్తా హైకోర్టులో జరిగిన రాజకుమారికేసువంటికేసుగాని బొంబాయిహైకోర్టులో జరిగిన Bala murder case వంటి కేసుగాని మదరాసు హైకోర్టులో నెన్నడును జరిగియుండలేదు. ఇందు విశేషముగ సివిల్ పనికే అవకాశ మున్నది. కావున మన రాజధానియందు విశేషముగ సివిల్ లాయరులే పెంపొందిరి. ఈ వ్యాసమందు పేర్కొనబడిన మదరాసు లాయరు లందఱు సివిల్ లాయరులే. అల్లాడి కృష్ణస్వామి వీరి తెగలోనివాడు. కాని, ఆంధ్రుడు కావున ఈతనికి కొంత ఆవేశము కలదు. వాదించుచుండ నీతని వాక్కులు పిచికారీ గొట్టమునుండి వెడలు వేడినీళ్లవలె వెడలును! ధారాళ ప్రవాహము ఎదుటివానిని ముంచివేయును. పిచికారీ దెబ్బలో! ఎదుటివానిని ముఖ మెత్తనీయక లొంగదీయును! ఎస్. శ్రీనివాసఅయ్యంగారును, వి.జే. పటేలును కుమ్ముచూ కేసును నడుపువారు. వారివలె అల్లాడి ఎదుటికొండను నెట్టుకొని నెట్టుకొని ముందంజ వేయును. ప్రతిద్వంద్వియైన లాయరు సుందర, సుశోభిత-మాటలం దాఱితేరినచో, కొండవలిపోలు వాదనచే, అడిదమువంటి లాపాయంటుచే అల్లాడి లలిత కుసుమ విలసిత మాధవీలతల కెనయైన ఎదుటివచనములను పరపరగోయును. అభద్దపు మెఱుగు గల 'సుందరాంగి' సత్యముద్రోల అపరాధినియై నేలగూలవలసినదే! మిలమిల మెఱయు అందంపువాదనలను నేలరాల్చి, న్యాయమూర్తి మనసునుండి వెడలనున్న విరుద్ధ తీర్మానమును తునకలుచేసి ఆతని హృదయమున నూతన భావమును రేకెత్తించి ఎదుటి యుష్ణీషమునుండి తురాయిని నేలగొట్టి అల్లాడి కిరీటి యగును! కృష్ణస్వామి విజయమగును!! ఈతని ప్రజ్ఞను గుర్తించి ప్రభుత్వమువారు ఆ ఱొంబ్లము న్నీతనికి అడ్వకేటుజనరల్ పదవి నొసగిరి. మదరాసున నింతవఱకున్న ఏ అడ్వకేటు జనరల్ నకీయని నైట్‌హుడ్ నీతనికి సమర్పించిరి. హైకోర్టుజడ్జీ పదవికి నాలుగైదుమాఱు లాహ్వానించిరి. కృష్ణస్వామి ఈ యాహ్వానమును మన్నింపలేదు.

తా నెన్నుకొనువృత్తి ఏదైనను, ఎట్టిదైనను దానిని ప్రేమించువాతడే అందు వృద్ధి గనునని డికెన్సు పలికినాడు. కృష్ణస్వామి తనవృత్తిని హృదయపూర్వకముగ ప్రేమించినాడు. "Law is a jealous mistress" కదా! తనను కొద్దిమాపున దాచి, బహుళ వ్యాపకములపై కన్నువేయువాని నీవృత్తి తన వానిగా పరిగ్రహింపదు. కృష్ణస్వామి తనవృత్తిపై ఏకాగ్రదృష్టి పఱపినాడు. కావున నది ఈతని వలచినది. తమిళమును వ్రాయను చదువను యెఱుగకున్నను, తమిళ నేలను తన చెపలాగుకొనిన ప్రథమాంధ్రు డీతడే!

అల్లాడి కెదురు నిలిచి పోరగలుగు న్యాయవాదులు దక్షిణసీమయందు లేరు. అన్యరాష్ట్రములందైన నీతని కెనవచ్చువా రెందఱో లేరు.

కృష్ణస్వామి ప్రజ్ఞాధురంధరుడైన న్యాయవాదియే! ఇట్టి న్యాయవాదులు వసుంధరయందింకను కలరు. అల్లాడి నేడు ధనికుడే! ధనికులు ప్రపంచమం దెందఱో కలరు. న్యాయవాదు లందఱును, ధనికులందఱును మహాపురుషులు కారు. వీరియందు మహాపురుషుల సంఖ్య అల్పమైనది. వాదనా కౌశలముగాని, ధనరాసులుగాని ఎవ్వనికిని అమరత్వమును ప్రసాదింపవు. కృష్ణస్వామియందు మహాపురుష లక్షణములు లేనియెడల నీతని దెస కన్నెత్తియుండను. రూకల బస్తాలనుచూచి మనుష్యశక్తిని విలువగట్టుట నా ప్రకృతికి విరుద్ధము,

ఇచ్ఛాశక్తి, దృఢనిశ్చయములు కృష్ణస్వామి సొమ్ములని తెలిపియుంటిని. ఈశక్తులు కలవ్యక్తి సముద్రమధ్యమందు జారవిడువబడినను, బుడుంగున దుర్మరణమందు మునుంగక అపూర్వపృథ్విని సృష్టించుకొనగలడు. తీక్ష్ణమేధస్సునకు సంబంధించిన ఏవృత్తియందు అడుగుపెట్టియున్నను, కృష్ణస్వామి ప్రథమ స్థానమున నిలిచి విజయకేతన మెత్తియుండును. దృఢనిశ్చయ, ఇచ్ఛాశక్తులే కావు, పల్వుర కీతని జీవనమును మేలుబంతి జేయజాలు గొప్పగొనము లెన్నో ఈతని చరిత్రయందు తళుక్కులీనుచున్నవి. ఈ తళుక్కులే ఈతని చిరకీర్తి చంద్రికలు కాగలవు.

నిమ్నతలమునుండి చరచర లేచి ఉన్నతి నందిన పల్వురు తమ తొంటిస్థితిని మఱతురు. కండకు రోడు ఎంతయో కావరమును పెంచుకొందురు. నికృష్టులను చూచి అసహ్యించుకొందురు. దీనులను చూచి మండిపడెదరు వీరికిని, వీరి యాత్మకును కాలక్రమమున చిదానందమును ధారవోయునది నేడు వీరు కౌగిలించుకొను శృంగారము కాక వెనుక తమ్మును పొత్తిళ్లందు పెంచినస్థితియే యని వీరు గుర్తింపరు. అల్లాడి ఈవర్గములోనివాడు కాడు. దీనులను చూచినపుడును, దిక్కులేనివారిని గాంచినపుడును ఈతని మనసు కరగును.

ఈతనితండ్రి ఏకాంబరశాస్త్రి సంస్కృతాంధ్రములం దాఱితేఱినమనీషి. పండితప్రపంచమందు అనర్ఘప్రతిభ నందిన వేదంవారును, చదలవాడవారును, పురాణంవారును ఈతనివర్గములోనివారు. ఈతనికుటుంబీకులును, జ్ఞాతులును సనాతనధర్మము నారాధించి, అందలి పదార్థములను తమసొమ్ముగా గావించుకొనిరి. ఆంగ్లవిద్యాధికుడైనను, అల్లాడి తనవంశసంప్రదాయమునుండి విడివడలేదు. ఇతడు వేదభాష నెఱుగడు. ఈతని యైశ్వర్య మీతని కట్టిమోస్తరు చేయలేదు. ఇట్టియైశ్వర్యముగల మఱొకవ్యక్తి, యిట్టిపదవినందిన మఱొకమానిసి ఆంగ్లేయులకు కూడ సిగ్గుపుట్టించు వేషమును ధరించియుండును. ఒడలునిండ బంగారు రిస్టువాచీలు తాపటము చేసికొని యుందురు! పట్టిపోకిళ్లయందు నెలికిలపడియుందురు! మాటలను విఱిచి, శబ్దములను నమలి అపూర్వభాషను సృష్టించుకొని యుందురు! నొసలునుండి కన్నుల నూడనెత్తి, మూడపట్టున మాటి, అనవరతము ఊర్ధ్వదిశయందే మిడిగ్రుడ్లను త్రిప్పుకొని యుందురు! వింతరీతినడకల నభ్యసించి యుందురు! అల్లాడియం దావంతయైన నాడంబరములేదు. ఇప్పగించినచో, ఇత డనవరతము పట్టుపుట్టములను, ముఖమలు వలువలను దాల్చియుండును. కాని, యితడు దాల్చునవి సామాన్యాంబరములే. ఇతడు పామరులను, పేదలను ప్రేమించును. వీరి సుఖదుఃఖములను తనవి కావించుకొనును. కావున వీరికి సన్నిహితుడై, వీరియందొక్కరునివలె గోచరించును. దక్షిణసీమన్యాయవాదులందు తలమానిక మగుటచే, తఱచుగ నీతనికిని రాజులకును, మహారాజులకును సంబంధము కలుగుచుండును. ఇతడు రాజువలెగాని, మహారాజువలెగాని తయారు కాడు. నిరాడంబరజీవనమున నీతనికిని, అషుతోషు ముఖర్జీకిని ఎంతేని పోలికయున్నది. ముఖర్జీ స్వాతంత్ర్యకామి. కర్జన్‌లిట్టనులపోలు ప్రభువులతో జంకుగొంకులు లేక బదులుచెప్పువాడు. రాజప్రతినిధిఆసనం బె తల్లిమువల తనకధికమని కర్జన్ ప్రభువు రాజప్రతినిధియై యున్నపు డాతనితో గొంతెత్తిపలికినాడు. "Freedom first, Freedom second, Freedom always" అని యూనివర్సిటీచాన్సలరు, లిట్టన్ ప్రభువును ప్రక్కనిడికొని బెబ్బులియట్లు గర్జించి కలకత్తా సెనేట్‌హాలును ప్రతిధ్వనింపజేసినాడు. దొరలతో మసలునపుడైనను, ప్రభువులందు నిలిచినపుడైనను, ఇతడు తనవంగవేషమును మార్చుకొనలేదు. తన దైనికాచారములందున, * తినదుస్తులందునుకూడ అషుతోషు మహా

* ఉదయస్నానమునకు ముందు వంగీయులు శరీరమునిండా దట్టముగ ఆవనూనె పట్టించుకొందురు. అషుతోషు స్థూలకాయము గలవాడు. ఏనుగవలె నుండువాడు. ఈతని శరీరమునుండి పెద్దపెద్దకండలు వ్రేలాడునవి. ఉదయమున నంగవస్త్రము గట్టుకొని ఒడలును ఆవనూనెయందు ముంచివేయువాడు. ఆ సమయమున

ద్భుతప్రజ్ఞాధురంధరుడై, సమకాలికులం దద్వితీయు డనిపించుకొనిన ఆషుతోషు తన స్వాతంత్ర్యభావమును నిలుపుకొనినాడు. వస్త్రధారణమందును, భోజనాదు లందును కృష్ణస్వామి వెనుకటికృష్ణస్వామియై వరలు చున్నాడని ఆతనిజీవనవిధానముపై కన్నుంచినవా రెఱుగుదురు.

విద్యాధికు లందును, ఐశ్వర్యవంతు లందును కృష్ణస్వామినిపోలు వినయశీలురు మిగుల తక్కువగ నుందురు. వినయగుణము సద్గుణము లన్నిటికిని తల్లి వంటిది. పుండరీకహృదయము నాశ్రయించిన రేకల వలె నీగొనముచుట్టు సుందరసురభిళగుణము లెన్నో పెంపొందును. కావుననే మతాచార్యు లందఱు దీని గొప్పందనము నుగ్గడించిరి ("Blessed are the meek; for they sha!l inherit the earth" Jesus. Vide: St. Matthew chapter 5; Verse 5) అర్వాచీనవిద్యాధికులందు పల్వురీగుణమును కుత్తుకపట్టి నులిమివేసిరి. కడుపులోని పరుగు నిండుచున్న రేమైనను, మొగముపై గిల్లుపూతపూసి పెక్కువేషములు వేయువారిసంఖ్యయే నేఁ డధికము. చిత్రమేమన, నిట్టి వారే నేఁడు గెలుపుసిడె మెత్తుచున్నారు. కారణము? వీరు వంచనమున మేలుచేతురై ఒరులమోములం దపకీలగ బుక్కాకొట్టగలుగుటే! మోహనాంగియైన అసత్యము కావున, మోసము తనగోతిని తానే త్రవ్వుకొనును. కపటమునుకాక కారుణ్యమునే యొజిగిన అహ్లాదివర్తనము పల్వురకు ఒరవడి కాఁజాలునది.

అంతరిక్షమందు మసలక మన్నునందు నిలిచియే జనసామాన్యమందు తలలోనాల్కయై యీతఁడు మెలఁగును. "నిమ్నజాతుల" వారిని, హరిజనులను గలిసికొనునపుడు, వారిని తేటతెలుగున సంబోధించుచు వారి కాదరానురాగములు చూపుచుండును. తన జ్ఞానియగుల కీతఁడు దురూహ్యుఁడును, మూర్ఖుడునై యుండఁడు. 'గర్వము'నుశబ్దమున కీతని నిఘంటువున తావు లేదు. తనలోపము లేమున్నను, తనయిబ్బంది లేమున్నను మఱుగుపఱుపక ఈతఁడు చెప్పుకొనును. లోపములు లేనిమానవుఁ డెవ్వఁడును లేఁడు. ఇట్లని కృష్ణభగవానుడే తెలిపినాడు. తమలోపములను తాము సవరింపక, ఒరులను వెక్కిరించువారు కలరు! లోపల నరక జ్వాలలను రవులుకొలుపుచు, మోమున చిరునవ్వును తెచ్చికొనుచు దుష్క్రియలకు చేయిజేసికొనువా రెందఱో నేఁడున్నారు. అధునాతన విద్యాధికులందు వీరిసంఖ్య మెండు. లోపము దొంగవంటిది. తనలోపమును తాను సవరించువ్యక్తి తన యంతిలి చోరుని సవరించినవాఁడగును. కంటబడినదొంగ కాలుకొలది పరుగిడఁడా? తన మనసుపై కన్నువేసి యుండువాడే, తన హృదయమును కనిపెట్టిచూచువాడే సుభ్రాత్ముఁ డగును. ఒరులలోపములను పరిపూర్ణుడైన జగదీశునివలెగాక, పరిపూర్ణత్వమునకు చాలదూరమందున్న వ్యక్తివలెనే పరికించి, తన లోపములను క్షమింపని వ్యక్తియే మహాత్ముఁ డగును. ఎదుటివాని దోసగులనుకాక ఆతని సుగుణములను పరికింప నాతురపడువాఁడు మహాత్ముఁడు. ఎదుట ప్రజ్ఞను చూచి, ఒకకంట దుమ్మును, రెండవకంట గారమును కొట్టుకొనువాఁడు పాపాత్ముఁడు. ప్రజ్ఞపై పూలుచెండు వేయు మహనీయుఁడు కృష్ణస్వామి! ప్రతిభకు అంజలి ఘటించు మహాపురుషుఁడు కృష్ణస్వామి!!

ఒకవ్యక్తివర్తనమును ఆతని తలపులను బట్టియు, మాటలనుబట్టియు, చేతలనుబట్టియు కనుగొందుము కదా! తలపులును, మాటలును, చేతలును వ్యక్తిమానసప్రేరణము ననుసరించియుండును. కళోపాసకుఁ డెన్నఁడును సౌందర్యమాధుర్యములమీదనే మనసు నిలుపునట్లు, సద్వర్తనుఁ డెన్నఁడును సద్గుణములమీదనే దృష్టి నిలుపును. భక్తుఁ డెన్నఁడును పాపముపొంతపోక పరంజ్యోతిమీదనే కన్ను నిలుపును. సదాశయారాధనము సహృదయునకే సాధ్యము. దురితమునకు చేతులు మొగుచుట దుష్టునకే సాధ్యము. పూజ పుణ్యచరిత్రునకే సాధ్యము. దూషణము దుర్మతికే సాధ్యము. వ్రతము

ప్రభువులును, దొరలును తన్ను దర్శింపవచ్చుచో, ఆవేషముతోడనే వారిమ్రోల ప్రత్యక్షమగుచుండువాఁడు. మహాశయులు వచ్చినారని చీర సింగారించుకొనువాఁడు కాఁడు.

శుభ్రాత్మునకే సాధ్యము. పగ పాపాత్మునకు సాధ్యము. తన కోరికలు ఎగ్గునే కావించి రనుకొనును. ఈయెగ్గుపైతన క్రోధమును సానపెట్టి దానిచే వారిని నరుకజూచువాడు తనయందలి పిశాచమునకు సంతసమునే కొలుపును గాని తనయందలి దైవము కనులనుండి అవిరళాశ్రుధారలను వెడలించును. క్రోధమును కత్తితో కాదు, అగ్నికిని, మురికి గుంటకును పోల్చవచ్చును. అగ్ని తన్ను తాను కాల్చుకొనియే ఒరులను కాల్చును. మనసునే క్రోధమునకు తావొసగువాడు తొలుత తన మనసునే తగులబెట్టుకొనును. క్రోధమును నిలుపుకొనువాడు మనసును మురికిగుంటజేసికొనును. అందెన్నియో పురుగులు పుట్టును. క్రోధస్వభావుని జీవితము దుర్గంధమయమై క్రిమిబంధురమై యుండును. కలిగిన ఎగ్గును చంపునది దానియెడల జూపబడు నిర్లక్ష్యభావమే! ఎగ్గును రక్షించుట ఎగ్గును గౌరవించుట. విషోరగమును లాలించి, పాలించి, ముద్దుసేసికొనువాడు పాముకాటునకు ప్రాణము లప్పగించును. ఎగ్గుమీదనే మనసు నిలుపువాడు దానికి వశమై దాని చేతులందు చచ్చును. పగయును, ఎగ్గును, క్రోధమును ఎదుటివానికి చేటు తేజాలునో తేజాలవో కాని, తాము తలసూపిన హృదయమునకు నుపంతమైన చెఱుపు చేయుట తథ్యము. కావున నాత్మసంరక్షణమునకు పైనను మానవుడు దురాగ్రహమును చంపుకొనవలెను. దుశ్చరిత్ర ఆత్మనాశనమునకు కారణమగునట్లు సద్భావమును, అనురాగమును ఒరులకు మేలుగూర్చుచుండుటె ఆత్మానందమునకు హేతువులగును. ఒరులను మోదించి సంతసించువాడే ఆత్మసంతుష్టి నందును; ఆత్మ హృదయమం దమృత వర్షము నందును; ఆత్మవృద్ధి నందును. అల్లాడి వర్తనమును పుంఖానుపుంఖముగ పరిశీలించువారీతనియం దీచక్కనిగుణమును కనుగొందురు. ఇతడు తన మనస్సున క్రోధభావమునుకాక కృతజ్ఞతాభావమును, సుహృద్భావమును పెంపొందించును. కష్టసమయమున తనకు మేలుగూర్చినవారిని దలచికొని, వారికి తన తానందిన అభ్యుదయ మిట్టిదని తెలిపి వారి పవిత్రస్మృతికి భక్తిపుష్పాంజలి సమర్పించును. కష్టములం దూగాడువారికి అవసర మాల్యము సప్పన మొనరించును. ప్రశంసార్హమైన గొనముల నీతడు నిముసములో కనుగొని పరమానందభరితుడగును. ఈగుణము లేజాతివ్యక్తియందు దోచినను, వీనిపై పూలుచల్లి, ఆవ్యక్తికి బహుభంగుల జేదోడగును. గురుగుణముల నుపాసించునది గురుగుణమే కదా! చల్లని తలపులు వెడలుట పూలసెజ్జపోలు ఎడందనుండియే కదా! సౌరభసౌందర్యములు పుష్పహృదయమందే పెంపొందునట్లు కారుణ్యప్రశంసలు సహృదయమందే పెంపారును.

ఈనుడువునకు కృష్ణస్వామి జీవనమున నెన్నేని తార్కాణములు కనుగొనగలము. జాతిమతభేదములను పాటింపక ఈతడు పలువురకు సాహాయ్యము సలిపినాడు. మతిమంతుల నీతడు నిముసములో గుర్తింపగలడు. ఈతని తోడ్పాటు నంది పలువు రింగ్లాండున కరిగి (యిట్లని తెలుపుటకు నేడు వీరి మనసొప్పదు) ఐ. సి. ఎస్. పరీక్షయందు త్తీర్ణులై నేడున్నత పదవుల నలంకరించి యుండిరి. ఈతని తోడ్పాటునందిన విద్యార్థులెందరో కలరు. అధునాతన రాజకీయసాంఘిక మతోద్యమములను పరికించితిమేని, కృష్ణస్వామి కావించిన సాహాయ్యము స్పష్టమైతోచును. తిలక్ స్వరాజ్య ఫండునకు మూడువేల రూకలను, లజపతిరాయ్‌నిధికి రెండువేల రూకలను ఈతడొసగినాడు. కస్తూరి విద్యాలయమునకును, "నిమ్నజాతి" సముద్ధరణమునకును ఇతడు చాల ధనమొసగినాడు. బందరు జాతీయ కళాశాలకును హనుమంతరాయ నిధికిని తోడ్పడినాడు. తల్లాప్రగడ సంఘులు కోరినంతన, కొవ్వూరు సంస్కృత కళాశాలకు ధనసాహాయ్యము సలిపినాడు. పలువురు సంస్కృత పండితులకు నోసిళ్లతో రూక లిచ్చినాడు. మదరాసు "రామకృష్ణ విద్యార్థి గృహ" నిర్మాణమునకును, పోషణమునకును విశేష సాహాయ్యమును సలుపుటయే కాక, ఈ సంస్థయందొక పారిశ్రామికశాఖను నెలకొలుపుటకు పదివేల రూకల నొసగినాడు. ప్రజాభ్యుదయమునకై యేర్పడిన ప్రతి సంస్థను కృష్ణస్వామి సువర్ణదానము చేసితీరినాడు. అన్నమలై విశ్వవిద్యాలయమునకు పైకము వోసినాడు. అంతర్జాతీయ శాసనమును గుఱించిన ఉపన్యాసముల నిప్పించుటకై మదరాసు

విశ్వవిద్యాలయమునకు ధనసాహాయ్యము సలిపినాడు. యశస్తిలకుడు రాధాకృష్ణుడు ఆంధ్ర విశ్వకళాపరిషత్తు కొఱకై గిన్నె నొగ్గినపుడు సాలునకు వేయి రూకల చొప్పున నందు విరాళము వోయుచు, నట్లు పదేండ్లు కావించుదునని కృష్ణస్వామి మాటయిచ్చినాడు. అల్లాడి విరాళమును చేయూత జేసికొని రాధాకృష్ణుడు విశ్వకవి రవీంద్రుని గతవత్సరము తన విశ్వకళాపరిషత్తున కాహ్వానించినాడు. రాధాకృష్ణునెడల రవీంద్రున కవ్యాజవాత్సల్యము కలదు. కావున నాతనివేడికోలును మన్నించి "మానవుడు"ను పత్రికను నిమిత్తము జేసికొని కవిత్వ తత్త్వశాస్త్రములను గురించి గంభీరోపన్యాసముల నొసగినాడు. హైదరాబాదురాష్ట్రమున గొండొక పెద్దకేసువందు పనిచేసి, కృష్ణస్వామిప్రజ్ఞ నంగుస్తుతించిన తేజబహదూర్ సప్రూ, అతని పేరట నాంధ్రవిశ్వకళాపరిషత్తున స్థాపింపబడిన గద్దెనుండి యీవత్సర ముపన్యాసము లొసగును. వెంకటగిరి కళాశాల మున్నగు సంస్థలకు కృష్ణస్వామి విద్యార్థివేతనము (Scholarships) లిచ్చినాడు. విద్యార్థులమీది ప్రీతి పెంపున వారి యాటపాటలను పరిశీలించును ప్రవీణులకీతడు బహుమానముల (E. G. Kellet Cup) నొసగుచుండును. వంగసీమయందు రాష్‌బిహారీఘోష్ పాలిట్ లు కలకత్తా విశ్వవిద్యాలయమునకును, తమ పల్లెంవలి సంస్థలకును విశేషధనసాహాయ్యము చేసినారు. దక్షిణసీమయందు న్యాయవాదులలో నీయుదారగుణమును చూపగలిగిన వ్యక్తి కృష్ణస్వామియే. ఈతని దృష్టాంతము పలువుర కనుకరణీయము.

ధనము కొంతేక సుకృతోద్దేశమునకు నిమిత్తమాత్రమని ప్రాచీనులు గుర్తించిరి. ధనమును కులదేవత జేసికొనువాడందుండి ఒకకాసైన దీసి సద్వినియోగము గావింపలేడు. రంగారుబంగారునుండి వెడలు తళుక్కులు కృపణునకు నేత్రపర్వము గావింపవచ్చును కాని యీ తళుక్కులు ముముక్షువుకనులకు విందుకొలుపు విశ్వరూపమును చూపజాలవు. తనకు గలదానిని ఒరులకై వినియోగించువాడతడు ధన్యుడు. ఈతని యీపి ఈతని మనసున నానందకల్లోలిని నుప్పొంగించు నని మనీషు లందురు. * విశేషవిభూతినందు కృష్ణస్వామి ప్రజాభ్యుదయమునకై దానిని వెచ్చించుచుండుట సంతోషకరము. మానవకల్యాణమునకై తన జీవితమును వినియోగింప గాంక్షించువారిలో నీత డొకడు. ఈ యాశయసిద్ధికీతని కన్నెనితరగుణములు చిక్కెను. జగదీశుని ఆనబడయువ్యక్తి ఎన్నడును మిన్నకొనియుండజాలడు. తన గభీరోద్దేశమును పూర్ణమొనరించుకొను విధానముల నీతడు రోయుచుండును; "నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్" అని తన ముహూర్తమున తనకు కారణమాత్రుడు కాజాలువాని నెన్నుకొనును. అత్తటి విషాదయోగము నభినయించుచు, కర్తవ్యమును కాలితో తన్ని కాళ్లుముడుచుకొను టెవ్వరికిని సాధ్యము కాదు. "The future is in the lap of gods" అని కృష్ణస్వామి పలుకుచుండును. ఈవాక్కు భావబంధురమైనది. కృష్ణస్వామి ఉత్తమాశయముల నారాధించువాడు కావున నీతని భావికాల మెట్లుండునో జోస్యము చెప్పజాలుదుము.

ఆంధ్రజాతియెడల నీతనికి మిక్కిలి మక్కువ కలదు. "నే నాంధ్రుడ" నని సగర్వమున నీతడు ఆంధ్రవిశ్వవిద్యాలయ స్నాతక మహోత్సవ సమయమున బలికినాడు. ఆంధ్రునకు కళోపాసనమునకు వలయు ప్రజ్ఞాప్రతిభలు కలవని గుర్తించి యీ యద్భుతశక్తుల నీతడు విశేషముగ వృద్ధిగావింపవలెనని అల్లాడి అభిలషించుచుండును. † మనుష్య జీవనముపై మణిముకుటము నిలుపునవి ఉత్తమాశయములని యెఱిగియే వీని

* "We find that in giving is our truest joy and liberati n, fcr it is uniting cur selves to that extent with the infinite "Rabindranath Tagore (Vide: Sadhana, page 153).

† The fine arts have peculiar attraction for Andhra genius. The aesthetic sense and the love of the beautiful is a strong point of Andhra nature and character. The emotional idealism of the Andhra, "the spontaneity of his nature, his refined

నీతడు భావిభారత నేతలగు యువకుల కుద్బోధించును. ప్రాచీన భారతసీమయందు పూజనందినది ధనము కాక పాండిత్యమని తన కనుభాయోపన్యాసములందు డాక్టరు అనిబిసెంటు తెలిపెను. భారతసీమయందు పూజలందునాతడు సింహాసనములనెక్కి యేలెడు నైశ్వర్యవంతుడు కాక కౌపీనధారియైన సన్యాసి యని వివేకానందస్వామి అమెరికాలో వాకొనెను. కృష్ణస్వామి వీరి భావములతో నేకీభవించు మనీషి. *. ప్రాచీన భారత మహత్వము గ్రుప్పపట్టి నేల గాలునది కాదనియు, కాలవిహాయసమున నస్తమయమెఱుగని అమృత సూర్యుడట్లది తేజరిల్లి నేటి యువకుల హృదయములం పవిత్రభావసుధాధారలను ప్రోయజాలునదనియు, యువజనులు తమ యాత్మలతో నా యమృతమును గ్రోలి అమృతజీవులు కావలెననియు నీతని యాశయము.†

కృష్ణస్వామికి ప్రజాపాలనమందు ప్రీతి యధికమని ఈతని యుపన్యాసములను వినినవా రెఱుగుదురు. రాజకీయములందు లంఘింపకున్నను, దేశస్వాతంత్ర్యము నభిలషించుచు, దేశసేవామంత్రమును యువజనుల కుపదేశించుచు, మహాత్ములైన దేశనాయకులపై నీతడు పూలుచల్లును.‡ దేశాభ్యుదయమునకై వీరిపేరులతో తల నూపిన నిధులం దీతడు దోసిళ్లతో ధనము పోయలేదా? సామరికవాతావరణముతో నిండిన అర్వాచీన పృథ్వికి శాంతిపాఠమును, సంఘభావమహత్త్వమును ప్రబోధింపజాలునది భారతమాతయనియు, మానవాభ్యుదయమునకు తోడ్పడు నూతననాగరకతా నిర్మాణమున భారతీయుల కర్తవ్యములు బహుళములని యీతని యుద్దేశము. (“By her culture, by the bright and radiant humanism which breathes through it, the synthesis which she has successfully attempted from time to time among conflicting races and civilizations in the past, India is fitted to deliver a message of universal peace and love to the war-weary nations of the Western world trying

---

intellectuality and a certain love of ease and leisure find a natural expression in the cultivation of the fine arts...In the development of your University every facility ought to be afforded for the full and natural expression of Andhra genius and culture so that the University may find its own soul.”

* “The Indian Society and the Indian University must be permeated by the spirit of Ancient India which made a person bow in reverential awe to the learned and accord a pre-eminent place to the learned man and not to the plutocrat or the territial magnate.”

† “The University cannot too strongly impress upon its alumni the ideal of Brahmacharya renunciation and the grand simplicity of life which marked the Student of Ancient India, the ideal which bears a striking similarity to the sentiments underlying the oftquoted words of Lord Elden. ‘Live like a hermit and work like a hore.’”

‡ “You must make a point of giving of your best to the service of your country and be able to help the development of a higher type of society and you must be inspired by the lofty ideal of leaving the world at the end of your careers richer and better than you found it...Do not develop on elastic conscience one rule of conduct for public life and another for private life. Your country requires of you all that is best in you Do not leave behind within the walls of the University the idealism of youth.” Vide : Sir Krishnaswamy's Address delivered at the Fourth Convocation of the Andhra University, 1930.

to extricate themselves from the cult of intransigent nationalism, and national domination In the revivalistic pericd, if only her youth are inspired by the same love of disinterested learning as in Ancient India she will also make her great contributions to scientific knowledge and progress." Sir A. Krishnaswamy).

మనుజునకు తరముకాని దద్దియును లేదు. మనుష్యయత్నము నింగిచుక్కలను మల్లెపూవులట్లు గ్రుచ్చగలదు! రత్నాకరమందలి రతనములనుదీసి గగనతలమున నెఱజల్లి అపూర్వతారకలను సృష్టింపగలదు! దృఢయత్నమే మహాతపస్సు. హిమగిరులుకూడ నొకప్పుడు సముద్రమందు దాగియుండెనట! నింగినుద్దేశించి అవి యెంతెని తపస్సాచరించియుండును. కావుననే, నేడవి మేఘడింభకములను చంకనిడికొని వివిధరాగరంజితవిహాయసగండభాగమును చుంబించుచున్నవి! ప్రార్థనశక్తి అద్భుతమైనదని టెన్నిసన్ మహాకవి పలికినాడు ("For more things are wrought by prayer than this world dreams of" Idylls of the King) తపశ్శక్తి యెట్టిదో యూహింపుడు.

మనుష్యశక్తులన్నియు తపస్సునందు కేంద్రీకరింపబడును. ఈశక్తులు మానవునినొసలున విభూతిరేఖలై చూపట్టవు. అతనియంగప్రత్యంగములందు కండకండలై కానుపింపవు. అతనియంతరంగము వీనికావాసము. మనుష్యాంతరంగ మనంతమైనది. తపసుకతన నీయనంతఅంతరంగ విశ్వమందలిశక్తులు, పూర్వదిశయందు ప్రభవిల్లుప్రభాతప్రభాకరమరీచికలట్లు మానవజీవననభమున కాంతిలును! శైశవమునుండి కృష్ణస్వామి తపస్వియైయుండెను. నాటి పేదబాలుని నేటిపెద్దజేసినది తపసుకాదా? ఇతడు యాత్రికుడంటినికదా! యాత్రికుడే తపసి! ఇతడు పెక్కుయిక్కట్టులను నెట్టివేసి, కొన్నిమజిలీలను చేరుకొనినాడు. ఈతనియాత్ర యింకనుసాగుచునేయున్నది. ఈతనితపస్సింకను ముగియలేదు. ఏండ్లుకడచుకొలది ఈతనిప్రజ్ఞ సమధికతేజమంది, ఈతనిజీవనమును ప్రభాకలిత మొనరించి, సాధనముసాత్త్వ మిట్టిదని యువకలోకమునకు వెల్లడింపగలదని నాయాశ.

భారతసీమ కింకను కృష్ణస్వామిసేవ అవసరమై యున్నది. రానురాను ఈతడు దీనబంధువనిపించుకొనునేమో! కవచకుండలము లెఱుగనికర్ణుడనిపించుకొనునేమో!! మహాత్యాగియైన భాగతపుత్రుడనిపించు .!!! సాధకున కసాధ్య మేది?



ప్రయాగ కోదండరామశాస్త్రి

౧

ప్రాయము ద్రావిపోయి ముదివడ్డ వికారపు జూపుకోపులం
దీయఖిలాండజాలము ననేకపవిత్రవిచిత్రచిత్ర వ
ర్ణాయతశోభితంబుగ నొనర్చుచు జూపఁబలోతుగుండియల్
దీయదలంపులన్ సినిచె దేజవిరాజిల భాను డింతయున్.

౨

"చూడుడు, చూడు డీప్రకృతి సోయగమంతయు నాదుచూడ్కులన్
వాడక క్రొత్తయందము నవారిగ జూపెడి, సత్కవీశ్వరుల్
పాడఁగ గైతలల్లి, పొలుపారెడి; నాకనుమూసినంత నే,
వేడెద, నొక్కసారి కనువిచ్చి కనుంగొను డెట్టులుండునో!"

౩

అం చలవృద్ధవృద్ధతపనారుణమూర్తి వచించునేమొ! వి
న్పించు ద్విజాలపంబులను, నేడి వెలుంగని తన్ గణించి నిం
దించెడు వారికిన్—పలుకదీరదు, చూచియుచూడగావలెన్
మించు [illegible]రంగురంగుల సమేళనఁగన్ దనియించు దృశ్యమున్.

౪

ఒకచో నెత్తురుపాయ, లింకనొకచో నొప్పారు స్వచ్ఛోపల
ప్రకట శ్రీకరవేదికల్, మఱొకచో భావింప నీలంపు నీ
టికెలంకుల్, మఱియొక్కటన్ దలప డిండీరంపుటీరంపు విం
తకలల్ భాసిలు సాంధ్యదర్శన మహానందంబు నంద్యం బెదన్.

౫

చూచినరంగు జూడకయ చూచెడినాక అగోచరంబులై
తోచకపోయెనెన్నొ, పయి దూరుపునుండి యెదో వెలుంగు నా
లోచన మార్గమందె యవిలోక్యమయై చనె;—నీలిమబ్బులన్
వీచెడి చల్లగాలియును నెమ్మదినమ్మద మందజేయగన్.

---

౧

ఉదయం తొమ్మిదిగంటల సుమారుకి పూనానుంచి బయలుదేరి లోనావాలాలో కొన్ని నిమిషాలు తప్ప యెక్కడా ఆగకుండా పదకొండింటికల్లా బొంబాయిచేరే రైలుబండి పేరు 'డెక్కన్ క్వీన్'. దీనికి మొదటి రెండు తరగతులే తగిలిస్తారు కాబట్టి ప్రయాణంచేసేవాళ్లు సామాన్యంగా వున్నవాళ్లు. కాని యింటిదగ్గిరనుంచి డబ్బు తెప్పించుకొని చెయ్యివిడిచి ఖర్చుచేసే విద్యార్థులు కూడా దీంట్లో ప్రయాణిస్తారు. దీంట్లో ప్రయాణించాలని బొంబాయిలో పనిపెట్టుకుంటారు. ఆ ప్రాంతాన్ని చూడాలని బయలుదేరిన కవి శంకరంకూడా దాంట్లోనే ప్రయాణిస్తోన్నాడు.

శంకరం ముందుసీట్లో ఒక పెద్దమనిషి కూచున్నాడు. ఆయనపక్కనే కేసరివర్ణంశాలువ ముసుగు పెట్టుకొని వొకారు నిద్రపోతోన్నారు. ఆ కంటి అద్దాలు, బుర్ర మీసాలు, గాంధీటోపి మన జాతి చిహ్నాలు కాకపోయినా వొక్క చూపుతో ఆయన ఆంధ్రుడని తెలుసుకున్నాడు శంకరం. మాట్లాడిద్దామనుకున్నాడు కూడా. కాని ఆయన గంభీరత్వం చూసి వూరుకున్నాడు

వొకగంటసేపు బండి నడవటంతోటే ఆ ముసుగులోంచి వొకామె గభ్రున లేచి శంకరంమీదినుంచి దొర్లుకుంటూ కిటికీనందుకొని వాంతిచేసుకుంది బైటికి. ఆ ముసలాయన ఆమెను పట్టుకున్నాడు. వాంతి అయినాక నీళ్లు అందించాడు. మెడవాలేసి నుంచోటానిగ్గూడా శక్తిలేని ఆమెని పట్టుకొని వెనక్కి వొరిగించి కూచోపెట్టాడు. ముఖంమీదికి వొచ్చిన వెంట్రుకల్ని వెనక్కి దిద్ది ఆమెబాధతో నాకేటిసంబంధం అన్నట్టు మళ్లీ పత్రిక తెరిచాడు. శక్తిలేక కళ్లు మూసుకుందామె. ఆమె చీరకట్టు, కళను వొలికించే ఆ ముఖం చూట్టంతోటే మనవాళ్లు మళ్లీ కనబడ్డారు కదా. అని లేచికూచుంది ప్రాణం. సన్నని తీగలాంటి ఆమె దేహాకృతి, కోలముఖం, విశాలమయిన నొసలు, గులాబిమేనుఛాయ, మసక చీకటిగావున్న ఆ పెద్దపెద్దరెప్పలు, చేతకాక కొంచెంగా విడిపోయిన ఆసన్నని పెదిమలు, మోటుకాని అవయవాలు శంకరం హృదయాన్ని కొట్టుకునేట్టు చేశాయి. అంతటి కోమల విగ్రహాన్ని వూహించుకోటమే కాని అత డెప్పుడూ చూళ్లేదు. ఏ మహారాజ భవనంలోనో పుట్టి పాంజ్ఞమీద మెదులుకునే దాసీల మధ్య పూలల్లో బతకాల్సిన ప్రాణి ఆమె. ఇందాకటిదాక చెంపకింద చెయ్యిపెట్టుకొని పడుకోవటంచేత నాలుగువేళ్లు చెంపమీద ముద్రవేశాయి. ఇట్లాంటామెని కన్నులపండువుగా చూసి ఆనందించటానికి బదులు యేడ్పొచ్చింది శంకరానికి. ఏమహల్లోనో పుట్టక యీ కుటుంబాల్లో యెందుకు పుట్టావమ్మా అనుకున్నాడు.

ఆ పెద్దమనిషి చదువుతో చదువుతో చప్పున జేబులోంచి వెస్టెండుగడియారం తీసి టైం చూసుకున్నాడు. పత్రిక మడతచేసి, వలసంచిలోంచి రెండు బత్తాయిపళ్లు తీసి వెండిగ్లాసుని శుభ్రంగా కడిగి దాంట్లో రసం పిండాడు. ఆమెదగ్గిరగా జరిగి, "అమ్మాయీ!"

నొసటిమీదినుంచి వెనక్కి చెయ్యిదువ్వుతో, "అమ్మాయీ!" అని కొంచెం గట్టిగా పిలిచాడు.

ఆమె సగంగా కళ్లుతెరిచింది.

"వేళయింది పళ్లరసం తాగమ్మా."

"తిప్పుతోంది, వొద్దు నాన్నా." మధురమైన సంగీతంతో అంది. ఆహారంలేకపోతే మరీ వొస్తేస్తుంది కాబట్టి తాగాలన్నాడాయన. అసహ్యపడుతుంటే కొంచెంకొంచెంగా తాగింది.

శంకరం వుండలేకపోయినాడు.

"ఏమిజబ్బండి అమ్మాయికి?"

ఆయన తల కిందికి వొంచి అద్దాలసందులోంచి శంకరాన్ని వోసారికిందు పాటించిచూసి,

"ఇక్కడినీళ్లు వొంటక పైత్యం."

మళ్లీ పేపరు అడ్డంపెట్టుకున్నాడు.

"ఏవూరండీ మనది?"

జేబులోంచి కార్డుతీసి యిచ్చాడు. "పద్మారావు రిటైర్డుపోలీసు ఇన్‌స్పెక్టర్" అని వుంది.

"ఏదైనా పనిమీద వెడ్తోన్నారా బొంబాయికి?"

విసుగ్గా అన్నట్టు పేపరు కిందికి వొంచి, "అవును పనిమీద" మళ్లీ చప్పున పైకి లేపాడు పేపరు. ఇంకా యెక్కువమాట్లాడిస్తే కోపగించుకుంటాడేమోనని వూరుకున్నాడు శంకరం.

చిమ్మచీకటిగా వున్న గుహల్లోంచి పరుగెత్తోంది రైలు. దీపాలు వెలిగించారు. పగలును రాత్రితో పోల్చిచూపుతోన్నట్టుంది. వోచోట రైలువెడ్తోన్న కొండకు కుడివేపు యెంతోలోతులో వున్న విశాల ప్రదేశం అవుపడ్తుంది. దాంట్లో అయిదారు చిన్నచిన్న పల్లెలు; వాటికి సంబంధించిన పొలాలు, అడవులు, అనుడిసెలున్న ప్రదేశంలోంచి మెలికలుతిరిగి పైకిలేస్తోన్న పొగలు అవుపడ్తోన్నాయి. వోచోట దగ్గిరగా అవుపడే పొలాల్లో పనిచేస్తో చీమల్లాగా అవుపడే మనుషుల్ని చూస్తోంటే చప్పున శంకరానికి గొల్లపల్లి రమణాచార్లు యిచ్చిన చూర్ణం జ్ఞాపకంవొచ్చింది. పెద్దమనిషి యింకా పత్రికచాటునే వున్నాడు.

"నాదగ్గిర వోచూర్ణముందండి. పైత్యానికి మంచిమందు. ఇచ్చిచూస్తారా?"

పత్రిక కిందికిదింపి విన్నాడు. శంకరంమాటలు విని ఆమె కళ్లువిప్పి అతనివేపు చూసింది. ఇద్దరివేపూ చూశాడు శంకరం. ఎవరూ మాట్లాల్లేదు. హ్యాండుబేగులోంచి చూర్ణంసీసా తీసి పెద్దమనిషి కందించాడు. ఆయన ఆమెకిష్టమేనా అనికూడా కనుక్కోకుండానే తామరకాడలాంటి ఆమెచేతులో చూర్ణం కాస్త పెట్టాడు. ఆమె నోట్లో వేసుకొని చప్పరిచ్చింది. పులుపుకి కనుబొమలు కాస్త పైకిలేపి శంకరంవేపు చూసింది. ఆపెద్దమనిషి సీసాకు కార్కుపెట్టి శంకరానికి అందించాడు కృతజ్ఞతఅయినా చెప్పకుండా శంకరంచేసిందంతా అతనివిధి అన్నట్టు.

బండి కల్యాణ్ దాటింతరువాత పద్మారావు మళ్లీ గడియారంచూసి లేచాడు. పైనుంచి బెత్తపుపెట్టె తీసి ఇద్దరికి భోజనం సిద్ధంచేశాడు. థర్మోసునుంచి గ్లాసులో పాలువొంపి కొంచెంగా సోడాకలిపి, "కుసుమం, వేళయింది పాలుతాగు"అని గ్లాసు అందించాడు. శంకరంవేపు చూసి ముందుకి జరగమని సౌంజ్ఞ చేశాడు.

"మీరు భోంచేయండి. నే నక్కడికి వెళ్లినాక. కానిస్తాను."

ఆయన వినిపించుకోలేదు. భోజనం ఆరంభించాడు. కుసుమం శంకరంవేపు చూసింది. ఆయొజ్జిని పెదిమలమీద నాలికని తిప్పుకొని, "మొహమాటపడకండి"అని నిస్త్రాణగా అంది.

శంకరం ముందుకి జరిగాడు.

పాలుతాగి గ్లాసు కిందపెట్టింది కుసుమం.

"ఇప్పు డెట్లావుంది కుసుమం?"

"తిప్పటం తక్కువుంది నాన్నా. కాని తలనొప్పి అట్లాగే వుంది."

"ఆకువేసుకొని కళ్లుమూసుకో నిద్రపో కాస్సేపు"

పైనుంచి ఆకులడబ్బా తీసి యిచ్చాడు. ఆమె మూడుబీడాలు మడిచి వొకటి తాను వేసుకుంది. తాంబూలం నముల్తోంటే ఆగొంతుక యెఱ్ఱబారింది.

"ఏవూరు నాన్న వీరిది?"

శంకరంవేపు చూసా డాయన.

"నాది కాకినాడండి. ఈప్రాంతం చూడాలని బైలుదేరాను. హరిశంకరం అంటారు."

పద్మారావు కుసుమంవేపు చూశాడు తెలిసిందా అన్నట్టు.

స్టేషన్లో దిగినతరువాత పల్కాం హోటల్కి వెళ్తామన్నారు. శంకరంకూడా ప్రత్యేకస్థలం యేదీ లేదు కాబట్టి వాళ్ల వెంబడే వెళ్లాడు. వాళ్లగదిపక్కనే గది దొరికింది.

మధ్యాహ్నం కాస్త నిద్రపోదామని మంచం మీద వొరగటంతోటే తలుపుతెరుచుకొని పద్మారావు వొచ్చాడు.

"నేను కాస్సేపు బైటవెళ్లివొస్తా అందాక నువ్వు కుసుమంగదిలో కూచోకూడదూ?"

"వెళ్ళండి కూచుంటాను."

ఆలోచనగా క్షణంసేపు శంకరంవేపు చూసి తిరిగి తలుపుదాకా వెళ్లాడు. మళ్లీ వెనక్కి తిరిగిచూశాడు. శంకరంవేపు వొచ్చి అతనిపక్కన మంచంలో కూచున్నాడు. జేబులోంచి సిగరెట్టుకేసు తీసి వొకటి తాను పెదిమెల్లో యిరికించుకొని కేసు శంకరానికి అందించాడు.

"శంకరం, నీతో వొకటి చెప్పాలి." కొంచెం ఆగి,

"నీకు తెలుసా మేం యిక్కడికి యెందుకు వొచ్చామో?"

"ఏదో పనుందన్నారుగా!"

"అవును, పని. కుసుమాన్ని భర్తదగ్గిర దిగబెట్టిపోవడానికి వొచ్చా. అతను........." పళ్లు బిగించి వొచ్చేమాటని దిగమింగి, "అత డంతమంచివాడుకాదు."

శంకరం మాట్లాళ్లేదు. వూరికే ఆయనముఖంలోకి చూశాడు.

"నీకు అర్థం కానట్టుంది. అవును, కాదు. కుసుమానికి మొండిపట్టుదలగా తల్లి చిన్నతనంలోనే పెళ్లిచేసింది. ఏడాదిలోనే చచ్చింది. అప్పట్నుంచి గారాబంగా కుసుమానికి యింటదగ్గర చదువుచెప్పించా. దానిరూపంమల్లే అభిరుచులుగూడా చాలా నాజూకు. చిత్రకళ, కవిత్వం అంటే ప్రాణం. దీనిమొగుడు చదువుసంధ్యలకు స్వస్తిచెప్పి దేశదిమ్మరి అయినాడు. వెతకంగా వెతకంగా యిక్కడ గిరుగాంలో వున్నాడని తెలిసింది. ఏదో గిర్నీలో వుద్యోగ మట."

చప్పున శంకరంముందు రెండు బొమ్మలు అవుపడ్డాయి. విద్యాగంధం లేక గిర్నీలో పొట్టపోసుకుంటోన్న మోటువాడిపక్కన లలితత్వానికి గని అయి మెత్తని పరుపుల్లో మెదలాల్సిన కుసుమం మురికిచాకిరి చేస్తోంది. కళ్లలో నీళ్లు గిర్రున తిరిగాయి. అతని ముఖాన్ని తదేకదృష్టితో చూస్తోన్న పద్మారావు బలవంతంగా ధైర్యం తెచ్చుకొని, "ఎంతయినా కుసుమం ఆడది. రేపు నేను పడిపోతే నీతి అని గొంతెత్తి అరిచే సంఘమే దాన్ని తొక్కుతుంది. తరువాత నలిగిపోయిందని నిందిస్తుంది."

"కాని సంఘంపేరిట యెందుకిట్లా హింసించటం? ఆమెదారిని ఆమె చూసుకోనీ."

"లేదు, నీకు తెలీదు. పురుషుడు లేక యేస్త్రీ కూడా బతకదు. తప్పించుకో తిరిగే స్త్రీని మొగ మహారాజే వెంటబడి సామ దాన భేద దండోపాయాల్తో లొంగదీస్తాడు. మళ్లీ దుర్మార్గురాలు, నీతిహీనురాలు అని నరకానికి తొక్కుతాడు మొగవాడే సంఘం కనుక."

చప్పునలేచి శంకరంవేపు చూడనైతం చూడకుండా తలుపుని ఫెడేలున కొట్టుకుంటూ వెళ్లిపోయినాడు పద్మారావు. వొక్కనిమిషం అట్లాగే తలుపు కేసి చూస్తూ కూచున్నాడు శంకరం.

కుసుమం తలని అపక్కతిప్పి చూసింది. శంకరాన్ని చూసి లేవాలని ప్రయత్నించింది. అతను ముందుకువచ్చి, "లేవకండి, లేవకండి. ఆయాస పడతారు." అంటూ మంచానికి దగ్గిరగా వున్న కుర్చీలో కూచున్నాడు.

"ఎట్లా వుంది తలనొప్పి యిప్పుడు?"

ఆమె మాట్లాట్టానికి నోరు తెరిచింది. కాని గొంతుపట్టుకున్నట్టు అయింది. మెత్తమీదినుంచి తల

యొత్తి గదినాలుగువేపులా చూసింది. లేవాలని ప్రయత్నం చేసింది.

"లేవకండి, యేంకావాలో చెప్తే నే నిస్తాను."

కుసుమం మాట్లాడకుండా లేచి కూచుంది.

"నీళ్లు కావాలా?"

లేచి గ్లాసులో నీళ్లు వొంపుకొని తెచ్చియిచ్చాడు. ఆమె కొంచెం కొంచెంగా తాగింది.

"క్షమించండి శ్రమకి."

మెల్లిగా మళ్లీ వొరిగింది. ఇంతటి అభిమానవతిని మళ్లీ ఆ మోటు మనిషిపక్కన వూహించుకున్నాడు శంకరం. పందికి పన్నీరు పోసినట్టు.

"మీరిచ్చిన చూర్ణం చాలా బావుందండి."

"మళ్లీ రాత్రికి వొహ తడవ వాడండి."

ప్రకృతి పలువిధాలు. ఏమిటో మాయ. కొందర్ని చూసేచూట్టంతోటే యెక్కడా లేని ఆకర్షణ కలుగుతుంది. ఆకర్షింపబడటమా పడక పోవటమా అంటూ మనచేతుల్లో వుండదు. నూదంటు రాతికి తిరగబడటం యినుముకు చేతకాదు. శంకరం తన యీమూ పైఁ యేళ్ల జీవితంలో యెన్నో దేశాలు తిరిగాడు. ఎందర్నో సుందరమైనవాళ్లని చూశాడు. కాని కుసుమాన్ని చూట్టంతోటే అతనిహృదయం మీద ముద్ర పడ్డది. వెయ్యేళ్ల పరిచయంలా గనిపించిం




"రెప్పవాల్చకుండా శంకరంవేపు చూ

దామె. ఆతెల్లనిపరుపులో సన్నగా వొంకతిరిగి పడుకున్న ఆమెశరీరం, మెత్తధగ్గిర ముందుకుజాపిన దంతంలాంటిచెయ్యి, మెత్తమీద కుప్పగా పడివున్న నక్కతోకరంగు ఆమెజుట్టు, అన్నీ తనవే అనిపించాయి

ఆమె మళ్లీ నలువేపులా చూసింది.

“ఆకుమడిచివ్వనా?”

కొంచెంగా నవ్వి, “కాస్త యిటు అందిస్తేచాలు ఆడబ్బా.”

డబ్బా ఆమె కందిస్తో “ఏమిటి నవ్వుతారు?”



ం ఆబొమ్మలకేసి చూస్తోన్నాడు.”

“మొగవాళ్లకి ఆకుమడవటం కూడా వొచ్చునా?”

శంకరం కూడా నవ్వాడు.

“అయినా నా మడవటం మొగవాళ్ల మడవటం లాగే వుంటుంది.”

ఆసన్నని పొడుగాటివేళ్లతో ఆపంపుటాకుల కాడలు తీసేస్తున్నం రాస్తోం ది. ఆతలగడదగ్గిర వున్న పుస్తకంమీద పడ్డది శంకరం దృష్టి. ముందుకి జరిగి దాన్ని అందుకొని ముఖపుట చూశాడు. దిగ్భ్రమ చెందాడు. కాముపెడ్తోన్న కుసుమంవేపు చూశాడు.

“మీదే అండి యీపుస్తకం?”

“ఏం? నాదే. చదివారామీరిది?”

మరీ ఆశ్చర్యం వొచ్చింది శంకరంముఖంలోకి.

"దీనితరువాతిది 'రెండునీలాలు' చదివారా మీరు?"

"చదివా. అబ్బ! అది దీనికన్నా బాగుంది. దాంట్లోని ఆరెండుగీతాలకి రెండుచిత్రాలు గాశాను రెండురెళ్లు నాతెలిసినంతా వుపయోగించి." ఆ ఆకుల పళ్ళాకేసి యేటో చూస్తో వొక్కొక్క మాటగా, "ఎప్పుడైనా, యీజన్మలో ఆయన్ని చూట్టం తటస్థిస్తే ఆరెంటినీ ఆయనకి అర్పించుకుంటాను." చప్పున శంకరంవేపు "చూడాలనివుందా ఆరెండునీలాలు?"

"ఎక్కడున్నాయో చెప్తే తీసుకుంటాను."

వొహమూలవున్న తోలుపెట్టెవేపు కలతిప్పింది. శంకరం దాన్ని తెరిచాడు.

"అడుగున వుంది చూడండి పెద్దకవరు."

దాన్ని తీసుకొని కుర్చీలో వొచ్చి కూచున్నాడు.

"ఇలా యివ్వండి.

కవరుతెరిచి మందికాగితంమీద రంగుల్తో దించిన రెండుబొమ్మలు బైటికి తీసింది. వొకాటి శంకరానికి అందిస్తో "ఇది మొదటినీలం."

శంకరం దాన్ని యింకా అట్లాగే చూస్తోన్నాడు.

"ఇది రెండో నీలం."

శంకరం దాన్ని అందుకొని నిర్ఘాంతపోయి చూశాడు. అయిదునిమిషాలదాకా ఆ రెంటిపైనుంచి రెప్పమరల్పలేదు. చప్పున ఆ రెంటినీ హృదయానికి అణచుకొని కళ్లుమూసుకున్నాడు.

"కావు. నా గీతాల్ని చదివిరాసిన చిత్రాలుకావివి. ఈజీవుల్లని కలలో చూసి వర్ణించాలని మొండి అక్షరాల్తో ప్రయత్నించినయత్నాలు ఆరెండుగీతాలు."

కుసుమం చకితురాలై అట్లాగే చూస్తోంది.

శంకరం కళ్లుతెరిచి వుద్రేకంతో కుసుమం ముఖంలోకి చూస్తో, "నావే యివి. హాక్ శంకరం నేనే."

"మీరా!"

తెలవ్వాపాడు.

వొక్కనిమిషం కుసుమం నోట్లోని తాంబూలం నమలకుండా శ్వాసతీపి రెప్పవాల్పకుండా శంకరంవేపు చూసింది. శంకరం ఆబొమ్మలకేసి చూస్తోన్నాడు. ఆ ముహూర్తాన వేరప్రపంచమే లే దాతనికి.

"నిజంగా యీరెండునీలాలంచే పేకిలాకూ అని?"

"........................."

ఆరెండోగీతాన్ని అందుకొని అతి మధురంగా ప్రతిశబ్దాన్ని అనుభవిస్తో పాడింది.

"ఇట్లా ఆరెండునీలానికి మధురగానం చేసిన వారే మీరు?"

పిచ్చిగా ఆమెకేసి చూస్తోన్నాడు శంకరం. ఆమె పాట ఆపిందీ, ప్రశ్నించిందీ, యేవీ వినపడ్లేదు. వొక్కనిమిషం అట్లావుండి చప్పున లేచాడు. బాధపడ్తోన్నవాడికిమల్లే రెండుచేతులు గట్టిగా వెనక్కి పట్టుకొని పెదిమలు బిగించి కిటికీదగ్గిరికి వెళ్లి ఎట్లో చూస్తో నుంచున్నాడు. కుసుమం మంచంలో మోకాళ్ల చుట్టూ చేతులువేసుకో కూచొని శంకరాన్ని అమితానందంతో చూస్తోంది. ఎవరుకూడా కొన్ని నిమిషాలు మాట్లాళ్లేదు.

"మిమ్మల్ని యెప్పుడూ, పంచెలుపోసిన ధోతి, జరీఅంచు వుత్తరీయం, ముఖంమీదికి పడే క్రాపు..."

చప్పున శంకరం వెనక్కి తిరిగివొచ్చి మంచానికి దగ్గిరగా మోకాళ్లమీదకూచొని చేతులు జోడించాడు. ఆ ఆనందంలో నిండిన కళ్లల్లోంచి అతనికి తెలీకుండా నే ముత్యాల్లాంటి చుక్కలు కాలువగాకాక వొక్కొక్కటిగా జారుతోన్నాయి.

"చాలు. ఎంత దుంఖకవికైనా తను గీతాలు రాస్తోన్నప్పుడు కలిగే ఆనందం అత్యధికం. ఆగీతాలని కవిహృదయానికి వచ్చేట్టు అర్థంచేసుకునేవాళ్లు దొరికితే వేరేదీ కోరుకోడు. వారు నీలాంటి రసజ్ఞులు.

. ఇంత ఉత్కృష్టంగా నాగీతాలకి స్థూలరూపం కలిగించేవాళ్లు......ప్రాణం

కరిగించేట్టు పాడటం......మవ్వే కవిత్వం. అబ్బ! బతకలేను, బతకలేను......తేనెతరువాత చేదు......"

లేచి పిచ్చిగా నాలుగువేపులా గభాగభా చూశాడు. కిటికీవేపు చూశాడు.

"శెలవు. ధన్యుడిని."

కిటికీవేపు పరుగెత్తాడు. కుసుమం బెదిరిపోయింది. మహాఆవేశంతో చప్పున దూకి అతనివెంట పరుగెత్తింది. సగంకాలు కిటికీబైటికి వేసినవాడి చెయ్యి పట్టి వెనక్కి బలంకొద్దీ లాగింది. వెనక్కి పడ్డాడు శంకరం. స్పృహతప్పింది. దగ్గిరగా వున్న కూజా తెచ్చి నీళ్లు నెత్తిమీద గుమ్మరించింది. నుంచోలేక గోడ నానుకుంది. అక్కడకూడా నుంచోలేక మంచంమీద వొరిగింది. పుస్తకంబొమ్మలు దిండుకింద దాచేసింది. కొంతసేపటికి తెప్పరిల్లాడు శంకరం. అప్పుడే గదిలోకి వొచ్చినట్టు కలియచూశాడు నాలుగువేపులా. కుర్చీమీది తువాలుతో తడి అద్దుకున్నాడు.

"వెళ్లి కాస్సేపు నిద్రపొండి."

"ఆచిత్రాలేవీ ?"

"..................."

"భయపడొద్దు. అగాయిత్యం యేమీ చేయను."

కదల్లేదు కుసుమం.

"నిజం, అట్లా యేమీ చేయను."

మెత్తకిందినుంచి తీసియిచ్చింది. శంకరం వాటిని చూస్తూ నిద్రలోమల్లే నడచిపోతోన్నాడు. తలుపుదగ్గిరికెళ్లాడు.

"శంకరం! వొట్టు."

"ఏమీ చేయను."

## 3

నాలుగుగంటలకి పద్మారావు వొచ్చాడు. అతడు ముందున్న యిల్లుమార్చడంవల్ల యెంతోకష్టంమీద యిల్లుదొరికిందని చెప్పాడు. కాని తను వొక్కడు అతన్ని కలవటం బాగుండదుకాబట్టి శంకరాన్ని రావాల్సిందన్నాడు. ఇద్దరూ కలిసి సాయంత్రం యేడు గంటలకి వెళ్లారు.

సగం పెంకుటింటి రెండోఅంతస్తుమీద సగం గది తీసుకొనివున్నాడు పద్మారావుఅల్లుడు శోభనాద్రి. రాత్రియెనిమిదింటికిగాని రాడన్నారు. అక్కడే కని పెట్టుకోవున్నారు. శంకరం, పద్మారావు మాట్లాళ్లేదు. ఎవరిమట్టుకు వారు ఆయాసపడ్తోన్నారు. శోభనాద్రి వుండే వాతావరణం చూసినకొద్దీ మరీ తరుక్కుపోయాయి వాళ్లహృదయాలు.

రాత్రి యెనిమిదిన్నరకు కట్టుమెట్ల సుండా తెగిపోయిన చెప్పు యీడ్చుకుంటో వొచ్చాడు. గుండీలు లేని పర్టు, ఖాకీకోటు, జుట్టంతా ముఖంమీదికి వొదిలి నెత్తివెనుకవేపు వొపటోపి, మురికిలాగు, పెరిగినగడ్డం, నోట్లో బీడి చూట్టంతోటే శంకరం స్తంభితుడైనాడు. తా నిదివరకు మనసులో చిత్రించుకున్న దానికన్న ఘోరంగా వుంది దృశ్యం.

"శోభనాద్రి?"

"కోన్ హై ?"

"నేను పద్మారావు. హైదరాబాద."

అర్థమైంది శోభనాద్రికి. అందుకనే ఆ వేపు తిప్పుకున్నాడు ముఖం.

"ఇప్పుడెందుకొచ్చారిక్కడికి?"

"గదితాళం తియ్యి. సావకాశంగా మాట్లాడాల్సి వుంది నీతో."

విధిలేక తలుపుతెరిచాడు. దీపం వెలిగించాడు. అక్కడొకచాప వుంటే శంకరం, పద్మారావు దాని మీద కూచున్నారు. శోభనాద్రి దూరంగా గోడకి చేరబడ్డాడు.

"ఇప్పటికి తొమ్మిదేళ్లయింది నిన్ను చూడక శోభనాద్రి."

"..........."

"ఇక్కడ వున్నావని కూడ మొన్న మొన్ననే తెలిసింది."

"..................."

శంకరం గదంతా కలియచూశాడు. ఎడమవేపు మూల్లో వున్న పొడుగాటి నల్లని సీసాను చూసి యెప్పుడు లేచిపోతామా అక్కడినుంచి అనుకున్నాడు.

"ఏం చేస్తున్నావు యిప్పుడు?"

"గిర్నీలో."

"ఎందు కింత కష్టపడటం? నాకు తెలిపితే అన్నివిధాల సహాయపడేవాడినిగా? నువ్వుగాక వేరే యెవరున్నారని నాకు!"

కాస్త వికసించింది శోభనాద్రిముఖం.

"నీకోసం కుసుమం యెంతో బెంగపెట్టుకుంది. నువ్విక్కడ వున్నావని తెలిసినాక వొక్క ముహూర్తం హైదరాబాదులో వుండనని పట్టు పట్టింది."

"..............."

"నువ్వు కష్టపడ్తోంటే తానెట్లా సుఖంగా వుండ గలనని యేడ్వటం ఆరంభించింది. దాని యిష్టమని వెంటబెట్టుకోవచ్చా."

నుదురు తెరిచాడు శోభనాద్రి. "ఇదా మీయెత్తు? ఈబుజ్జగింపులు నావొద్ద సాగవు. తీసికెళ్లండి చక్కగా మీఅమ్మాయిని మళ్లీ."

జేబులోంచి బీడీ తీసి పళ్లసందున యిరికించుకొని వెలిగించాడు. గదిలోనే వోహామూలకి వుమిశాడు. శంకరంవొళ్లు మొలకలెత్తింది. ఈ గదిలో ఆతనిపక్కన మళ్లీ వూహించుకున్నాడు కుసుమాన్ని. రెండుచేతుల్లో ముఖం దాచుకున్నాడు."

"ఇంత తొందరపడకు శోభనాద్రీ. నాకు తెలుసు, డబ్బులేని స్థితిలో వుంకొకళ్ల భారం వహించటం కష్టం. కాని నాకుమాత్రం మీరుతప్ప యెవరు?"

"అవేవీ వినిపించుకోను. మీ అమ్మాయితో నాకెలాంటిసంబంధమూ లేదు."

"లేదంటే.............."

"నాకు బైటవెళ్లాల్సివుంది."

కోటు తొడుక్కొని.టోపీ తగిలించాడు. తాళం చేతులోపట్టుకొని దీపం ఆర్పాడు. విధిలేక శంకరం, పద్మారావు బైటికివొచ్చారు. తాళంవేసుకొని వీళ్లకన్న ముందే మేడదిగి వెళ్లిపోయినాడు శోభనాద్రి.

దారిపొడుగునా యెవరూ మాట్లాళ్లేదు. హోటల్ మెట్లు యెక్కతోన్నప్పుడు పద్మారావు శంకరంభుజం మీద చెయ్యివేసి అన్నాడు, "ఇట్లా వుంటాడని యిదివరకే చిత్రించి చెప్పా కుసుమానికి దాని అదృష్టం. వుదయాన కుసుమాన్ని తీసికెళ్దాం."

చప్పున ఆగాడు శంకరం. పట్టలేని వుద్రేకంతో "అంత మీకు భరువుగావుంటే గొంతు పిసకకూడదు?"

నవ్వాడు పద్మారావు. ఇదంతా నాయెక్కసం అనుకుంటోన్నావు. కుసుమం నానెత్తురు, నామాంసం కాదూ? నేను వాడితో అన్నమాటలన్నీ అక్షరాలా నిజం. వుండనని వొక్కపట్టుపట్టింది. ఇంత అనారోగ్యంగా వున్నా ప్రాణాలోకూడ రెండురోజు లుండ లేదు. ఎంతటి పాషాణహృదయంవున్న తండ్రిఅయినా వున్న వొక్కకూతురుని, అందులో కుసుమాన్ని కన్ను దాటిపోనివ్వటానికి సామాన్యంగా వొప్పుకొంటాడా?"

శంకరం కిందిపెదవి వొణికింది. అది పద్మారావుకూడా చూశాడు. తక్షణమే శంకరంచేతిని తన చేతులోకి లాక్కొని ముందుకి నడిపించాడు.

రాత్రంతా వొక్క నిమిషం నిద్రపోలేదు శంకరం. ఎట్లాగైనా తరుణం కలుగచేసుకొని కుసుమంతో వొంటరిగా మాట్లాడాలని ప్రయత్నించాడు. వాళ్లగది ముందు యెన్నోసార్లు పహారాయిచ్చాడు. కాని యే ప్రయత్నమూ సాగలేదు.

తెల్లారి ఆరు గంటలకి పద్మారావు వొచ్చి పిలిచాడు. తాము సిద్ధంగా వున్నామనీ, శంకరాన్ని తొందరగా తయారుకమ్మనీ మాత్రంచెప్పి వెళ్లిపోయినాడులి కాళ్లాడలేదు శంకరానికి. మిక్కిలి కావాల్సినవాళ్లని స్మశానానికి తీసుకోపోతోన్నప్పటిమల్లే అనిపించింది.

వీళ్లు వెళ్లేవరకు నిద్రలేవలేదు శోభనాద్రి. తలుపు తట్టాడు పద్మారావు.

"కోక్ హైా?"

మాట్లాడకుండా మళ్లీ తట్టాడు తలుపు. విసుక్కుంటూ లేచి తలుపుతీశాడు. చూశాడు. కుసుమం దివ్యసుందర విగ్రహాన్ని ఆమెవొంటిమీద వొకటిరెండు నగల్ని చూశాడు. క్రమంగా వుద్రేకం హెచ్చింది. పిడికిళ్లు బిగపట్టి మీసంమెలేస్తూ కుడికన్ను కాస్త మూసి సైగచేశాడు. కుడిచేతిని ముందుకుజాచి కుసుమాన్ని తనవేపు లాగ ప్రయత్నించాడు. పద్మారావు పళ్ళు పటపటమనిపిస్తూ చేతికర్రని అతనిపైకి లేపాడు. తక్షణం కుసుమం లోపలికి పరుగెత్తి శోభనాద్రి ముందు ఆతనికి వీపు ఆనించి నుంచుంది.

"ఏమిటి నాన్నా యింత అమానుష్యం?"

పద్మారావు చేతిని దింపుకున్నాడు

"వెళ్లండి. ఇహ మీరు వెళ్లండి నాన్నా."

తటాలున తలుపేసుకుంది. "ఇహ వెళ్లండి న్నా!

ఇద్దరూ హారినవకాల పోహుదు మేపడగారు. హోటల్ చేరారు.

౪

ఏమీతోచదు. ఏమిటో ఆవేదన. ఏదో పొంగుట్టుకున్నట్టు తహతహ. ఏదీ సహించదు. ప్రతీదివిసుగు. కాఫీ పుచ్చుకునే లాంఛనం అయినాక పద్మారావు శంకరందగ్గిరకి వొచ్చాడు. ఏదో మాట్లాడాలనుకుంటారు కాని యెవ్వరూ అయిదు నిమిషాలవరకు మాట్లాళ్లేరు. చివరికి మ్యూజియం చూద్దామని బైలుదేరారు.

మ్యూజియంలో మొదటిహాల్లో వున్న విగ్రహాలని చూశారు. వాతావరణంవల్ల జంతువుల వర్ణం యెట్లా పరిణమిస్తుందో చూపే ప్రదర్శనం చూశారు. పేరుబొందిన చిత్రకారుల చిత్రాలు చూశారు. ఆచిత్రాలన్నీ కవిత్వం. చిత్రం అనుభాగాన ఆగీతం రాసి వుంది. అణిగివున్న దుఃఖమంతా వొక్కసారి పొరిలి వొచ్చింది శంకరానికి. పద్మారావు యేమీ యెరుగనట్టు యెడమమీసాన్ని పెదిమలనడుమ కొరుకుతూ బైటికి వొచ్చాడు.

శంకరం భోంచేయలేదు. గదితలుపేసుకున్నాడు. పడుకుందా మనుకున్నాడు. చదువాలని ప్రయత్నించాడు. పద్యాలు రాతామని కాగితం, కలం తెచ్చుకున్నాడు. ఇదివరకు యెన్నోసార్లు పరితాప స్థితిలో వున్నప్పుడు యెన్నో మనోహరమైన పద్యాలు పెకిలాయి. కాని యిప్పుడేమీ తోచదు. వూపిరిసెరప నీని ఆవేదన. ఏడ్చి హృదయభారం తగ్గించుకుందా మనుకున్నాడుకాని యేడ్పురాదు. పిచ్చిగా గదంతా తిరిగాడు. ఎన్నోసార్లు కిందికెళ్లి రోడ్లోనుంచొని వొచ్చిపొయ్యే జనప్రవాహాన్ని చూశాడు. పద్మారావు తనగదితలుపే తెరవలేదు.

తటాలున నిశ్చయానికి వొచ్చాడు శంకరం. పరిణామం యేమైనాకాని అని తెగించాడు. గదిలోకి వొచ్చి దుస్తులు వేసుకుంటూ అద్దంముందు నుంచొని సగంవొడిసిన బ్రిలియంటైన్ సీసాని బలంకొద్దీ నేలకి కొట్టాడు. "ఆముళ్లల్లోకాదు కుసుమానికి స్థలం. పవిత్ర దేవాలయంలో, నిర్మలహృదయంలో, యిక్కడ." దుస్పనతో తనహృదయంమీద కొట్టుకున్నాడు.

ఆమెట్లకి సమీపంలోవున్న కుళాయిదగ్గిరేవుంది కుసుమం. చెప్పులులేక వొక్కఅడుగువేసి యెరుగని పాదాలు బురదనీళ్లలో తడుస్తోన్నాయి. మసిగిన్నె నొహదాన్ని మట్టితో తోముతోంది. సగంతడిసిన చీర కంతా మన్ను అంటింది. ఆ సులాబీవన్నె మోచేతికి మసి అంటింది. ఆమెని చూసి అట్లాగే నుంచొని పోయినాడు శంకరం.

"కుసుమం!"

ఆమె తలెత్తికూడా చూడలేదు. గిన్నెని కడుక్కొని పైకెళ్లింది. వెనకాలే వెళ్లాడు శంకరం. గిన్నె నొహమూలకి పెట్టి బుజాల్ని జారవిడిచి మెడని వాలేస్తూ శంకరంవేపు తిరిగింది. ముఖమంతా యీడ్చుకోపోయింది. పెదిమలు యెండిపోయాయి. ఆమెలోని రక్తాన్నంతా వొక్కసారి పీల్చేసినట్టుంది.

"కుసుమం, కుసుమం, నిన్నిట్లా చూస్తూ బతకలేనమ్మా. దారం తెంపినట్టు పుటిక్కుమన నీ గొంతెవరైనా పిసుకుతోంటేకూడా అంత కష్టమనిపించదు మాకు. ఆముఖం...అబ్బా! చూడలేను. ఎందుకమ్మా నీకీపిచ్చి? మీ నాన్న కఠినుడుగా అవుపడ్తాడుకాని దేవుడు. చూడు, చూడు, నిన్నింతకొంపగా చూసే మీ నాన్నకి విషంపోస్తోన్నావు యీవృద్ధాప్యంలో."

ఆమె గోడవేపు తిరిగింది. చేతుల్లో ముఖం దాచుకుంది.

"కుసుమం, నీదేహ మెంతసుకుమారమో నీహృదయంకూడా అంతే లలితం. వొక్కగీతానికే కరిగిపోయే గుండె నీది. అట్లాంటి నీకు నిర్దాక్షిణ్యం తగదమ్మా. కుసుమం, యీముళ్లల్లో బతకవమ్మా నువ్వు!"

నిత్రాణచేత గోడకి వొరుసుకొన్నామెని తన చేతుల్లోకి తీసుకోపోయాడు. ఆమె తప్పించుకొని దూరంగా జరిగింది కొంచెంకోపంగూడా సూచించింది.

"నువ్వు పూలల్లో బతకాల్సిన సుకుమారివి, కుసుమం. ఈనరకంలో గాలికూడా పీల్చలేవు. కుసుమం, నీమీద యీగ వాలనీకుండా కంటిమీద రెప్పేయక కాపాడుకుంటా. పసిపిల్లకి సర్వసేవలు చేస్తూ చీమ దోమ కుట్టకుండా కాపెట్టే తల్లికిమల్లే ఆనందంలో మునిగిపోతా. నీయీపాదాల్లో దృష్టినిలిపి గీతాలుపాడుకుంటా. ఆరాధించుకుంటా."

"చాలు. ఎంతటికష్టాల్లో వున్నప్పుడైనా నన్నీప్రపంచంలో ఇంత యెత్తుగా భావించేవాళ్లు, ప్రేమించేవాళ్లు వొకారున్నారని తలుచుకుంటే ఆ బాధలన్నీ పోతాయి. నా కంతే చాలు. నిజంగా ఆనందం అనుభవించాలంటే కష్టాల్లోనే వుండాలి, నీవహాయి యెండలోనివాళ్లకే యెక్కువగా తెలిసేటట్టు. వొకరోజు మిమ్మల్ని యీప్రపంచం నెత్తిన పెట్టుకుంటుంది. దేశ మారుమూలల్లో మీ పేరు ప్రతిధ్వనిస్తుంది. ఈ పా



కొంపలో వుండి అ తటివాడు నావాడ మురుస్తాను."

"దొంగవేషం. దొంగ మాటలు. మృగం; క్రౌంచబోతు; పతితూన్యుడు. నువ్వు, నువ్వు మోహినీరూపంలోని రాక్షసివి. మెత్తని దేహంలో పాషాణహృదయం కలదానివి. వాడు నిన్ను నలి

పడిచేతిని ముందుకు
ది కుసుమాన్ని తన
గ్ర
షు పద్మాకరా వు
ం పటపటమనిపిస్తో
క్రని అతనిపైకి
గాషు ......"

మః చంపేస్తాడు. ఇతరులకి అమ్మేస్తాడు. నానా
భత్సం చేస్తాడు."

ఆవేశంలో ముందుమాటపెకల్లేదు. వొళ్లంతా
మటలు కమ్మాయి. ముఖం జాజువారింది. రెప్ప

వాల్పకుండా కుసుమం వేపు చూస్తో న్నాడు. కుసుమం తలవొంచుకుంది. పైట అద్దుకుంది కళ్లకి.

"కుసుమం, కుసుమం! క్షమించమ్మా! మూర్ఖుణ్ణమ్మా నేను. ఆవేశంలో నీ హృదయానికి ముళ్లు నాటాను.

ఆమె అట్లాగే మాట్లాడకుండా నుంచుంది. కళ్లు అద్దుకుంటుంది.

"నీ యీ త్యాగంవల్ల అతను మనిషి అవుతాడనా?"

"నాకు ఫలితంతో అవసరం లేదు. నాది నిష్కామకర్మ."

"ఎట్లా అవుపడ్తోన్నావు కుసుమం, నాకీవాళ్ల!"

"ఇహ నొక్కువ బాధ పెట్టక వెళ్లిపొండి. నాకూ సుంకెవుంది. కాని నాతోవను నన్ను పోనీ."

శంకరం ఆమెముందర మోకాళ్లమీద వాలబడి ఆమెచేతులు పట్టుకోపోయాడు. ఆమె పక్కకి జరిగింది. అట్లాగే కూచున్నాడు ఆమెవేపు చూస్తో. లేచి వెళ్లుతాడేమోనని యెదిరిచూసింది. చప్పున బైటికి వెళ్లిపోయింది.

పదినిమిషాలు గడిచాయి. పదిహేను గడిచాయి. మెల్లిగా లేచాడు శంకరం. మెట్లదగ్గిర కొళాయిదగ్గిర

కూడా అవుపళ్లేదు కుసుమం. వీథిలో తలవొంచుకొని బైలుద్దేరాడు.

"శంకరం!"

పైకి చూశాడు. నోటికి పైట ముద్దగా అడ్డం పెట్టుకొని వానిపోయినకళ్లతో ముందుకి వొంగి చూస్తోంది కుసుమం.

"ఆ రెండుబొమ్మలూ ఆ పెట్టెలోనే ఉన్నాయి. తీసికెళ్లు. నా జ్ఞాపకం."

తలవొంచుకున్నాడు శంకరం. రెండడుగులు ముందుకి నడిచాడు.

"శంకరం!"

తిరిగి చూశాడు పైకి.

"వెళ్లి రాను!"

తలవొంచుకొని గబగబా నడిచిపోయాడు.

---

ఆంధ్రుడు తుదకు మేల్కొనెను



## ౬

కడచిన వైశాఖమాసపు సంచికయందు పండ్ల యాహారపు యోగ్యతనుగురించి చర్చింపబడెను. ఇందు కూరలయొక్కయు, బెల్లము, చక్కెర, తేనె మొదలగు వానియొక్కయు, కొన్ని మాంసాహారముల యొక్కయు ఆహారపువిలువను గురించి వ్రాయబడును.

### ౧. కూరలు

కూరలనగా మనము సామాన్యముగ నన్నముతో పాటు వ్యంజనముగ దినుటకుగాను ఉడికించి పోపువేసి గాని, మసాలా ద్రవ్యములతో చమురున వేచిగాని, ఇతరవిధములగాని తయారుచేయు శాకపదార్థములు. మాంసాదులనుగూడ నిట్లు తయారుచేసి వ్యంజనముగ నుపయోగించుటచే నవికూడ కొందరిచే 'కూర'లని వ్యవహరింప బడుచున్నవి. కాని వృక్ష జనితములు మాత్రమే యిందు కూరలుగ పరిగణింపబడును.

కూరలను వానినోసగు నుద్భిజ్జభాగము ననుసరించి ఆకుకూరలు, కాయగూరలు, దుంపకూరలు అని మూడుతరగతులుగ విభజింపవచ్చును. ఈక్రింద ఈ మూడుతరగతులలోను ఈ దేశమున లభించు జాతులు చాలవరకు చేర్కొనబడెను.

I. ఆకుకూరలు—

(a) కృషిచేసి పెంచబడు దేశీయములు·—పెరుగుతోటకూర, ముక్కుతోటకూర, కొయ్యతోటకూర, మట్టుబచ్చలి, తీగబచ్చలి, గోగు, చుక్కకూర, మెంతికూర, కొత్తిమిరి, చేమకూర, అవిసె, చింత.

(b) కృషిచేసి పెంచబడు విదేశీయములు:—లెట్యూస్, గోబి (క్యాబేజ్), పూగోబి (కాలిఫ్లవర్-ఇది పూవ్వుకూర యయినను స్వభావమున నాకు గూరలను బోలియుండుటచే నీ తరగతిలో జేర్పబడును. సెలరీ, టర్నిప్ఆకు.

(c) స్వతస్సిద్ధముగ బెరుగునవి :— చిలకతోటకూర, దొగ్గలి, పొన్నగంటి, పులిచెంచలి, గజ్జేరు, పావిల, నల్లేరు, సీకాయచిగురు, నెల్లికూర.

II కాయగూరలు—

(a) కృషిచేసి పెంచబడు దేశీయములు.—బీర, నేతిబీర, గుత్తిబీర, పొట్ల, దోస, ములుదోస, ఆనగ, గుమ్మడి, దొండ, కాకర, కూరపుచ్చ, వంగ, బెండ, గోరుచిక్కుడు, తీగచిక్కుడు, అరటి, పనస, బొప్పాయి, మునగ.

(b) కృషిచేసి పెంచబడు విదేశీయములు:—సీమగుమ్మడి, సీమవంగ, ముక్కు లేక సీమచిక్కుడు, నల్లేరు చిక్కుడు, చౌచౌ, సదాపనస.

(c) స్వతస్సిద్ధముగ బెరుగునవి :— ఆగాకర, నేతిదొండ, వాకుడు, ఉస్తి, అత్తి.

III దుంపకూరలు—

(a) కృషిచేసిపెంచబడు దేశీయములు:—ఉల్లి, పెండలం, కంద, చేమ, ఎర్రదుంప, తెల్లదుంప, చిరుగడం (కొందరు ఎర్రదుంపలను కూడ చిరుగడమందురు; తెల్లదుంపలను మోహనమందురు. కొందరీ రెంటిని గెణుసుగడ్డ లందురు), చారకంద.

(b) కృషిచేసిపెంచబడు విదేశీయములు :—బంగాళాదుంప (ఊరలగడ్డ), టర్నిప్, బీటురూటు, గాజర (కారట్), నూలుకోలు, (ఇది దుంపవలె నేర్పడు కాండభాగము), సీమపిల్లి తేగలు.

(c) స్వతస్సిద్ధముగ బెరుగునవి:—బూరగచ్చిక, పిల్లి తేగలు.

కూరలలో ఆకుకూరలు శ్రేష్ఠములు. అవి ఖనిజ ద్రవ్యములను, (ముఖ్యముగ నినుమున) విటమినులను హెచ్చుగ నొసగును. క్రిందిపట్టిక చూడుడు. కావున నివి తక్కువగనుండు అన్నముమొదలగు నితరపదార్థము

లందలి లోపములను దీర్చుటకే యాకుకూర లుత్తమసాధనములు. మిగులసులభముగ పెంచనగినవి. కొనువారికి మిగుల చౌక. కాని యివి తినుటకు కాయ, దుంపకూరలంత యింపుగ నుండవు. అందుచే వానితోపాటైనను కొంతభాగము వీనిని దినుట యనుకూలము. ప్రతిదినము దినుకూరలో నాల్గవవంతైనను ఆకుకూర లుండుట మంచిది. సామాన్యముగ భాగ్యవంతులు వీని నంతగా దినకపోవుటచేతనే వారి యాహారమున ఖనిజములును, విటమినులును లోపముగనుండి తరుచు వ్యాధిగ్రస్తులగుదురు. బీదవాండ్రు చౌకయగుటచే లభించినవరకు వీనినే హెచ్చుగ దినుటచే వార లెక్కువ యారోగ్యవంతులుగ నుందురు. విశాఖపట్టణపు జిల్లాలోను, గంజాం జిల్లాలోను రైతులు వీనిని సామాన్యముగ ప్రతిచెరుకుతోటలోను మిశ్రమముగగాని, ప్రత్యేకములుగగాని సాగుచేయుచుండుటచే అందు గ్రామప్రజలకు కూరగూరలను హెచ్చుగ వాడు నభ్యాసము గలదు.

## కూరదినుసుల యాహారపు విలువను తెలుపు పట్టిక *

| దినుసు | అందుగల యాహార ద్రవ్యముల పరిమితి (ఔన్సుకు గ్రాములు): మాంసకృత్తులు | క్రొవ్వు | కార్బోహైడ్రేట్లు | [illegible] | [illegible] | నూరుపౌనుల తూనికగల మనిషికి కావలసిన పరిమితిలో 1 ఔన్సువలన లభించు ఖనిజ ద్రవ్యములు (శతాంశములు): సున్నము | భాస్వరము | ఇనుము | విటమినుల పరిమితి: ఎ | బి | సి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| **1. ఆకుకూరలు** | | | | | | | | | | | |
| మట్టుబచ్చలి | 0.40 | 0.05 | 0.88 | 6 | | 1.20 | 1.00 | 4.20 | + + + | + + + | + + + |
| తోటకూర (ఆకులు) | 0.53 | ? | 0.53 | 4 | 1.15 | 1.13 | 1.50 | | | | |
| ,, (కాడలు) | | | | | | | | | | | |
| గోంగూర | 0.27 | 0.01 | 0.76 | 4 | | | 2.80 | | | | |
| చుక్కకూర | 0 24 | 0.07 | 0.87 | 5 | | | 1.70 | | | | |
| కొత్తిమిరి | 0.37 | 0.01 | 0.65 | 4 | | | 2.00 | | | | |
| లెట్యూసు | 0.31 | 0.06 | 0.54 | 4 | | 2.80 | 1.40 | 4.20 | + + | + + + | + + |
| కాబేజి | 0.34 | 0.03 | 1.27 | 7 | | 2.60 | 0.80 | 2.90 | + + + | + + | + + + |
| కాలిఫ్లవర్ | 0.54 | 0.06 | 1.67 | 9 | | | | | + | + | + |
| టర్నిప్ ఆకులు | 0.20 | 0.03 | 1.27 | 6 | | | | | + + | + + + | + + + |
| మెంతికూర | 0.25 | 0.07 | 0.84 | 5 | | 1.50 | 1.50 | | | | |
| **2. కాయగూరలు** | | | | | | | | | | | |
| ములుకోస | 0.17 | 0.02 | 0.57 | 8 | 0.34 | 0.70 | 0.80 | 0.40 | | | |
| బీర | 0.23 | ? | 1.00 | 5 | | | | | | + | + + |
| పొట్ల | 0.23 | ? | 1.04 | 5 | 0.43 | | | | | | |

* ఈపట్టికయందు యంకెలు, Col. Mc. cavrisa గారి Fcod' అను గ్రంథమునుండియు అమెరికన్ రెడ్ క్రాస్ సొసైటీవారి 'Focd and Natition' నుండియు, బొంబాయిరాజధాని Baby and Health week Assciation వారి 3-వ సం. Booklet నుండియు సంగ్రహింపబడినవి.

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| సీమవంగ (పచ్చివి) | 0.30 | 0.30 | 1.27 | 6 | 0.64 | 0.70 | 0.70 | 1.00 | + | ++ | ++ |
| తియ్యగుమ్మడి | 0.28 | 0.03 | 1.47 | 7 | | | | | | + | + |
| వంగ | 0.34 | 0.09 | 1.44 | 8 | | | | | | + | + |
| ఫ్రెంచిచిక్కుడు | 0.52 | 0.03 | 1.36 | 8 | 0.92 | | | | + | ++ | ++ |
| కాకర | 0 60 | ? | 1.65 | 9 | 0.83 | | | | | | |
| బెండ | 0.57 | 0.33 | 1.70 | 12 | 0.87 | | | | | | |
| గోరుచిక్కుడు | 0 94 | ? | 3.05 | 16 | 1.27 | | | | | | |
| సదాపనస | 0.47 | 0.15 | 3.05 | 16 | 1.15 | | | | | | |
| బటానీగింజలు [(పచ్చివి) | 2.00 | 0.25 | 4.85 | 29 | | 1.60 | 3.80 | 3.60 | + | | |
| రాజుల చిక్కుడు గింజలు (పచ్చివి) | 2.66 | 0.11 | 6.45 | 37 | | | | | | ++ | ++ |
| 3. దుంపకూరలు | | | | | | | | | | | |
| నీరుల్లి | 0.37 | 0.03 | 3.06 | 13 | 2.10 | | | | | | |
| గాజరగడ్డ | 0.25 | 0.03 | 2.26 | 10 | | | | | +to++ | ++ | +to++ |
| నూలుకోలు | 0.27 | 0.16 | 3.30 | 15 | | | | | | + | + |
| కంద | 0.56 | ? | 4.60 | 21 | | | | | | | |
| చేమ | 0 60 | ? | 5.51 | 25 | | | | | | | |
| పెండలం | 0.51 | 0.06 | 6.31 | 27 | | | | | | + | |
| చిరుగడం | 1.80 | 0.38 | 5.77 | 33 | | | | | | | |
| బంగాళాదుంప | 0.70 | 0.04 | 8.15 | 35 | | 1.20 | 2.6 | 5.40 | | +to++ | |

క్రిందిపట్టిక తెలుపునట్లు ఆకుగూరల యింధనశక్తి చాలతక్కువ. ఔన్సుకు ౧౦కి లోపుగ నుండును. సగటున ౫కంటె హెచ్చుగ నుండదు. కావున నీయాకుగూరలు శరీరపుష్టినిచ్చుటకు బనికిరావు. పైనిచెప్పినట్లు అన్నము మొదలగుప్రధానాహారపదార్థములందలి లోట్లను దీర్చుటచే పనికివచ్చును. ఆకుగూరలందు నారపదార్థము కొంతయుండుటచేతను, వాని నైసర్గిక స్వభావము చేతను గూడ విరేచనకారులు. అందువలన నన్నము మొదలగు నితరాహారపదార్థములతోపాటు ఆకుగూరలను పుచ్చుకొనువారికి మలబద్ధముండదు.

ఈదేశపుటాకుకూరల సంఘట్టనమునుగురించియు, అందలివిటమినుల పరిమితినిగురించియు తగినంతపరిశోధన యింకను జరుగవలసియున్నది.

కాయగూరలలోగూడ కొన్ని ఆకుగూరలవలెనే మిగుల తక్కువ యింధనశక్తి గలిగియున్నవి. బీర, పీనియందలి ఖనిజద్రవ్యముల పరిమితినిగురించి ...

పొట్ల, ఆనగ, ములుకోస, సీమవంగ, వంగ, ముక్కుచిక్కుడు, కాకర యిందు కుదాహరణములు.

వీని యింధనశక్తి ఔన్సుకు ౧౦ కి మించదు. సగటున ఔన్సుకు ౬ ఉండును. కాని యిందు పసరు తక్కువగ నుండుట నివి తినుట కింపుగ నుండును. కాని వీనిలో ఖనిజములును, విటమినులును ఆకుకూరలలో కంటె తక్కువ. కావున వీనిని హెచ్చుగ దినవలసియుండును. వీనివెలయు హెచ్చు. కావున వీనిని భాగ్యవంతులే తగినంతగ తినగలరు.

బెండ, గోరుచిక్కుడు, సదాపనస మొదలగు కొన్నిటి యింధనశక్తి ౧౦ మొదలు ౨౦ వరకుండును. వీనిలో మాంసకృత్తులును, కర్బనోదజనితములును గూడ ఆకుగూరలందుకంటెను, పైతరగతి కాయగూరలందుకంటెను కొంచెము హెచ్చుగ నుండును.

తెలియదు. విటమినులపరీక్షయు ఇంకను జరుగవలసి యున్నది. అయినను ఈ విషయములం దివి ఆకుకూర లకు తీసిపోవునని యనుకొనవచ్చును.

చిక్కుడు బటానీ రకములు (కొంతవరకు ముదిరిన గింజలు మాత్రమే యుపయోగించునో) పై తరగతి కంటెను హెచ్చు యింధనశక్తి గలవి. వీనిలో మాంస కృత్తులును, కర్బనోదజనితములునుకూడ మరింత హెచ్చు గ నుండును. వీని యింధనశక్తి అవి ముదురుటనుబట్టి ౨౦ - ౪౦ వర కుండును. ఇందు ఆకుకూరలలోవలె ఖనిజములు మెండుగ నుండును. విటమినులు మధ్యమ పరిమితిలో నుండును. విటమినులు గింజలలోకంటె వీని తొక్కలలోనే హెచ్చుగ నుండుటచే వీనిలో తొక్క మృదువుగ నుండురకములను, అంతగాముదురక ముందు తొక్కలతోనే వండి తినుట శ్రేష్టము.

దుంపకూరలనుగూడ వాని మొత్తపు యింధనశక్తిని బట్టి రెండుతరగతులుగ విభజింపవచ్చును. జొన్నకు ౧౦-౨౦ కాలరీల యింధనశక్తిమాత్రమే గలిగియుండు ఉల్లి, గాజర, నూలుకోలు యివి మొదటి తరగతిలో జేరును. జొన్నకు ౨౦-౪౦ కాలరీలవరకు యింధనశక్తి గల కంద, పెండలం, చేమ, చిలగడం, బంగాళాదుంప ఇవి రెండవతరగతిలో జేరును.

మొదటి తరగతిలోనివెల్ల తక్కువయింధనశక్తి గల గాజరగడ్డలో తప్ప తక్కిన దుంపకూరలలో విట మినులు మిగుల తక్కువ. ఖనిజద్రవ్యముల సంగతి బంగాళాదుంప విషయమున దప్ప తెలియదు. ఇందు మాత్రము సున్నముతక్కువగను, స్ఫురముమధ్యముగను, ఇనుము హెచ్చుగను గలదు. మొత్తముమీద పండు జాతులను (ముఖ్యము రెండవతరగతిలోనివానిని) కూర లలో జేర్చుటకుబదులు, ప్రధానాహార పదార్థములలో జేర్చుటయే సమంజసము. ఈక్రిందిపట్టికలో సుమారు నూరుకాలరీల యింధనశక్తి నొసగునంతంత పరిమితిని దినుసులు ఆయాతరగతుల కూరలవలన శరీరమునకు ఎం తెంత మాంసకృత్తు, చమురు, కర్బనోదజనితము, ఖనిజ ములు, విటమినులు లభించునో యీక్రింద వరిబియ్య ముతో పోల్చిచూపబడును.

| దినుసు | సుమారు 100 కాలరీల యింధనశక్తి నిచ్చు పరిమితి | | | అందుగల యాహార ద్రవ్యముల పరిమితి 1 జొన్నకు గ్రాములు | | నూరుపాళ్ల మినిషికి వలయు పరిమితిలో 1 జొన్నవలన లభించు ఖనిజద్రవ్యములు శతాంశములు | | విటమినుల పరిమితి | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | జొన్న | మాంసకృత్తు | చమురు | కర్బనోదజనితము | సున్నము | స్ఫురము | ఇనుము | | | |
| వరిబియ్యము (చేబియ్యము) | 1 | 2.30 | 0.09 | 22.30 | 0.6 | 6.3 | 5.5 | మిగుల స్వల్పము | + | |
| బంగాళాదుంప | 3 | 2.00 | 0.11 | 23.21 | 3.4 | 7.4 | 15.4 | మిగుల స్వల్పము + to + | | o |
| బటానీగింజలు (పచ్చివి) | 3½ | 6.90 | 0.86 | 16.72 | 5.5 | 13.1 | 12.4 | + | + + | + + |
| సీమవంగ | 16½ | 3.33 | 0.50 | 21.17 | 11.67 | 11.6' | | + | + | + + |
| మట్టుబచ్చలి | 16½ | 6.67 | 0.83 | 14.67 | 20.0 | 16.6' | | + + | + + + | + + + |

పై పట్టికను బంగాళాదుంపకును, బియ్యమునకును ఇనుముపరిమితిలో తప్ప అంతగా వ్యత్యాసములు లేవని తెలియును. కావున దుంపకూరలను మన మెంత తిందుమో అంత బియ్యపు అన్నమును తగ్గింపవలసి యుండును. దుంపకూరలను తిన్నను కాయగూరలను, ఆకుకూరలనుకూడ తినవలెను. సామాన్యముగ భాగ్యవంతులు రుచిమంతము లగుటచే కాయగూరలకంటెను, ఆకుకూరలకంటెను దుంపకూరలనే హెచ్చుగ నుపయోగించి, అన్నపు పరిమితిని తగ్గింపకపోవుటచేతను, ఆకుకూరలు, దుంపకూరలను తక్కువగ దినుటవలనను వారల యారోగ్యమునకు చాలహాని కలుగుచున్నది.

మూడవ తరగతి కాయగూరలలో, వానిని పరిమితి హెచ్చకుండ తినుచో (ముఖ్యముగ అంత ముదురని లేతకాయలను తొక్కలతోవండి తినుచో) చిక్కుడు, బఠాణీ రకములు అనుకూలములుగ నుండును.

మొదటి తరగతి కాయగూరలు మూడవ తరగతి కాయగూరలకంటె సుమారు 2 రెట్లు తినుచో అనుకూలములని పై పట్టికయందలి యంకెలు తెలుపును. ఆకుకూరలను మొదటి తరగతి కాయగూరల పరిమితిగ పుచ్చుకొనుచో వానికంటెను ఖనిజద్రవ్యములను (ముఖ్యముగ నినుమును) విటమినులను హెచ్చుగ నొసగునని పై యంకెలనుబట్టి తేలుచున్నది. కావున ఆకుకూరలను కాయగూరలను తినక దుంపకూరలను మాత్రమే తరుచు తినుచో కూరలవలన గలుగవలసిన మేలు కలుగదని స్పష్టమగుచున్నది.

కూరలు [illegible]ముగ వండి తినబడుచుండును. దుంపకూరలు వండి తినినచే సులభముగ జీర్ణమగును. అందు 'సి' విటమిను లేకపోవుటచే ఉడికించినందువలన నష్టమైపోవున దెంతగా లేదు. కాని, హెచ్చు నీటితో నుడికించి, మిగిలిపోవు నీటిని పారబోయుచో నందలి ఖనిజద్రవ్యములు పోవును. కావున తగుమాత్రము నీటినేపోసి యానీరంతయు నిగురునట్లుచేయుట మంచిది. నీటితో నుడికించకుండ దుంపలను కుమ్ములో పెట్టి అందలి తేమలోనే యుడికించి తినుట మరింత మంచిది. రుచియు బాగుగ నుండును. జీర్ణశక్తి బాగుగ నున్నవారు పచ్చిదుంపలనుగూడ తిని జీర్ణముచేసికొనవచ్చును. ఇట్లు తినుచో హెచ్చుగ తినుట సంభవింపదు. మరియు నుడికించిన దుంపలు జీర్ణము కానిచో ప్రేగులందు మందమొంది హానిచేయునట్లు ఉడికించనిదుంపలు ఒకవేళ హెచ్చుగ దిన్నను హానిచేయక, మలరూపమున శరీరమును త్వరలో విడుచును.

అలవాటు చేసికొనుచో కాయగూరలలోను, ఆకుకూరలలోను గొన్నిటినికూడ వండకుండ తినవచ్చును. కాయగూరలలో చిక్కుడుజాతుల గింజలనట్లు సులభముగ దినవచ్చును. కాని జీర్ణశక్తి తక్కువగనున్నవా రట్లు తినగూడదు. తినునెడల మిగులస్వల్పముగ దినవలెను. తాజా కీర, పొట్ల, యివి మిగుల సుఖముగ దినదగినజాతులు. ఇంపుగనే యుండును. అవసరమగుచో మొదట ముక్కలను నిమ్మకాయరసమునగాని, తేనెలోగాని ముంచి తిని క్రమముగ వీని సహాయములేకయే తిన నారంభించవచ్చును. మొదట కొంచమే తిని క్రమముగ పరిమితి హెచ్చింపదగును. జీర్ణశక్తి తక్కువగ నున్నవారు సైతము వీనిని స్వల్పముగ తిని యలవాటు పడుచో జీర్ణశక్తియు క్రమముగ హెచ్చును. ఉడికించుటవలన వీనియందలి విటమిను సి పోవుటచే వీని యుపయోగము తగ్గును. ఉడికించినపుడు నేరుపడు నీటిని వార్చివేయుచో నిందలి ఖనిజములును నష్టమైపోవును. లేఖరి యనుభవమున, ఆనగ, దొండ, లేతబెండ, బొప్పాయి, సీమవంగ యివికూడ వండకుండ తినదగిన యితర కూరగాయలు.

ఆకుకూరలను వండకుండ తినుట మరింతకష్టము. కాని వానిలోకూడ లెట్యూసు, పెరుగుతోటకూర వీనిని అలవాటుచేసికొనుచో నట్లు తినుట కష్టముకాదు. బచ్చలి, కాబేజి, కాలీఫ్లవర్ మొదలగువవికూడ నిట్లు తినవచ్చును. వీనిని సన్నముగ తరిగి, పెరుగులోవేసి [illegible] తినవచ్చును. లేక నిమ్మరసము, తేనె లేక బెల్లము వీనితో కలిపి తినవచ్చును. లేక వీనితోగలిపి త్రొక్కి ముద్దగజేసి తినవచ్చును. సన్నముగ తరిగి యెండించి పొడికొట్టి సీసాలో నిల్వయుంచినను ఇందలి

విటమిను సి కొన్ని నెలలవరకు అంతగా పోవని కను గొనబడెను. కావున నిట్లు నిల్వచేసిన పొడుమునుకూడ పూట కొకటి రెండు చిన్నచెంచాల చొప్పున బెల్లమో, తేనెయో, అరటిపండో, సపోటాపండో కలిపి పుచ్చు కొనినను పుచ్చుకొనవచ్చును.

కూరదినుసులలో జేరకపోయినను తమలపాకులు పచ్చిదిగ దినదగినవి. హిందూదేశములో వీనిని తాంబూలముగ వేయు నాచారము చాల శ్రేష్ఠమయినది. కాని యీ యాకులతో పాటు పోకచెక్కలను, సున్నమును, యితర మసాలా ద్రవ్యములను హెచ్చుగ నుపయోగించుటవలన నిందువలన తరుచు మేలుకంటె కీడే హెచ్చుగ గలుగుచుండును. లేకరి వీని నన్నిటిని పూర్తిగ వదలివేసి, వేరుసెనగగింజలతో కలిపి తమలపాకులను కొంతకాలము నమలి తిని పరీక్షించి నీపద్ధతి యనుకూలముగ గనబడెను. తులసియాకు కూడ పచ్చిదిగ దినదగిన విలువయైన వస్తువు. దీని విలువనుగురించి మన వైద్యగ్రంథములందు విపులముగ వ్రాయబడి యున్నది. కావున నిచట విస్తరించి వ్రాయుటనవసరము. లేకరి కొంతకాలము తమలపాకులవలెనే దీనినికూడ వేరుసెనగగింజలతో కలిపి తినుచుండెను.

## ౯. మధుర పదార్థములు

మధురపదార్థములలో స్వాభావికముగ లభించునది తేనె. బెల్లము, చక్కెర, కలకండ ఇవి చెరకు రసమునుండియు, బీటుగుంప రసమునుండియు, తాటి, యీత మొదలగువాని కల్లునుండియు తయారుచేయబడు చున్నవి. ఈక్రిందిపట్టికలో వీనియందలి శర్కరా పరిమితి తెలుపబడెను. ఇవి ప్రత్యేకాహార ద్రవ్యములుగ గాక సామాన్యముగ నితరాహారపదార్థములను తీయబరచుట కుపయోగింపబడుచుండును.

| | ౧ ఔన్సులోగల శర్కరా పరిమితి గ్రాములు | మొత్తపు యింధన శక్తి - ఔన్సుకు |
|---|---|---|
| తేనె | ౨౦-౨౨ | ౭౦-౭౪ |
| చెరుకురసము | ౫-౬ | ౨౦-౨౪ |
| తేనెపాకము సుమారు | ౨౦-౨౨ | ౭౦-౭౫ |
| బెల్లం | ౨౪-౨౫ | ౯౬-౧౦౦ |
| చక్కెర, ఖండశర్కర | ౨౭-౨౯ | ౧౧౨-౧౧౬ |

తేనె స్వాభావికపదార్థమగుటచేతను, వివిధములగు పుష్పములందలి మకరందమును కలిపి తేనెటీగలచే తయారుచేయబడుటచేతను మధురద్రవ్యములలో శ్రేష్ఠమయినది. ఇంధనశక్తిలో తృణధాన్యములకు కొంచెము తక్కువ. సామాన్యాహార ద్రవ్యముగ నుపయోగించుటరుదు. వైద్యులు దీనిని మందులతో ననుపానముగ నుపయోగింతురు. పక్షవాతరోగుల కిది శ్రేష్ఠమందురు. మంచిగుణమిచ్చుటకు కాచని తేనెయే శ్రేష్ఠము. కాని సామాన్యముగ కాచని తేనె నిల్వయుండదు. ఇందుకు కారణము తేనెపట్టునుండి తేనెను పిండునపుడు పట్టున నుండు గ్రుడ్లు, పిల్లలు మొదలగువానిని కూడ నలుపుట వలన వాని సంబంధమగు ద్రవ్యములు కొన్ని తేనెలో జేరుటయే. యంత్రసహాయమున తేనెపట్టు నిట్లు నలిపి వేయకుండ, తేనెను స్వచ్ఛముగ నుండునట్లు దీయవచ్చును. ఇట్లు తీసిన తేనె కాచకపోయినను చెడదు. యంత్రముతో తేనె నటు తీయుటకు తేనెటీగలు పరిమాణ నియమముగలపట్లనే ప్రత్యేకముగ నిర్మింపబడిన పెట్టెలలో నమర్చబడు చట్రములలో పెట్టునట్లు చేయవచ్చును. వ్యవసాయశాఖవారీపద్ధతిని, తెలిసికొనగోరు వారికి నేర్పుదురు. లేకరి యిట్టి తేనెపట్ల పెట్టె నొకదానిని విశాఖపట్నంలో తనబంగాళాముందుంచి దాని వలన గతించిన ౧౯ నెలలలో సుమారు 3 వీసెలకుపైగా తేనెను దీసి యుపయోగించుకొనుచుండెను

తేనెలో శర్కరాపదార్థమే గాక స్వల్పముగ మాంసకృత్తులును, ఖనిజములును (ముఖ్యముగ నినుమును) నుండును విటమిను ఎ, బి లు కూడ స్వల్పముగ నుండును.

తాజా చెరుకురసము లభించుచో మంచిపానీయము. కాని దీని నట్లే నిల్వయుంచి మధురపదార్థముగ నుపయోగింప వీలుపడదు. కాచి తేనెపాకముగ జేసి తేనెకు బదులుగ నుపయోగింపవచ్చును. కాని దాని

గుణము దీనికుండదు. ఇంధనశక్తి కొంచె మించుమించు తేనెతో సమానము

చెరుకురసమును కాచి, తేనెపాకపు పదునుకంటె ముదురుపదునున దించినచో గట్టిపడి బెల్లమగును. ఇందు శర్కరయేగాక చెరుకునగల కొన్ని మాంసకృత్తులును, ఖనిజద్రవ్యములును చేరును. చెరుకునందలి విటమినులును స్వల్పముగ మిగులును. కావున మధురపదార్థములలో తేనె, తాజాచెరుకురసము వీనియంత శ్రేష్ఠముగాకున్నను, శర్కరకంటె శ్రేష్ఠము. ఇంధనశక్తి తృణధాన్యములకంటె హెచ్చు.

చెరుకురసమునుండి యితరద్రవ్యముల నన్నిటిని తీసివేసి, సాధ్యమైనంత స్వచ్ఛముగ నుండునట్లు తయారుచేయు చక్కర కొంచెమించుమించుగ అంతయు శర్కరయే. యగుటచే దానియింధనశక్తి బెల్లముకంటెను, తేనెకంటెను హెచ్చు. కాని యిందు మాంసకృత్తులుగాని, ఖనిజములుగాని, విటమినులుగాని శూన్యము. కావున నిది తేనె, లేక బెల్లమంత శ్రేష్ఠము కాదు.

మనవైద్యశాస్త్రములందు కంటె శ్రేష్ఠముగ నెంచబడుచున్నది. రెండును కొంచె మించుమించు స్వచ్ఛమగు శర్కరారూపములే యైనను, నీభేద మెట్లుగలుగునో తెలియదు.

మొత్తముమీద అపక్వ మధురాహారపదార్థములను దినదలచుచో పండ్లే యుత్తమము. వాని యభావమున తేనెగాని, చెరుకురసముగాని పుచ్చుకొనవచ్చును. పక్వాహారులు సామాన్యముగ బెల్లమును వాడవగును. చక్కరను సాధ్యమైనంతవరకు వర్జించుటయే యుత్తమము.

## ౧౦. మాంసాహారములు

లేకరికి మాంసాహారపదార్థముల యనుభవము లేకపోవుటచే వీనినిగురించి వ్రాయుట కర్హత లేకపోయినను, ఇంతవరకు వివరింపబడిన యాహారద్రవ్యములతో పోల్చి చూపుటకుగాను, వీనినిగూర్చి ఇతరుల పరిశోధనల ననుసరించి కొన్ని విషయములు నిచట తెలుపదగును.

ఈక్రింది పట్టికలో కోడిగ్రుడ్లయొక్కయు, చేపలయొక్కయు, కొన్ని జాతులమాంసములయొక్కయు సంఘట్టనము చూపబడెను.

1 ఔన్సులో గల పరిమితి గ్రాములు

| | మాంసకృత్తు | చమురు | కర్బనోదజనితములు | [illegible] | [illegible] | [illegible] |
|---|---|---|---|---|---|---|
| 1. కోడిగ్రుడ్లు | 3.79 | 2.97 | | | 42 | |
| 2. చేపలు (సముద్రములోనివి) | 5.32 | 3.70 | | | 55 | |
| 3. ,, (మంచి నీటిలోనివి) | 5.50 | 1.15 | | | | |
| 4. గొర్రెమాంసము | 5.97 | 1.98 | | | 42 | |
| 5. గోమాంసము | 6.20 | 2.05 | | | 43 | |

షరా:—1. విటమిను ఎ. మధ్యమము, బి. హెచ్చు. సున్నము, స్ఫురము, ఇనుము మూడును హెచ్చుగ గలవు.

2. విటమిను ఎ. హెచ్చు, బి. స్వల్పము. స్ఫురము హెచ్చు ఇనుము స్వల్పము.

3. విటమిను బి. స్వల్పము. ఇనుము స్వల్పము. స్ఫురము హెచ్చు.

4. విటమిను బి. స్వల్పము. ఇనుము, స్ఫురము మధ్యమము.

5. విటమిను బి. స్వల్పము, ఇనుము హెచ్చు, స్ఫురము స్వల్పము.

మాంసాహారద్రవ్యములలోని ముఖ్యద్రవ్యములు మాంసకృత్తులు, చమురు. ఇందు కర్బనోదజనితములు శూన్యము. ఇందలి మాంసకృత్తులు శాకాహారద్రవ్యములలోని మాంసకృత్తులకంటె సులువుగ సమీకరణము లగునని కనిపెట్టబడెను. మాంసాహారములలోని కెల్ల గ్రుడ్లు మిగుల అనుకూలమయినవిగ నెంచబడుచున్నవి. ఇందు స్వచ్ఛమగు ఆల్బుమెను విస్తారముగ నుండుటచే సులభముగ వంటబట్టును. ఖనిజ ద్రవ్యములు

కూడ మెండుగ గలవు. కొంతమంది శాకాహారులు కూడ, గ్రుడ్లయందు జీవము ధాన్యాదులందువలెనే అంకురరూపమునమాత్రమే యుండుటచే వాని నాహారముగ నుపయోగించుటవలన జీవహింసాదోషము ధాన్యాదులను వండితినుటకంటె హెచ్చుగ లేదని సరిపెట్టుకొని వీనిని దినుచున్నారు. జీవహింసావిషయ మెట్లున్నను క్షయ మొదలగు వ్యాధులచే నీరసించిన వారిని స్వాస్థ్యతకు దెచ్చుటకు గ్రుడ్లు మిగుల నుపయోగకారులుగ నున్నవి. వీనిని పుచ్చుకొనుట నిష్టములేనివారు, పాలమీగడ తరకను నుపయోగింపవచ్చును. కంది, పెసర మొదలగు పప్పుదినుసుల కట్టు, వానితో మరిగించిన నీరుకూడ నుపయోగింపవచ్చును. వ్యవసాయదారులు హెచ్చుగ గ్రుడ్లను పెట్టు రోడ్ ఐలండు రెడ్సు (Rhode Island reds) మొదలగు మంచిజాతులను పెంచుకొను వ్యాప్త మంతగా లేకయే, దేశమునందు గ్రుడ్ల యుత్పత్తి హెచ్చయి, వానిని తినువారి యారోగ్యమునకు తోడ్పడును.

చేపలు మాంసాహారములలో మిగుల విరివిగ (ముఖ్యముగ సముద్రప్రాంతములందు) దొరకును. వీనిని తాజాగాను, ఎండించియుకూడ నుపయోగింతురు. ఓఢ్రదేశమున వీనిని విశేషముగ నన్నిజాతుల వారును తిందురు. అచట పాడి తక్కువ. అందువలన గలుగు లోటు బహుశః వీనిని తినుటవలన తీరుచుండు నని తోచును. ముఖ్యముగ పాలనుండివలెనే వీనినుండికూడ విటమిన్ 'ఏ' హెచ్చుగ లభించును.

గొర్రెలు, మేకలు, పసువులు మొదలగు జంతువుల మాంసము జనసామాన్యమున కంత విరివిగ లభింపదు. ప్రత్యామ్నాయముగ దినదగిన శాకాహార ద్రవ్యములు విరివిగను, చౌకగను దొరకును. కావున అలవాటుపడుటవలన గలుగు జిహ్వాచాపల్యమును తృప్తిపరచుటకు తప్ప వీనికొరకంతగా ప్రయాసపడవలసిన యగత్యము లేదు. మరియు నొక్కొకప్పుడు మాంసమున కొన్ని హానికర ద్రవ్యము లుండుటచే తినువారి యారోగ్యమునకు హానియు, ప్రమాదమును సంభవింపవచ్చునని కొందరందురు. కావున సాధ్యమయినంతవర కిదివర కలవాటుపడినవారయినను మాంసాహారమును మానుట సమంజసము. శరీరమునకు వలయు మాంసకృత్తులను, ఖనిజములను లభించునట్లు శాకాహారము నేర్పరచుకొనుచో మాంసాహారమును దినకయే ఆరోగ్యమును, బలమును కాపాడుకొనవచ్చు ననుటకు సందేహము లేదు.



# ఐశ్వర్యభావము

రెండవభాగము

## వృత్తినిర్ణయము

జీవితరేఖలో బుట్టి యూర్ధ్వముఖముగ బోవు రేఖ శుభచిహ్నమని గత వ్యాసములో వ్రాసియున్నాను. ఆజీవిత రేఖలో బుట్టిన యూర్ధ్వరేఖ నాలుగువిధముల బోవచ్చును. (చూ. పటము ౧.) అందు మొదటిది



పటము ౧

చూపుడువ్రేలిక్రిందకు బోవు రేఖ. అనగా జీవిత రేఖలో బుట్టిన ఊర్ధ్వరేఖ గురుస్థానములోనికి బోయి ఆగిన, అందువలన ఆజాతకునకు 1. ప్రకృతియందు ప్రేమ, 2. గౌరవము, 3. మతము, 4. నాయకత్వము, 5. ఆశ, యీ గుణములలో అభినివేశము గలుగును. ఆరేఖవలన మానవునకు వాంఛ, లేక కోరిక యెక్కువగా నుండును. అది ముఖ్యలక్షణము. అది మానవున కుండితీరవలసిన లక్షణము. కోరిక లేనిమానవు డేకార్యమును చేయుట కుత్సహింపక ఎల్ల వేళలయందును కలిగిన దానితో తృప్తిపొంది యూర్జింపవలెనను నుత్సాహము అడుగంటుటచే జీవితమును అభివృద్ధిపఱచుకొనక భగ్నము గావించుకొనును. కోరికలేని మానవు డేకార్యమును జేయుటకు బూనుకొనడుగదా! కావున ఆరేఖ బలవత్తరమైన కోరికను నిరూపించును. ఇక ఆకోరిక యెట్టిదియో నిరూపింతును.

## చేయి: అందలి భాగములు

చేయి మూడు భాగములుగ భాగింపవలెను. (1) వ్రేళ్లు, (2) శిరోరేఖకు పైభాగము, (3) మణికట్టునుండి శిరోరేఖక్రింది వఱకుండుభాగము. (చూ. పటము ౨.) చేయి యీ మూడుభాగములుగ విభజించుకొనవలెను. ఇందొకటవ భాగము మానసిక శక్తిని, రెండవ



పటము ౨

భాగము వ్యావహారికశక్తిని, మూడవభాగము శారీరకశక్తిని నిరూపించును. వ్రేళ్లు పొడుగుగ

నున్న ఆలోచనశక్తికి సంబంధించిన జీవితమును, రెండవభాగములోని గ్రహస్థానములు మెత్తుగనున్న వ్యాపార విషయక జ్ఞానమును, మూడవభాగము మెత్తుగనున్న వ్యవసాయాదిక లక్షణములును గలిగియుండును. మానసికశక్తిపై నాధారపడువానికి సాధారణముగ నరచేతిలోని చర్మము మృదువుగ నుండును. రెండవలక్షణమైన వ్యాపారికజ్ఞానానికి అంతకంటె కొంచెము దళసరిచర్మము గలిగి కొంచెము గట్టితనమును కలిగియుండును. శారీరసంబంధమైన జీవితమున జీవించువారికి అరికాలులోని చర్మమువలె దళసరిగ, మోటుగ నుండును. ఈమూడుభాగములలో నేదప్రాముఖ్యముగ నున్న మానవుడాసంబంధమైన జీవితమును జీవించును. తిరిగి ఇందలి సూక్ష్మవిషయమును గ్రహించుటకు వ్రేళ్లను తిరిగి కణుపున కొక్కభాగము చొప్పున మూడు భాగములుగ భాగింపవచ్చును. అట్లయిన బొటనవ్రేలిని విడిచిన, మిగిలిన నాలుగు వ్రేళ్లకును పన్నెండుభాగములు కదా! బొటనవ్రేలికి రెండుకణుపులు.

వ్రేళ్లు : భాగములు

బొటనవ్రేలు రెండుభాగముల తీసికొనిన మొదటిగోరుదగ్గర కణుపు దీర్ఘముగా నున్నచో మనోనిశ్చయ మెక్కువగ నుండును. ఆజాతకునకు ప్రధానలక్షణములు మనస్థైర్యము, మనోనిశ్చలత, పట్టుదల. రెండవ కణుపు పొడవుగ నున్న తర్కము, వాదము నందు ప్రజ్ఞ యెక్కుడుగనుండును. చూపుడువ్రేలులోని మొదటికణుపు భాషాపాండిత్యము, మతమునం దభినివేశము గన్పర



పటము ౩

చును. రెండవకణుపు వ్యావహారికజ్ఞానములో నాధిక్యత. మూడవకణుపు శరీరసౌఖ్యాలంపటత నిరూపించును మధ్యవ్రేలి మొదటి కణుపు, అనగా గోరుండినకణుపు యెక్కువ పొడుగుగా నుండినచో మంచి ఆలోచన, మూఢవిశ్వాసము, మంత్రశాస్త్రాదికములందు విశ్వాసము, రహస్యశాస్త్రములు అనగా జ్యోతిషము, కనికట్టు, మెస్మరిజము మొదలగువివిధశాస్త్రములయం దభినివేశము గలిగియుండును. రెండవకణుపువలన తోటలు, వ్యవసాయము, శాస్త్రపరిశోధన, రసాయనశాస్త్రము, ప్రకృతిశాస్త్రము, చరిత్రలు, గణితము వీనియందు మంచి ప్రవేశము. మూడవకణుపు పెద్దదిగనున్నచో అట్టివాడు ఆర్థికశాస్త్రవేత్త యగును. ధనమును ఆర్జించి, నిలువజేయు పిసినిగొట్టగును. ఉంగరపువ్రేలి మొదటికణుపు పెద్దదిగనున్నచో లలితకళలయందు ప్రజ్ఞత. రెండవకణుపువలన విమర్శనము. మూడవ కణుపువలన డంబా

చారము గలిగి యుండును. చిటికెన వ్రేలి మొదటికణుపు పొడువుగనుండినచో వాక్సామర్థ్యమును, ఉపన్యాసధోరణిని గలిగియుండును. అట్లే వ్యాసములుగూడ వ్రాసి మంచి వ్రాతగా జనిపించుకొనును మధ్యకణుపు పొడవుగా నుండుచో శాస్త్రపరిశోధనావిషయకజ్ఞానమును బాగుగా కలిగియుండును. మంచివైద్యుడుగ, న్యాయవాదిగ, లేక శాస్త్ర పరిశోధకుడుగ నుండును. మూడవ కణుపు పొడవుగనుండిన మంచి వ్యవహారజ్ఞానమును గలిగిన వ్యాపారస్థు డగును. ఈపైన జెప్పిన పదునాలుగు లక్షణములను గుర్తునందుంచుకొనవలెను. వీనిలోనుండి కొన్ని యుదాహరణములు నిరూపింతును

న్యాయవాదవృత్తికి

బొటనవ్రేలిలో రెండవకణుపు పొడుగుగను, ఉంగరపువ్రేలి నడిమికణుపు, చిటికెనవ్రేలి మొదటి రెండుకణుపులును పొడవుగ నుండవలెను. న్యాయవాదవృత్తికి కావలసినవి తర్కము, విమర్శ, శాస్త్రము, వాగ్ధాటి కదా. ఆనాల్గిటిని చూపుకణుపులు పొడవుగ నుండుచో న్యాయవాదవృత్తి నవలంబించును

ఉపాధ్యాయవృత్తికి

చూపుడువ్రేలిలోని మొదటి కణుపు, మధ్యవ్రేలిలోని మధ్యకణుపు, చిటికెనవ్రేలిలోని మొదటికణుపు బాగుగా నున్నచో భాష, శాస్త్రాదికము, వాగ్ధాటి కలిగిన ఉపాధ్యాయు డగును.

ఇంజినియరింగునకు

చిటికెనవ్రేలి మధ్యకణుపు, మధ్యవ్రేలి మధ్యకణుపు పొడవుగ నుండి వ్రేళ్లు గోళ్ల ప్రక్క నుబికి లావుగ నుండి చేయి అతి మెత్తగ నుండకుండ కొంచెము బిరుసుదనమును గలిగి శుక్రచంద్రస్థానములు బలిసి యున్నచో అట్టివాడు యంత్రనిర్మాణకర్త, లేక ఇంజనియ రగును. ఇట్లేవిషయమును నిర్ణయించుకొనవలెను.

వ్రేళ్లు : వానిజాతులు

వ్రేళ్లు భిన్నజాతులను గలిగియుండును. కీరో మొదలయిన కొందరు సాముద్రిక శాస్త్రవేత్తలు చేతిగూకారముపై నెక్కువ యాధారపడుదురు. బెనహాము మొదలయిన



పటము

శాస్త్ర వేత్తలు గ్రహస్థానముల మీదనే యాధారపడుదురు. చేతిలోని ఐదువ్రేళ్లను నొకేజాతికి చెందియుండ నక్కరలే దనియు, ఒక్కొక్కవ్రేలు ఒక్కొక్కజాతికి చెందియుండ వచ్చు ననియు, అంతమాత్రముచే చేయి యంతయు నొకేజాతికి చెందకపోదనియుకూడ వారు చెప్పిరి. మనము వ్రేళ్లు, వానిజాతులు ముఖ్యముగ తెలిసికొనినచో చాలా విషయ

ములు తెలిసికొనగలుగుదుము. వ్యక్తినిరూపణమున కీవిషయముగూడ సాయపడును. (చూ. పటము 3.) 1-వ వ్రేలు చివర కొనదేరియున్నది. అది యొకజాతి. 2-వ వ్రేలు చివర గుండ్రముగ అర్చివలెనుండును. 3-వ వ్రేలు కోణములుదేలినట్లు చివరయుండును. 4-వ వ్రేలు చివర గోరుమీాద ఏదో ఉండపెట్టినట్లు ప్రక్కలను లావుగా నుండును. 1-వ వ్రేలివలన సూక్ష్మమైన నిశితమైనబుద్ధి, అతిశీఘ్రముగ నే విషయము నైనను తెలిసికొనుట లక్షణములు. 2-వ వ్రేలివలన చిత్రకళయం దభిరుచి, అందమునం దభినివేశము. 3-వ వ్రేలు వ్యవహారదక్షత. సర్వ విషయములు చక్కగ గమనించి ప్రతివస్తువు యథాస్థానములలో నుంచి సరియైన లెక్కల జాగ్రత్తపెట్టి వ్యవహరించుట. 4-వ వ్రేలు నూతన వస్తువులు సృష్టించుశక్తి, చురుకుదనము, కష్టించి పని చేయుశక్తి. ఈనాలుగు విషయములు గూడ శ్రద్ధగ గమనింపవలెను.

ఈవ్రేలి వివరభాగములను బట్టి యీ క్రింది విధముగా విషయములు తెలిసికొనవచ్చును. 1 వ వ్రేలివలన విద్యాధికత, 2 వ వ్రేలివలన చిత్రకారత్వము, 3 వ వ్రేలివలన వ్యాపారము, 4 వ వ్రేలివలన సృష్టికర్త, లేక క్రొత్తవి కనిపెట్టు నేర్పరితనము మొదలైన గుణములు గలిగియుండును. నిధులు కనిపెట్టుటకు, వ్యవసాయమునకు, ఇంజనీయరుపనికి, తిరిగి పనిచేయవలసిన యుద్యోగమునకు, అనగా ఇన్స్పెక్టర్లు మొదలైన యుద్యోగములకు 4 వ రకము వ్రేళులుండవలెను. లెక్కల పనులు-ఆడిట్లు, కచ్చేరీలలో గుమాస్తాగా పనిచేయుట, వ్యాపారము జమాఖర్చుపద్దులు వ్రాయుట మొదలైనవానికి 3 వ రకము వ్రేళు లుండవలెను. కళ, చిత్రలేఖనము, నాట్యము, నాటకము, సంగీతము, చెక్కడము, కవిత్వము మొదలైనవానికి 2 వ రకము వ్రేలుప్రశస్తము. సూక్ష్మగ్రాహిత్వము సద్విద్య మొదలైన విద్యావిషయములకు 1 వ రకము మంచిది. ఈనాలుగు జాతులే ముఖ్యమైనవి. కాని యింకొక్క జాతికూడ కలదు. (చూ పటము ౪.) అది వేదాంత సంబంధమైనది. ఆ జాతివ్రేలివలన మానవునిలో తార్కికము పెరుగును. ఇదమిత్థమని యేకార్యమును చేయడు. ప్రతివిషయములోను అనుమానము, తర్కము. కావున నిది ప్రశస్తమైన జాతి కానేరదని తెల్పుదురు. వేదాంతులకుమాత్ర మద ముఖ్యమైనదే. ఐహికమునకు సంబంధించినంతవరకు అది మంచిది కాదు. ఇక గోళ్ల విషయమై కొంచెము తెలిసికొనవలెను.

గోళ్లు

గోళ్లవిషయమై తెలిసికొనవలసిన విషయములు, వ్యక్తికి సంబంధించినంత వరకు రెండు ముఖ్యలక్షణముల గుర్తురుగవలెను.

1. పొడుగు గోళ్లు.

ఈగోళ్లను బట్టి తెలిసికొనదగినవిషయములు: ఏవిషయమునైనను శీఘ్రముగ తెలిసికొన లేకపోయినను తెలిసికొనినంతవరకు

శుభ్రముగ, చక్కగ తెలిసికొనుశక్తి గలిగి యుండును. ప్రతివిషయములోను నిదానము, తొందరపాటులేకుండుట, సూక్ష్మవిషయములకు శ్రద్ధ, ప్రతివిషయములోను జాగ్రత్త మొదలగు లక్షణములు కలిగి యుండును. అట్టి గోళ్లు కలిగినవారు లెక్కలలో మంచి నిపుణులు. లెక్కల తనిఖీలలో గూడ వారుపనికివత్తురు వారు ఖర్చుపెట్టుప్రతిపైస్సా విషయమునకును జమాఖర్చు వ్రాయుదురు. ఒక దమ్మిడీతేడా కనుగొనుటకు రెండు మూడు దినములైనను వెచ్చించి నిజమును బైటికి తీయుదురు. ఇట్టివారికి వ్యవహారములలో స్థానము దొరికిన మంచిది. జమాఖర్చులు జాగ్రత్తగ వ్రాయుదురు. సర్వమును భద్రముగ చూతురు. తొందరపాటు, హడావడి యుండదు.

2. పొట్టిగోళ్లు.

ఇవి తొందరపాటును సూచించును. సూక్ష్మగ్రాహిత్వమునకుఇదముఖ్యలక్షణము. ప్రతి విషయమును సూక్ష్మముగ తెలిసికొని వానిని శీఘ్రముగ నాచరణలో బెట్టును. ఇట్టివారు సాహసముతో గూడిన జూదము వంటి వ్యాపారములో బాగుగ నికివత్తురు. వారిది సునిశితమైనబుద్ధి. అందుచే పెద్దసంగతులను తేలికగ తెలిసికొని దానివలన ప్రయోజనము పొందుదురు. వారి యాశ నేలపై నుండును. వేలకొలది పోయినను లెక్క సేయరు. వారికి జమాఖర్చు వ్రాయుటయన తలనొప్పి. ఇట్టివారు బాహుళ్యమైన వ్యాపారమును చేయువారగుదురు. ఇవి పొట్టిగోళ్లకు ముఖ్యలక్షణములు. కావున నీ రెండు విషయములునుగూడ జ్ఞప్తియందుంచుకొని వృత్తి నిర్ణయమును చేయవలెను.

వ్రేళ్ల పొడవులు

అరచేతిలోని వ్రేళ్లను పూర్తిగావిప్పి పూర్తిగ జాచవలెను. ఇందు మధ్యవ్రేలును ముందు తీసికొందము. (చూ. పటము ౫.) మధ్య వ్రేలి



పటము ౫

మొదటికణుపులోని సరిగ మధ్యభాగమునకు చూపుడువ్రేలును, ఉంగరము వ్రేలును గూడ సమముగ నుండవలెను. ఆమధ్యభాగమును దాటి యేవ్రేలును పొడుగుగ నుండరాదు. చిటికెనవ్రేలు ఉంగరపువ్రేలి మొదటి కణుపు క్రిందకు సరిపడి యుండవలెను. చూపుడు వ్రేలును, ఉంగరమువ్రేలును ఒక్కపొడవుననే యుండవలెను. దీనిలో ఏవ్రేలు పొడుగున్నను ఆవ్రేలి లక్షణములను పొందియుండును. అందు విశేషించి ఆనాల్గు వ్రేళ్లలోను పొడుగుగనున్న వ్రేలిలో పొడుగుగనున్న కణుపునుబట్టి వృత్తిని నిర్ణయింపవచ్చును.

# గర్వకారణము

జి. జాషువకవి

మాసిపోయినశిలాశాసనంబులమీఁద తరుణోజవోలి ప్రత్యక్షమగుచు
ద్రవిడభూపతులబాంధవ్యంబుకతమున ధ్వని సన్నగిలి సంగిదానవగుచు
రాటాలకడఁ గూనరాగాలు పచరించుపందుటవ్వాలనోట బయలువడుచు
ఇంటింటికడ బిచ్చ మెత్తు జంగములగుమ్మెటపాటలో మిట్టిమిట్టిపడుచు
పోలుపుదఱిగిననిన్ను సముద్ధరింప - రాజరాజులసభఁ గప్పురంబుతోడ
నందుకొన్నాఁడు తాంబూల మాంధ్రవాణి - శబ్దశాసనకవిలోకచక్రవర్తి.

శబ్దసాధుత్వంబు సాధింప భ్రష్టవాఙ్మయమహాటవి నెంత నవసినాఁడొ
ప్రబలదుర్భరకథాపదకంబుఁ గుదరింపఁ దలవాయ నెన్నాళ్లు తలఁచినాఁడొ
గౌతమీగంగ, యంగమునంటి దీవించి పనుప నేరేవున మునిఁగినాఁడొ
పసుపురాచిన తాళపత్రంబుఁ జేఁబూని శ్రీకార మేనాఁడు చెక్కినాఁడొ
తెనుఁగునుడికారమున సమ్మతీకరించి - భారతామ్నాయమునకు జీవములనూది
తేజముడిగిన స్వీయజాతీయరక్త - నాళములు పుల్కరింప, గానంబుసేసె.

వేఁగిరాజులసతీవితతికి గరువంపునడక నేర్పినది నన్నయ్యరచన
తెనుఁగుభాషాపద్మమునకు జాఱినవన్నె పట్టించినది కవిబ్రహ్మపలుకు
ప్రతిలేని యపవర్గపదపువంకకు రహదారితీసినది పోతనచరిత్ర
కంచుఢక్కల నోరు గట్టించి జయకేతనముల నెత్తినది శ్రీనాథుజిహ్వ
విజయనగరాధిపులభావేదికలకు - నందలంబులుమోయుమర్యాద గఱపి
తనివిఁగొన్నది మొన్న పెద్దనకవిత్వ - మాంధ్రభారతీ, నీతేజ మద్భుతంబు.

చెన్న రాజధానియందు 1934-వ సంవత్సరము జనవరి ప్రారంభము మొదలు మార్చి తుదివరకు గల మూడునెలల కాలమున ముద్రితములయి ప్రకటితములయిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక*

## ఆరోగ్యశాస్త్రము

ఆరోగ్యసామ్రాజ్యము—లక్ష్మీశారదలు

## ఐతిహాసికము

శ్రీమదాంధ్రమహాభారతము, వాల్యూం ౬ (ప్ర) పార్థసారధి, గుంటూరు.

## కథలు-ఐతిహాసములు-పౌరాణికములు

కుంతీమహాదేవి—బి. జానకిరామశర్మ
నాగకన్య—(ప్ర) వి. వెంకటరామశాస్త్రి, తాడికొండ
బాలవీరత్రయము—కె. లక్ష్మీనృసింహశాస్త్రి
రమణరామాయణము—సి. వెంకటరామయ్య
రామాయణసంగ్రహము—పి. విశ్వేశ్వరశాస్త్రి
వామన—డి. సీతారామరావు
శ్రీఏడుకొండల వెంకటాచలపతికథలు—(ప్ర) యం. వి. రుద్రయ్యనాయుడు, తిరుపతి.
సంగ్రహభాగతము—జే. శేషాద్రిశర్మ
హర్షుడు—కె. నరసింహాచార్యులు

## —కల్పితములు

కథాకావ్యము—త్యాగి
కాశీమజిలీకథలు, భా. ౧౨—యం. సుబ్బన్న దీక్షితకవి
పంగెండురాజుల కథలు—జె. వెంకటరాధాకృష్ణయ్య
సుజ్ఞానబోధిని—పి. శ్రీరాములు

## కావ్యములు

ఆంధ్రఋతుసంహారము— జి. వెంకటసుబ్రహ్మణ్యం, మదరాసు
కర్ణచరిత్ర భా. ౧—యం. వెంకటకృష్ణశర్మ
కవితాకాంతావిహారము—వి. రామసుబ్బరాయుడు
చండనృపాలచరిత్ర—డి. రాజశేఖరశతావధాని
మద్దుకత—యం. వెంకట
రాణాప్రతాపసింహచరిత్ర—డి. రాజశేఖర శతావధాని

## గణితశాస్త్రము

గణితప్రశ్నోత్తరములు—వి. జోసఫ్
తూనికలక్రయనిర్ణయజంత్రి—జె. వెంకప్పరావు
లఘుగణితము, బుక్ ౨—యస్. బాలకృష్ణ అయ్యర్

## గేయములు

ఆలపాటలు—(ప్ర) పి. వీరయ్య, మనిలీపట్టణము.
ఏకాంతసేవావిలాసము— యం. వెంకటరాయకవి
కీర్తనలు భా. ౨—వాసుదాసు
గీతములు—బి. అప్పారావు
గ్రామఫోనుపాటలు—(ప్ర) జే. సుబ్బరాయులు, కడప.
తెలుపుదగ్గరపాటలు-సంవాదములు — (ప్ర) జి. జగన్నాథం అండు సన్, రాజమహేంద్రవరము
త్రినాథుచరిత్ర, పదము—సి. కామేశం
నిర్గుణరత్నావళి —జి. వెంకటరామదాసు
పాట్టురుపేట శ్రీరామకీర్తనలు—కె. మంగమాంబ
భజనకీర్తనలు—వి. సుబ్రహ్మణ్యశాస్త్రి
భద్రాచలరామదాసుచరిత్రము— (ప్ర) వరద రాజులు మొదలియారు, మదరాసు
మస్తాన్‌మహిమ—జి. శారదాదేవి
విచిత్ర నూతనరంగూనుకీర్తనలు, హాస్యపు పాటలు— ఇ. వీరన్న
వేదాంతసంకీర్తనము—యం. వెంకటనాగభూషణం
శశగోపసారామృతము—కే. మాధవదాసు
శివరామకృష్ణభజనామృతము—భద్రమాంబ
శ్రీకృష్ణగోవిందనామము లనే శ్రీకృష్ణలీలలు — పి. మంగమాంబ
శ్రీకృష్ణలీలాతరంగిణి—నారాయణతీర్థ

* ఈపట్టికయందుగల సంకేతపదముల వివరణము: అ.—అధ్యాయము. అను.—అనువాదము, అనువాదకులు. ప.—పద్యము. ప్ర.—ప్రకాశకులు. భా.—భాగము. వ.—వచనము. సం.—సంపాదకులు. సటీ.—సటీకము.

## పరిశిష్టము

ఆంధ్ర నవీన సప్తమ వాచకము—సి. సూర్యప్రకాశ రావు, హెచ్. పేరయ్యశాస్త్రి
ఆంధ్ర పండిత భిషక్కుల భాషాభేషజము—జి. వి. రామమూర్తిపంతులు
ఆరోగ్య విషయిక వాచకము, తరగతి ౪—జి. వి. రామమూర్తి
కథాకావ్యము—త్యాగి
కార్మికసంఘము—(ప్ర) కార్మికసంఘము, అనంతవరము
కావ్యగుచ్ఛము, సెం. ౧—(ప్ర) కె. శ్రీనివాసరావు, విజయనగరము
కింటరు గార్టన్ కథలు, పాటలు, ఆటలు—(మిస్) కె. గోపాల అయ్యర్
కుంతీవాక్యములు—ఐ. సీతారామ సోమిదేవమ్మ
కృపాంభోనిధి—సి. లక్ష్మీనరసింహం
క్రొక్కారు మెఱుగు—వి. ఉమామహేశ్వరుడు, పి. సుబ్రహ్మణ్యాచార్యులు, యం. వాసుదేవమూర్తి
గాంధిమహాత్ముని దివ్యవాణి—(ప్ర) హరిజన సేవా సంఘము, నెల్లూరు
గాంధీగారం టే—రామనాథసుమన్
చిత్ర ప్రశంస—వి. రామసుబ్బరాయుడు
జన్మాంతరము—కే. వీరేశలింగం
తమలపాకు, పోకచెక్క సంవాదము—(ప్ర) జి. జగన్నాథం అండ్ సన్, రాజమహేంద్రవరము
తులాభారము—(ప్ర)యం. గంగరాజు, ఏలూరు
దేశపట్టు—యం పార్వతీశ్వరశాస్త్రి
దేవీవాచకము, తరగతి 3—డి. సూర్యనారాయణ మూర్తి, ఏ. శేషాద్రిశాస్త్రి, టి. తిరుమలరావు నాయుడు
నీలిపిట్టల పుస్తకము—గరల్ గైడ్ అసోసియేషన్, మదరాసు.
నౌకాభంగము—వి. వెంకటేశ్వర కవి
పూలమాల—యస్ రుక్మిణమ్మ
ప్రయోజకత్వము — (ప్ర) లేబర్ అసోసియేషన్, అనంతవరము
బాలశిక్ష—యం. యస్. హరిహరఅయ్యర్
బైబిలువాచకము, తరగతి ౨—(ప్ర) ఆంధ్రసువార్తజలికల్ లూథరన్ చర్చి, గుంటూరు
మనదేశపువాచకము, సెం. ౫, ౪—(ప్ర) సి. కుమారస్వామినాయుడు, మదరాసు.
మహాగారడీవిద్య—పీతాంబరయ్య
ముఖ్యాల్పనిబంధనలు—(ప్ర) దేవరెంకు చి. ఆలన్, నెల్లూరు.
రోగులకొరకైన విధులు, కాలనిర్ణయపట్టిక (ప్ర) సూపరింటెండెంట్, ఆరోగ్యవరము.
లోకజ్ఞానపాఠములు— డి. సత్యనారాయణ మూర్తి, యం. రాధాకృష్ణమూర్తి
శతావధానము—యస్. త్ర్యంబకరావు
శారదావాచకము, తరగతి ౫, ౪ — ఏ. జగన్నాథ రావు, వి. లక్ష్మీనృసింహశాస్త్రి
శాస్త్రపాఠములపై ప్రశ్నోత్తరములు, భాగం, ౫, ౪, ౬—యస్. సత్యనారాయణమూర్తి
శ్రీకృష్ణాశ్వాసము—యస్. కృష్ణమూర్తిశాస్త్రి
శృంగారపద్యములు—(ప్ర) కె. వీరవెంకయ్య, రాజమహేంద్రవరము
సామాన్యజ్ఞానము, బుక్ ౧— టి. వి. గణేశన్, పి. పద్మనాభన్.
సారస్వతవాచకములు, బుక్ ౧, ౨, 3, ౪ — జ. రంగారావునాయుడు, యం. వెంకటరత్నం
సాహిత్యమంజరి ౧, ౨—(ప్ర) పి. వి. సుబ్రహ్మణ్య శర్మ, పి. పద్మనాభశర్మ, కావలి.
సుధాలహరి—వై. సీతారామస్వామి
సౌందర్యమంజరి—కె. గోపాలరావు
స్మృతిప్రకాశము—పి. పార్థసారథి
హరిజననాయకుడు—యన్. జి. రంగ

## పారిశ్రామికము

అనుభవవర్ధస్తుపాకావళి— (ప్ర) కె. వరదరాజులు మొదలియారు, మద్రాసు.

## పురాణము

సూతపురాణము—టి. రామస్వామిచౌదరి

## భూగోళము

అనకాపల్లి తాలూకాభూగోళము— పి. అప్పయ్య
అమలాపురంతాలూకాభూగోళం— హెచ్. వెంకటేశ్వరులు, వి. సరస్వతమ్మ
ఉత్తర ఆర్కాడుజిల్లా భూగోళవిషయము — యస్. శ్రీనివాస అయ్యర్

ఏలూరుతాలూకా భూగోళము—(ప్ర) రామా అండ్ కో., ఏలూరు
చెన్నరాజధాని భూగోళశాస్త్రము—యం. రాధాకృష్ణమూర్తి
నరసరావుపేట తాలూకా జాగ్రఫీ—టి. నాగభూషణరావు, యం. హనుమయ్య
నెల్లూరుతాలూకా భూగోళము- ...కటేశ్వరులు, వి. సరస్వతమ్మ
ప్రపంచభూగోళము, భా. ౨—పి. సూర్యనారాయణ
భూగోళశాస్త్రము, బుక్ ౧—బి. వి. నరసింగరావు
రాజోలుతాలూకా భూగోళము—హెచ్. వెంకటేశ్వరులు, జె. సర్వభద్రం
రేపల్లెతాలూకా భూగోళము—యం.సూర్యనారాయణ
విజయనగరంతాలూకా భూగోళము—పి. అప్పయ్య

మతము—హిందు

పూర్వాచార్యసంప్రదాయద్వయాభిమతాష్టాదశభేద సంగ్రహః—(ప్ర) యం. రామచంద్ర ... మద్రాస్
వర్ణము—కే. వీరేశలింగము
శ్రీ రామావతారతత్త్వము, భా. ౫—జే. శేషాద్రిశర్మ

—ఇతరములు

ఆదివాసోత్సవసువిశేష వ్యాఖ్యానము — (ప్ర) (రెవరెండ్) చి. అలన్, నెల్లూరు
కై ...స్తవభజనకీర్తనలు—యన్. సుబ్రహ్మణ్యం
సుడిబత్తిమయికథ — (ప్ర) క్రిష్టియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు
తిరుసభయొక్క చరిత్రసంగ్రహము — (రెవరెండు) జి. జోసఫ్
మహమ్మదీయులకై కరపత్రములు — నెం. ౧-౧౦-౩. చ. జి. డి. యం. అడమ్స్
విమలజ్ఞానోపదేశములు—పి. నెలటి

వేదాంతము

అష్టాదశాధ్యాయగీతామృతము — (ప్ర) జే. పాపయ్యశెట్టి, మదరాసు
కందార్థము—హుస్సేన్ దాసు
గీతామృతము—యం. వెంకటరత్నము
గీతాసారము—కే. సీతమ్మ
జీవితరహస్యము—యం. వెంకటరత్నము
జ్ఞానామృతము—పి. రామకోటయ్య

భగవత్తత్త్వము—అభేదానందస్వామి
బ్రహ్మజ్ఞానబోధ—తిమ్మారెడ్డి
ముక్తి—వి. లక్ష్మయ్య
వైరాగ్యబోధిని—యం. పరంధామయ్య, కె. వెంకటకోటయ్య
శ్రీమదిహపరభ్రమరహిత షష్ట్యోత్తరశతి—కె. వీరయ్య
స్వయంజ్యోతి—యం. అచ్చమాంబ

వైద్యశాస్త్రము

అనుభవ వైద్యబాలశిక్ష—వి. కన్నయ్యదాస్
వస్తుగుణదీపిక—ఇ. వెంకటస్వామి

—వ్యాకరణశాస్త్రము

ఆంధ్ర లక్షణము—యు. సీతారామశాస్త్రి
సంధి పరిచ్ఛేదము—(ప్ర) ఆంధ్ర స్టూడెంట్సు, బోర్డు హైస్కూల్, ఉండి

శతకములు

కృష్ణశతకము—(ప్ర) కె. వీరవెంకయ్య, రాజమహేంద్రవరము
...వ నీతిశతకము- ...వి. డి. జాన్, సుందరరావు.
దశరథరామ శతకము- ...తి. రాములు
వనమాలిశతకము—ఏ. సంజీవయ్య
వెంకటేశ్వర శతకము—పి. సత్యనారాయణ
శతకరామాయణము—పి. సోమయ్య
శ్రీ కాశీ విశ్వనాథశతకము—ఏ. రాజేశ్వరకవి
శ్రీరామశతకము—యం. సీతాంబ
శ్రీ శరణార్థి సుందరేశ శతకములు—యస్. కుళ్ళప్ప

సారస్వతము

కవిత్రయకవితా విమర్శనము—జి. వెంకటసుబ్బరామయ్య
భారతీయ విద్యాచరిత్రము—యం. రామరావు
వ్యాసభాషాంతరీకరణ చంద్రిక—యం.శ్రీపతిశాస్త్రి

స్తోత్రము

దేశమాతృ...వము—టి. శివశంకరం
ప్రార్థనగీతావళి—(ప్ర) కే. నాగేశ్వరరావు, మద్రాస్
ముకుందమాల—కులశేఖరకవి
క్రమకాలధ్యానమాల—(రెవరెండ్) వెండోర్ ఫగ్

హరికథ

జయదేవచరిత్రము—యస్. నరసింహదాస్




## సాముద్రికశాస్త్ర గ్రంథములు*

సాముద్రికశాస్త్రమును వేలమువెఱ్ఱిగా పట్టుకొని వగులాడుచున్నదినము లివి. విద్యాధికులు మొదలుకొని, విద్యాగంధమయిన నెఱుగనివారివఱకు నీవెఱ్ఱి యీకాలమున బాగుగా తలకెక్కిపోయినది. ఇంచుమించుగ నాంగ్లభాషాపరిచయము గలవారందఱును కీరో, బెన్హాము మొదలగు సాముద్రికశాస్త్రవేత్తలు విపులముగా విస్పష్టముగా సచిత్రముగా నాంగ్లమున రచించిన పెద్దపెద్ద గ్రంథములను చదివి యింతయో యంతయో శాస్త్రపరిచయమును సంపాదించుకొనుచున్నారు. వీరును, వీరిసాయమున నాంగ్లభాషాపరిచయము లేనివారును తాము తలపెట్టు నెల్లకార్యముల విషయమునను, నిత్యకృత్యములయందలి ప్రతి స్వల్ప కార్యముల విషయమునగూడ, వాని జయాపజయముల నుసాముద్రికముద్వారా నూహించుకొని, తత్ప్రాప్తికయి యెదురుచూచుచు తహతహలాడుచుండు టలవాటయి పోయినది. ఈవేలమువెఱ్ఱిని పసిపట్టి సాముద్రికశాస్త్ర పరిచయముగలవా రనేకులు, జ్యోతిశ్శాస్త్రపరిచయమునుగూడ కొంత సంపాదించుకొని, తెలుగుదేశమున 'దుకాణము'లను తెరచుకొని, ప్రజలకు 'భవిష్యత్తు' ను అమ్మి ధనము నార్జించుకొనుచున్నారు. ఆంగ్లపరిచయము లేనివారు సొమ్మును చెల్లించి దానిని కొని, అట్లు సంపాదించుకొనిన 'భవిష్యత్తు' అనుభవమునకు రాగా నానందించుచున్నారు. రాకపోయిన విషాదమును చెందుచున్నారు. ఈ ఆనంద విషాదములు రెండును వీరికి వ్యయమూలకములే. ఈవిధముగ సాముద్రిక శాస్త్రము కొందరకు లాభకరమయినను, ఫలమునూట యటుండగా, చాలమందికి నష్టకరము నగుచున్నది. తెలుగున సాముద్రికశాస్త్రగ్రంథములు లేకపోవుటయే దీనికి ముఖ్యమయినకారణము. ఉన్నచో నింగ్లీషురాని వారు వానిని స్వయముగ జదివి వ్యయముపాలుగాకయే, ఇంగ్లీషువచ్చినవారివలె, తమ 'భవిష్యత్తు' ను తామే నిర్ణయించుకొనగలుగువారు.

తెలుగున సాముద్రికశాస్త్ర గ్రంథములు ప్రాచీనము లొకటిరెండుకంటె నెక్కువ కనుపడవు. అవియు నస్వతంత్రరచనములు; సంగ్రహమాత్రములు. శాస్త్ర పరిచయమును చక్కగా పొందుట కవి చాలవు. తెలుగు దేశమున సాముద్రికశాస్త్రము తెలియునని, ప్రాచీన పద్ధతి ననుసరించి చేతులు చూచి భవిష్యత్తును చెప్పువారు కొందరున్నారు; కాని వారిశాస్త్రజ్ఞానము గ్రంథాధ్యయనలబ్ధము కాదు. అనేకుల కది కులవిద్య. పెద్దలవలన, అనుభవమువలన నాజ్ఞానమును వారు పొందుదురు.

ఆంగ్లగ్రంథములను యథాస్థితముగ ననువదించి, ముద్రించుటయును వ్యయప్రయాస బహుళమగుకార్యము. కాన నందుల కెవ్వరు నింతవరకు తలపెట్టినవారుకారు. శాస్త్రముపయి నభిమానము విశేషముగ నున్నను దానికి తగినయట్లుగా తత్పరిచయ ప్రచారములు లేకపోవుటకు గ్రంథాభావమే కారణము.

ఆంగ్లరచనములను చదివి శాస్త్రపరిచయమును గడించుకొనినవారు కొందరిటీవల సాముద్రికశాస్త్రమున, ప్రత్యేకముగను, జ్యోతిశ్శాస్త్ర సమ్మిశ్రముగను, వ్యాసములను సచిత్రముగ రచియించి భారతి మొదలగు పత్రికలయందు ప్రకటించుచున్నారు. ఆ వ్యాసము లింగ్లీషు తెలియని తెలుగువారి కొకింత శాస్త్రపరిచయము కలుగుటకు, శాస్త్రమునెడ నొకమాత్రము నమ్మకము

---

* ౧. చేయి.
౨. హస్తనిర్మాణం.
3. పుట్టుమచ్చలు.

గ్రంథకర్త, ప్రకాశకుడు: పూడిపెద్ది వెంకటరావు, సాముద్రికశాస్త్రజ్ఞుడు, విజయనగరము.

కుదురుటకు పనికి వచ్చుచున్నవి. (జ్యోతిషమువలనను, సాముద్రికమువలనను పేర్కొనబడు ఫలములు సరిగా సంప్రాప్తములు కామిచే ననేకుల కాశాస్త్రములయందు విశ్వాసము లేకుకాబట్టి). ఇట్టిసమయమున, శాస్త్రమున పాండిత్యము, విశేషానుభవము గలవారు ప్రాచీన నవీన సంప్రదాయములను, ప్రాచ్య, పాశ్చాత్యసంప్రదాయములను, స్వానుభవమును సమన్వయించి విస్పష్టముగా సులభగ్రాహ్యముగా గ్రంథములను రచించి ప్రకటించుటావశ్యక మగుచున్నది. శ్రీ పూసపాటి వెంకటరావుగారీయావశ్యతను కనుగొని, అనేకులు పాశ్చాత్యసాముద్రిక శాస్త్రగ్రంథరచనకు తలపెట్టి ప్రకృత గ్రంథములను మూడింటిని రచియించి ప్రకటించినారు. ఈపుస్తకములలో నొక్కొక్కటియు సాముద్రిక శాస్త్రమున నొక్కొక్కయధ్యాయ మనవలెను. గ్రంథమంతయు నొక్క సంపుటముగ రచియించి ప్రకటించుటకు, ప్రయాసయేకాక, వ్యయమును నెతయో యగును. దానినిబట్టి గ్రంథమునెలయు పెరుగును. ఒక్కమారుగ నంత గ్రంథమునెల నిచ్చి గ్రంథమును కొనుట సర్వులకు ప్రాయికముగా సాధ్యము కాదు. ప్రత్యేక భాగములుగ నల్పమూల్యమునకును లభించునపుడు వ్యయభారము తోపదు. ఇది అమ్మువారికి, కొనువారికిగూడ మంచి పద్ధతి. ఈశాస్త్రమునందలి యితర భాగములను వేంకటరావుగారిట్లే రచియించి ప్రకటింపనున్నారట.

గ్రంథకర్త తానార్జించుకొనిన శాస్త్రపాండిత్యమును, అనుభవమును వినియోగించి యీమూడు గ్రంథములను రచియించినారు. వీనియందు విషయములు మనసున కెక్కునట్లు సులభమగు వ్యావహారిక భాషను వివరింపబడినవి. వీనిని చదివినవారికి శాస్త్రమందు జ్ఞానమునకంటె అభిరుచి, విశ్వాసము అధికముగ కుదురును. ఈగ్రంథములయందు కనుపడువిశేష మది! ఇవి ఇంక నుంచి రంజకముగా సుబోధముగా నుండవలెననిన ఆయా విధములగు చేతులను, వ్రేళ్లను, వానియందలి వివిధరేఖలను కనుపరుచు చిత్రము లుండవలెను. అపుడు వీని విలువ పెరుగును. ఈ పుస్తకములను మూడింటి నొక్కమారుగ నొకటిన్నర రూపాయకు, ప్రత్యేక (మొక్కొకదాని) నొక్కొక రూపాయకు నిస్తరట-అంచెకూలికలిసియే! విషయగౌరవమునుబట్టి విలువకును గౌరవ మేర్పడుచుండునుగదా!—గ. సు.

## బృందావనము

ఇది మున్నూటయేబది పద్దెముల చిన్న నవీన ప్రబంధము. ఇది తియ్యని తేటమాటల మూట. శృంగార రసము తొనకులాడు బంగారు కలశ. పరమ పావన భక్తికి భద్రపేటిక. ధర్మమర్మములకు ధర్మహర్మ్యము. నీతిబోధకు నిలయము. ఆంధ్రభాషామోహ కాభరణము. ఆంధ్రప్రచారిణీగ్రంథమాలికకు మేరుపుష్పము. రాజహంస (వేంకటపార్వతీశ్వర) కవులు కృతికర్తలు. కృతిపతి శ్రీపీఠికాపురయువరాజు. కృతినందిన శుభసమయము యువరాజ వివాహోత్సవ శుభసమయము. యువరాజునకొకయువరాజు జనించిన భాగ్యముచూచి యుత్సాహాతిశయమున యువసంవత్సరము గాటకుండగ నేటి కిది వెలువడినది. ఈప్రబంధరాజము కృతినందిన సమయ విశేషమున నిది కృతిపతికృతికర్తలకు శుభావహమగు గాక. ఇది లోకమున కానందావహము.

బృందయను గోపకన్య భక్తివిశేషమునను, ప్రేమ విశేషమునను ప్రసన్నునిగావించికొనిన కృష్ణుని పెండ్లాడుటకై తపస్సుచేసినవనము బృందావనము. ఆ తోట పేరనే ప్రబంధనామము వాడిరి. దాని ననుసరించియే ప్రబంధమందలి భాగములకు స్థితిభేదములనుబట్టి అంకురారోహణము, అభినవకోరకము... ఆనంద ఫలము మొదలగుపేర్లు పెట్టిరి. ఇది యెంతయో మనోహరమును, సుచితమును. బృందగుణ శీలములను పోషించునపుడు కవుల పదసుకుమారత, భావగాంభీర్యము, ప్రకృతి పరిశీలనము, పూర్వసంప్రదాయము, అభినవశైలి సుస్పష్టమగుచున్నవి. శారదామాధవీనామములు గల చెలికత్తెలతో బృంద తెలుపు కృష్ణగుణవిశేషములు, దశావతారాదివర్ణనలు, తనసంకల్పము, తన విరహస్థితియును, "గొల్లకలాప" మనెడి వీధినాటకములోని భాగవతపు కస్తును జ్ఞప్తికి దెచ్చుచున్నది. ఇందు దశావతారాదివర్ణనము సుకుమారతరము. బృందభక్తిని పరిశీలింప వచ్చిన ధర్ముని చరిత్రము బృందభక్తి ప్రభావమును తెలుపుట

ఉపయోగించినను మనుష్యాతీతశక్తిని చూపుట మొట్ట మొదటి భాగమందుగలిగిన తీపికి కొంత రుచిభేదము గలిగించుటకుఁ గారణమైన దేమో!

భక్తిప్రేమరసములు చిప్పిలుచున్న చక్కెర లప్పలో చిన్నపూఁదేని పలుకులో యనఁదగిన పద్యముల రుచి ఆస్వాదించినవారికే తెలియును.

ఈ బృందావనమునఁ జొరఁబడినవారికి నోటి కోలఁది తృప్తితీఱ ననుభవింపఁదగిన ద్రాక్షలు గుత్తులు గుత్తులు లభించును. ఆ గుళికలు చప్పరించి మ్రింగుటయే. ఉమ్మివేయఁదగిన గింజలు లేవు. కొలగానుండు తీపిపండ్లు. కొన్ని సుంప్రని చినిచిన్నిపండ్లు. ఒకవైపున కొన్ని యనఁటిగెలలు. కొన్ని పనసతొనలు. ఈ తొనల రుచిగ్రహించుట మొదట ముళ్లుముళ్లుగా నుండు తొక్క తొలఁగించి యేసెలలోనున్న తొన తీసికొని తిన్నవారికా రుచికి మితిలేదు. అవి సర్వరసములను మించిన భక్తిరసముతో భగవద్గుణానుభవమును వ్యక్తపఱచుచున్నవి. ఒకొక్కచోట దొరకు తేనెపెఱలు ఈఁగలబాధ లేనివే. ప్రబంధలక్షణములలో ముఖ్యము లిందుఁగలవు. ఉత్తమకావ్యలక్షణమగు ధ్వని యీ చిన్న కావ్యము తఱుచు తలయెత్తి చూపుచున్నది. పైవిషయములు బృందావనమునఁ బ్రవేశించువారికి సులభములు. అయినను నోరూరఁజేయునవి కొన్ని రుచి చూపుట తగును.

సీ. చిగురుటాకులఁ జూచి చిన్నెవన్నెలఁ జూచి
    పూవుగుత్తులఁ జూచి తావిఁ జూచి
దోరపండులఁ జూచి తీరు తీయముఁ జూచి
    చిలుకబోదలఁ జూచి చెలువుఁజూచి
ముక్కుపేరులఁజూచి సొంపు పెంపులఁజూచి
    చందమామను జూచి సొరుఁ జూచి
చలువకాల్వలఁ జూచి కలకలంబులఁ జూచి
    కొండకోనలఁ జూచి కొమరుఁజూచి
యొడలు పులకింప నానందపడుట యేలొ
యొడఁద గంపింపఁ జడిముడిపడుట యేలొ
తెలిసి తెలియనితనమునఁ దిరిగి తిరిగి
విభునిసన్మూర్తిఁ గనలేక వెఱ్ఱియగుచు. ౧౧౫

ఉ. ఆతఁడు మెచ్చి చూచినటు
    లాతఁడు సత్కృపఁ బల్కరించిన
ట్లాతఁడు సుప్రసన్నదర
    హాసముఖుం డయి చేర వచ్చిన
ట్లాతఁడు ప్రేమఁ గోమలక
    రాంఘ్రి గైకొని చేరఁదీసిన
ట్లాతరళాయతాక్షి హృద
    యంబునఁ గన్గొని మేనుజల్లనన్. ౨౨

క. నూతనకిసలయ నిత్యా ని
నూతనభావములు మెఱయ నూతనగతులన్
నూతనకళలన్ వికచా
బ్జాతనయన నెలయుచుండె భక్తినియుక్తిన్. ౧౧౧

సీ. ఐశ్వర్యమును గోరు ననుకొంటివో యేమొ
    యాసల నడఁగింపు మంతె చాలు
అర్థాసనము నేఁడు ననుకొంటివో యేమొ
    యాసుసలకడ నిల్పు మంతె చాలు
అపవర్గ మాశించు ననుకొంటివో యేమొ
    యజ్ఞాన మెడలింపు మంతెచాలు
అమృతత్వ మర్థించు ననుకొంటివో యేమొ
    యభవత్వ మిప్పింపు మంతె చాలు
తిరుగులేనిదాత దొరకెఁగదా యంచుఁ
బలుకుఁ బగని దగుఁగఁగల నయ్యా
ఎదుటఁ బడుము చాలు నీకోరికల కేమి
ప్రణయగుణసనాథ! ప్రాణనాథ! ౧౫౬

ఉ. చిత్తము చెంగలింపఁ దమిఁ
    జెందినకోరుకు లగ్గలింపఁ జెన్
దత్తర మావరింప చెడి
    దంబుగ నూర్పులు సందడింపఁ గ్రొ
మ్మెత్తని మేనుదీఁగ విరి
    మించువలెన్ బులకింపఁగా బయల్
హత్తి కవుంగిలించి చెలి
    యాఁపఁగ దాఁపఁగరాని ప్రేముడిన్. ౧౭౨

గీ. అంచతెక్కల వెన్నెల లద్దువాఁడు
చిలుకతెక్కలఁ బచ్చలఁ జెక్కువాఁడు

నెమ్మి తెక్కలం జిత్రముల్ నించువాడను
నన్ను నేవేళం గాంచుచున్నాండనుసుమ్ము! ౨౨౪

ఉ. కట్టుఁబలేనియంబుగులం
కట్టెగం, దారకలన్ గ్రహంబులన్
గట్టెగం, గోటికోటిభువ
నంబుల నాకసమందు వ్రేలఁగాం
గట్టెగం జాలుసూత్రములం
గల్పనఁ జేసినసూత్రధారి, తా
మట్టెలు గట్టి మోదమున
మంగళసూత్రము గట్టె బ్రాంచకున్. ౩౨౩

ఇట్టి ప్రబంధములను రచించు కవుల నాదరించి ఆంధ్రభాషాపోష కమూర్ధాభిషేకమును గల్పింపఁ జేయు శ్రీ పీఠికాపురపురాజుగారి సాహితీ సాంప్రదాయిక మెంతయుం గృతజ్ఞత జూపదగినది. మన వేంకటపార్శ్వ తీశ్వరరాజహంస కవు లిట్టి ప్రబంధరాజములు రచించి లోకాదరణము నొందె ధన్యులగుదురుగాక. వ. అ. వా.

శ్రీపాద కృష్ణ

## ఆంధ్రహర్ష చరిత్ర - పూర్వభాగము

నాలుగాశ్వాసముల ప్రబంధము. గ్రంథకర్త శ్రీమాన్ కోమాండూరు కృష్ణమాచార్యులుగారు ఆంధ్రగీర్వాణ భాషాధ్యాపకులు, ఆంధ్రక్రైస్తవ కళాశాల, గుంటూరు. క్రౌను ౩౨+౧౬ పుటలు. వెల రు. ౧-౪-౦.

సంస్కృతమున భట్టబాణుండు రచించిన హర్ష చరిత్ర కిది ఆంధ్రానువాదము. మూలము ప్రౌఢమగు గద్యకావ్యము. భాషాంతరీకృతి ప్రౌఢమగు పద్య ప్రబంధము. ఇదివరకు మూలమున కొక గద్యానువాద మాంధ్రమున వెలసినది. పద్యానువాదములలో ఇదియే ప్రథమము.

దీనిని రచించిన శ్రీ కృష్ణమాచార్యులుగారు 'ఆంధ్రవిద్వల్లోకమునకు అపరిచితులుకారు. వీరు సనాతనసంప్రదాయానుసారముగా, చాలావరకు స్వయంకృషివల్లనే, సంస్కృతాంధ్రభాషావాఙ్మయములలో అసామాన్య[illegible]ము సంపాదించినారు. ఆంగ్లకళాశాలలలో ఆంగ్లభాషాపాండిత్యమూ, పాశ్చాత్యసారస్వతపరిజ్ఞానమూ అలవర్చుకొన్నారు. 'సాహితీ సమితి' సభ్యులుగా ఉండి నవ్యసాహిత్యమునకు దోహద మిచ్చినవారిలో ఒకరయినారు.' ఇట్టి సర్వతోముఖ పాండిత్యముకల శ్రీ ఆచార్యులుగారి కవిత్వము ప్రశస్తమయి యుండునని వేరుగ చెప్పనక్కరలేదు.

శ్రీ కృష్ణమాచార్యులుగారు చేసినది భాషాంతరీకరణమే యయినను మూలమునందలి తుచ్చలు తప్పకుండ ఆంధ్రీకరింపక రసానుగుణముగ ఉచితములగు మార్పులనొనరించి స్వేచ్ఛనుకూడ వినియోగించి అనువాదమునకు అందచందముల గూర్చినారు. ప్రబంధము ప్రౌఢశైలి, సాంస్కృతికప్రయోగములతోడను, దీర్ఘసమాసములతోడను కూడుకొనియున్నను, రచన చాలసరళమయి, శ్రావ్యమయి, ధారాశుద్ధికలిగి పాఠకుల కెంతయు ఆమోదమును గూర్చుచున్నది. కవిగారి పద్యములలో చాలవరకు శ్రీనాథుని పోకడలు కలవు. మనుచరిత్రల రచయితలమార్గములును అందందు గోచరించుచుండును.

ఇక్కాలమున వెలువడు పద్యవాఙ్మయమున నిట్టి రచనలు చాల అరుదు. ఇయ్యది విశ్వవిద్యాలయమువారిచే కళాశాలావిద్యార్థులకు పఠనీయగ్రంథముగ నిర్ణయింపఁబడినది. దేశభాషావాఙ్మయములను పెంపొందింపఁదలచు విశ్వకళాపరిషత్తువా రట్లొనర్చినచో, వారి యత్నము కొంత సఫలమగును; శ్రీ ఆచార్యులుగారి ప్రయత్నమును సఫలమగును; వారికి ద్వితీయభాగరచనమున ఉత్సాహమును కలిగించును.

అచిరకాలముననే ఆచార్యులుగారు దీని ఉత్తర భాగముకొఱకు ఎదురుచూచు ఆంధ్రులకు, ఆంధ్రభాషావాఙ్మయాభిమానులకు తల్లాభమును కలుగజేయుదురుగాక.

సీ. జంభారిభుజశిలాస్తంభసంస్తంభన
ప్రౌఢ మెవ్వని తపఃప్రాభవంబు,
అలఘుపులోమజాదైత్యాంగన్యా శిఖిశిఖా
కల్ప మెవ్వని రోమకలుషదృష్టి

సకలసురాధిరాణ్మకుటరత్నచ్ఛటా
భాసురం బెవ్వాని పదయుగంబు
చతురంతవసుమతీ శక్రుండు శర్యాతి
తనయ నెవ్వానికి ధారవోసె
గీ. విమల సోమరసాస్వాద విస్ఫురకంఠ
సురభిమస్యగ్రకంబు నేసుద్ధమూర్తి
పంక్తిపావనులను జేసి ప్రాయమందె
నతఁడు సామాన్యుఁడే చ్యవనాఖ్యమౌని.
(ఆశ్వా. ౧, ప. ౬౬.)

సీ. బాలాంధకారంబు భాస్వత్స్వరూపంబు
హారియైయొప్పె నీ యతివయందు
పుండరీకముఖంబు పొలుపారు హరిణాక్షు
లింపులైపొలిచె నీ యింతియందు
తరుణాతపప్రభాధరమును సముచితో
సముఁజూపనొప్పె నీసకియయందు
గలహంసరవమును గ్రమ పయోధరతో
న్నతియుఁ గప్పట్టె నీనారియందుఁ
గరభోరుయుగ్మంబు గజరాజగమనంబు
సుందరమయ్యె నీసుదతియందు
సుకుమారభావంబు సుస్నిగ్ధతారక
త్వము పెంపుగాంచె నీతన్వియందు
గీ. కమలకోమలహస్తముల్ కఠినశైల
పృథునితంబమునొప్పె నీవలదియందు
ధరణిలోన విరుద్ధపదార్థములకు
నబల నేకాశ్రయంబుగా నజుఁడొనర్చె.
(ఆశ్వా. ౧, ప. ౭౭.)

పయిపద్యములందు పూర్వకవుల పోకడలు గానవచ్చుచున్నవి. ఇట్టి వింకను చాల కలవు.

పద్యములు బహుళదీర్ఘసమాసములు కలిగియున్నను సుగ్రాహ్యములై కవితాప్రవాహమున రసవాహినిని మేళవింపఁ జేయుచున్నవి. ఇందులకు మీది పద్యములే తార్కాణలు. ఇంకొక్క ఉదాహరణము:

ఉ. అంతట నంశుమంతుఁ డుద
యాచలకూటము లాక్రమించి దు
ర్దాంతమయూఖమండలని
తాననితాంతహుతాశనచ్ఛటా
క్రాంత దిగంతుఁడై గగన
గహ్వరమంతయు నాక్రమించి యం
తంతఁ గ్రమంబునన్ బరిణ
తారుణకాంతులనొప్పె శాంతుఁడై.
(ఆశ్వా. ౧, ౭౩.)

రసానుగుణములను శబ్దాలంకారములను కూర్చుటలో శ్రీ ఆచార్యులుగారు ఆరితేరినవారు. అందులకు మీఁది యుదాహరణమే చాలును.

వేంకటరమణయ్య

## స్వీకారము

### ౧. సత్యనారాయణస్తవరాజము

గ్రంథకర్తలు: కృష్ణకుమార మిత్రులు, జటప్రోలు సంస్థానము. వెల రు. ౦-౨-౦.

### ౨. బ్రహ్మపత్రోపాఖ్యానము(పొగాకు చరిత్ర)

గ్రంథకర్తలు: వాజపేయయాజుల రామసుబ్బారాయఁడు బి. ఏ., వేంకటనారాయణ.

వెల ౦-౪-౦.

### 3. వైజయంతి

శ్రీ కొల్లాపురస్నేహలతాకవితా సంఘమువారి 3 వ వార్షికపత్రిక. వెల ఒక రూపాయ.

సంపాదకురాలు: శ్రీ చేప్రోలు సరస్వతీదేవి, నూజవీడు, కృష్ణజిల్లా.

పై మూడింటికి ప్రకాశకులు:

ప్రెసిడెంటు, స్నేహలతా కవితాసంఘము, కొల్లాపురము. మిరవకొండపోస్టు, కర్నూలుజిల్లా.

---

## ధ్రువ

గ్రంథకర్త: కాంచనపల్లి వేంకటరంగారావు, బరంపురము, (గంజాం). ౩౮ పేజీల చిన్నగద్యనాటిక. వెల ఒక అణా.

---

## Studies in the History of the third Dynasty of Vijianagara

### (తృతీయ విజయనగర వంశచరిత్రాధ్యయనము)

౧/౮ రాయల్ సైజు. ౩౬ + ౪౨౬ పుటలు, వెల రు. ౫-౦-౦.

గ్రంథకర్త: డాక్టర్. నేలటూరి వెంకటరమణయ్య, యమ్. ఏ. Reader in Indian History and Archaeology, University of Madras

ప్రకాశకులు : మదరాసు విశ్వకళాపరిషత్తువారు.

## అబిసీనియా యుద్ధము

(ప్రజాసేవ గ్రంథమాల ౨) వెల ఒక అణా.

గ్రంథకర్త: పులపాక సీతాపతిరావు, బి. ఏ. (ఆనర్సు).

ప్రకాశకులు : తిమ్మరాజు సూర్యనారాయణరావు, బి. ఏ. (ఆనర్సు). భారతిలో రెండునెలలకు పూర్వము ప్రకటితమయిన వీరి వ్యాసముతో, సెప్టెంబరు నెల చివరకు జరిగిన విషయములను చేరి యిట్లు చిన్నగ్రంథమయినది.

## సునిశిత వైద్యము

క్రౌను సైజు, ౭౫౦ పుటలు, వెల రు. ౪-౮-౦

డా. ఈ. పి. బ్యాపిటిస్ గారి హ్యూమనిక్ కల్చర్ అండ్ క్యూర్‌లోని భాగముల కాంధ్రీకరణము.

అనువాదకులు: డా. పుచ్చా వెంకట్రామయ్య, కార్యాలయము, బెజవాడ.

---

## యోగమకరంద

(కన్నడము - ప్రథమభాగము)

రచయిత : టి. కృష్ణమాచార్యులు, యోగప్రొఫసర్, మైసూరు ప్యాలెస్, మైసూరు, ౧౬౪ పుటల క్రౌనుసైజు పుస్తకము, వివిధాసనముల చిత్రములతో కూడినది. వెల రెండు రూపాయలు.



# ఆంధ్రాభ్యుదయము

శ్రీ ఆంధ్రచిత్రకారుడు, చావలి నాగేశ్వరరావుగారు




జాతీయనాయకుల చిత్రములను రచించి పేరు గనినవారు. వీరి చిత్రశాల బొంబాయియం దున్నది. వీరు గా. శ్రీనివాసశాస్త్రిగారి చిత్రమును తైలవర్ణములతో సుందరముగ రచించి, చిదంబర విశ్వవిద్యాలయమున కొసగి కళావేత్తల ప్రశంసకు మిక్కిలి పాత్రులయిరి. రూపచిత్రరచనయం దీయనకు గల నైపుణ్యమును జాతీయనాయకుల చిత్రము లుద్ఘోషించుచున్నవి.

---

శ్రీ యం. తిమ్మరాజు I. C. S




తణుకుతాలూకా గోటేరు నివాసులు మంతెన లక్ష్మీనరసింహరాజుగారి కుమారుడు. ఇటీవల లండనున I. C. S. పరీక్షయందు కృతార్థులయ్యెను. ఆంధ్రక్షత్రియులలో మొదటి I. C. S పట్టభద్రుడు.

---

# కలగూరగంప




శ్రీ త్రిపురమహారాజు
లండనునందు హిందూదేవాలయమును కట్టించుచున్నారు.



భర్తతోగూడ యుద్ధమునకు బోవుచున్న
అబిసీనియా స్త్రీ. వయసు ౨౭




డా. కుమారి కొమఱ్ఱాజు అచ్చమాంబ
L. R. C P, N. L. M.




ఎడింబరోయందును, డబ్లిను నందును ఉన్నత వైద్యవిద్యాశిక్షణమును పొంది వచ్చెను. ఈమె కీ. శే. కొమఱ్ఱాజు వెంకటలక్ష్మణరావు పంతులుగారి కొమారిత.

---

రుస్తుం నజీవాంజి మిర్జ కుమారి




ఈమె మదరాసు విశ్వవిద్యాలయ పట్టభద్రురాలు. 'తాతా' విద్యార్థివేతనము పొంది అక్సుఫర్డున ఉన్నతవిద్య నభ్యసింప బోవునది.

---

కుమారి ఆర్. సుబ్బమ్మ, బి. ఏ.




వైశ్యసంఘమున నీమె ప్రథమ పట్టభద్రు. మదన పల్లి ఋషికోనలోనున్న దివ్యజ్ఞాన కళాశాల విద్యార్థిని.

శ్రీమతి మున్నాబాయమ్మ



ఈమె చిత్తూరుజిల్లాబోర్డునకు మెంబరుగా ఎన్నుకొనబడెను.

# సామ్యవాదము

దిగవల్లి వేంకటశివరావు

కూలివానికిచ్చు కూలిడబ్బుల విలువకన్న ఎక్కువ విలువగల పనిని వానిచేత చేయించుకొనుటకే యజమాని వానికి కూలి నిచ్చుచున్నాడు. కూలివాడు పుచ్చుకొను కూలియొక్క విలువకును, వాడుత్పత్తిచేయు అర్థముయొక్క విలువకును గల తారతమ్యపు విలువకే అర్థశాస్త్రజ్ఞులు "అదనపు విలువ" (Surplus value) అనుపేరు పెట్టియున్నారు. కాయకష్టము చేయువారిని సేవకులనుము, కూలివాండ్రనుము, పాలికాపులనుము, దాసునుము, బానిసలనుము, ముస్తామూదవారి చేత పని చేయించుటకు పురికొల్పునది ఈ అదనపు విలువయే. ఈలాభము చేజిక్కించుకొన్నవారు స్వసంరక్షణకొరకు ఏకమగు నారు. అట్టివారు ధనమార్జించి ఆధిపత్యము వహించు తరగతివారిక్రింద పనిచేయు తాబేదారీ తరగతివారు, తాముత్పత్తిచేసిన అర్థ లాభములో కొంత హెచ్చుభాగము కోరగానే ఉభయులకు సంఘర్షణము తటస్థించు చున్నది. యజమానులకు మొకటి బయలు దేరి తమ బలమును కాపాడుకొనుటకు, తమకు వశవర్తి యగు ప్రభుత్వమునందు కట్టు బాటులు చేయసాగిరి. విద్యలు, మతములు, ప్రారంభదశలో ఎట్టి సదుద్దేశముతో జనించి నను, యజమానులకులము వానిని వశపరచు కొని ఈసంఘ సంఘర్షణములో తమ కుపయోగించు శక్తులుగా చేసికొనినారు. వేయేల? నాగరికజీవనమెల్ల పెట్టుబడిదారులవశమైనది. ఈపెట్టుబడిదారులసభ్యత నేడు పాశ్చాత్య దేశములందు పరిపక్వదశలోనున్నది. ధనము గల తరగతులు కొన్ని అధికారపదవి నధిష్ఠించి, సంపద నార్జించుమార్గములను, దాని నుత్పత్తిచేయు సాధనములగు మహా యంత్రములను, సంపదను నలుదెసలకు బంపు సాధనములను, మార్గములను, ఇతర అర్థోత్పాదక పరికరములకాధారమగు ద్రవ్యమును, తమకు హక్కుగలవానిగ జేసికొనినారు. పోలీసు వాని లాఠీ, సైనికుని తుపాకి, మరఫిరంగి, యుద్ధనౌక, మున్నగు సాధనములెల్ల ఈతర గతి అధికారమును నిలువబెట్టుచుండుట గాన వచ్చుచున్నది. బలముద్వారా నైననేమి, ధనబలముద్వారా నైననేమి అన్ని ప్రభుత్వాధికారములను, చట్టనిర్మాణ సభలను, పరిపాలకసంస్థలను న్యాయస్థానములనుగూడ ఈతరగతులే వశపరచుకొనినవి.

ఇప్పుడు దేశములోని అభిప్రాయము లుత్పన్నమగు మూలస్థానములు సైతము వారి హస్తగతములగుట చూచుచున్నాము. వార్తాపత్రికలు, దేవాలయములు, మఠములు, పాఠశాలలు, విశ్వవిద్యాలయములు, వారిచేతులలో నున్నవి. ప్రజలయోటులకు కూడా వారే యొకరూపము నిచ్చి, జనసామాన్యమున్న

స్థితిలో తృప్తిపడియుండునట్లు చేయగలుగుచున్నారు. అధికారస్థానములందు తమ వశవర్తులను, తమపరిపాలనను హర్షించి అది చిరస్థాయిగా నుండవలెనని కోరువారిని, నిలువబెట్టినారు. ఇంకొకవిధాన మేదైన దీనికన్న బాగున్నదని ఎవరైన పలికినచో ఈ తాబేదారులు వారిని పరిహాసింతురు. రాజకీయములందు, పరిశ్రమలందు మాత్రమేకాక భావప్రపంచమునందు సైతము సంఘుసమరమునకు ప్రథమసోపానమగు సంఘర్షణము సాగుచున్నది. పెట్టుబడిదారుల సభ్యత వ్యాపించి పరిపక్వమైన కొలదియు, ఈసంఘుసమరము తీవ్రస్వరూపము దాల్చుచున్నది. మూలధనము వర్ధిల్లినకొలది, దాని అధికార ప్రాబల్యము ఏకాగ్రతి చెంది దేశసంపదను స్వప్రయోజనార్థము కొల్లగొనుట అధికమగును. పనిచేయువారు అసహాయులు, ధనమత్యము, కట్టుబాటులు లేనివారు నగుదురు. యజమానులు కూలిని, సరకులు ఖరీదును కూడ యథేచ్ఛగా నిర్ణయింతురు. రోజురోజుకు ధరలు హెచ్చి బ్రదుకుతెరువు కష్టతరమగును. మూలధన మధికముకాగానే నూతనోత్పత్తి యంత్రములు వచ్చిపడును. క్రొత్త సరకులు హెచ్చుగా తయారగును. అధికోత్పత్తి, నిరుద్యోగము దాపురించును. అంతట క్లిష్టపరిస్థితులు సంభవించును. దేశములోని సరకు దేశములో చలామణిగాక ఇతర దేశములందు అమ్ముకొను ప్రయత్నములు, ఇతర దేశీయులను కొల్లగొను ప్రయత్నములు, అందువలని యుద్ధములు, ఉత్పత్తిచేయువారికి క్రొత్తపన్నులు, క్రొత్తకష్టములు సిద్ధించును.

ఈపట్టిడిలో పాటకపుజనము మేలుకొని కట్టుబాటులు చేసికొని, సలహానిచ్చి నడుప గలవారిని తమకు నాయకులుగా నేర్పరచుకొని, ప్రపంచమంతటను ఒకరాజకీయపక్షముగా నేర్పడి ప్రతిదేశములోను ప్రభుత్వములను జయించి జనసామాన్యమును కొల్లగొను ప్రజాపీడకులను వెడలగొట్టి, ప్రత్యేకాధికారములు గలపరిపాలనము నంతమొందింప బ్రయత్నించుచున్నారు. అర్థోత్పత్తి మార్గములను యజమానుల కుటుంబముచేతులలోనుండి తప్పించి దాని నుత్పత్తిచేయు కష్టజీవుల చేతులలోనికి మార్చుమార్పునకే సామ్యవాదులగు సోషలిస్టులు విప్లవమని పేరుపెట్టినారు. ఈమార్పుకొరకే సంఘుసమరము జరిగినది. అర్థోత్పత్తిసాధనములు కొద్దిమందిహస్తగతములై అవి కొద్దిమందిలాభమునకే ఉపయోగింపబడుచున్నినాళ్లు దేశములో దారిద్ర్య ముండకతప్పదు. లోకములో ఏఅన్యాయమును బాపవలెనన్నను అది పెట్టుబడిదారుల సభ్యతలో మెలికలు దిరిగి అల్లుకొనియుండి దుర్భేద్యమైనట్లు కనబడుచుండును. పసిపాపలు కర్మాగారములందు శ్రమపడుచుండుటకు, స్త్రీలు జీవనాధారము లేక వ్యభిచారగృహములందు బానిసలై యుండుటకు సామ్యవాదులు చెప్పుకారణము ఈ పెట్టుబడిదారులసభ్యతయే. బలహీనులజాతులను నాగరకులుగ జేయు

మిషతో బలవంతులు చేజిక్కించుకొని వారిని, ధనమును కొల్లగొనుచుండుటయు నసభ్యతయొక్క పరిణామమే. ఇంతేకాదు; దేశములో భావములువిరివిగా ప్రచారము కాకుండుటయు, అజ్ఞానము వర్ధిల్లుటయు నీనాగరకతయొక్క మాహాత్మ్యమే. యజమానుల కులము జనసామాన్యమునందు భావోదయమును సహింపదు. భావము లభివృద్ధినై తాబేదారులు కన్నులు తెరచుట కిష్టపడదు. బీదలను ధనికులు పీడించి సుఖించుచుండుటనుగూర్చిన రహస్యమును జనసామాన్యము ఎఱుగకుండునట్లు నేటినాగరక ప్రపంచమునందలి వైజ్ఞానికవిద్యాపద్ధతులు నడుపబడుచున్నవి. యజమానుల కులమే ఇందు కనుగుణములగు విద్యాసంస్థలను నిర్మించును. వార్తాపత్రికలను నడపును. మతములు స్థాపించును. ఈపత్రికాధిపతులు, ఈ పండితులు, ఈమతాధిపతులు నీసభ్యతనుగూర్చి సర్వకాలసర్వావస్థలయందు వేనోళ్ల పొగడుచుండుటవలన నీసభ్యత మంచిదేయని జనసామాన్యము కూడ తలంచుచుండును. పాపము; ఈపాచిక లెట్లు నిర్మింపబడియుండుట వారు గమనింపరు. ఈ పద్ధతులెల్ల చల్లగా నడచిపోవుచున్నవి. మతాచార్యులు పత్రికాధిపులను, పత్రికాధిపతు లుపాధ్యాయులను, ఉపాధ్యాయులు మతాచార్యులను ఒకరినొకరు పొగడుకొనుటతో నీగుడుగుడు కుంచము పూర్తియగును. జనసామాన్యము నిజమని నమ్మును. ఈమతాచార్యులు, ఈపత్రికాధిపతులు, ఈఉపాధ్యాయులు, దేశములోని అన్యాయములను చూచి సహింతురు; వానిని మాన్పుటకు తమచిటికెనవ్రేలినైన కదల్పరు.

ఈ ఆర్థికవ్యవస్థ మనలో పెట్టుబడిదారులు, వర్తకులు, న్యాయవాదులు, మతాచార్యులు మున్నగు కొన్ని చిన్నసంఘములకు సౌఖ్యము, గౌరవము, విజ్ఞానము, ఆరోగ్యము, ప్రతిష్ఠ, కలిగించును కాని, జనబాహుళ్యము గల సంఘములకు, గనుల పరిశ్రమలవారికి, కూలివారికి, కూడుగుడ్డ లుత్పత్తి చేయువారికి, దారిద్ర్యము, అజ్ఞానము, అనారోగ్యము, దుర్వ్యసనములు కలిగించును. స్త్రీలలోకూడ కొందరికిమాత్రమే సౌఖ్యము, ఆరోగ్యము, అందము కలిగించును. చాలమందిని అగాధమున, దారిద్ర్యమున, దుఃఖమున, బానిసత్వమున, వ్యభిచారమున బడవేసియుంచును. ఈ తారతమ్యములకెల్ల ఈ ఆర్థికవ్యవస్థయు, అందలి అవకాశములు నిజముగు కారణములని కొంచెము యోజించినచో తెలియగలదు. వర్తకుడు, న్యాయవాది, మతాచార్యుడు, విద్యను పొంది అధికారమును కలిగియున్నాడు. తనవిలువను తాను నిర్ణయించుకొనగలడు. గనులలోనిపనివాడు, పారిశ్రామికుడు, కూలివాడు, అట్లుగాక తన ప్రాణములను నిలువబెట్టుకొనుటకు దొరికిన కూలి పుచ్చుకొనవలసి వచ్చును. స్త్రీలలో కూడ ఇదేమాదిరి. కొందరు, విద్యను, ధనమును, అందువలన ఒయ్యారమును గలిగి మంచిభర్తలను సంపాదించుకో గల అవకాశమును కలిగి యున్నారు. పాటకపు జనముయొక్క స్త్రీల కిట్టి అవకాశము లుండవు. ఒకపూట తిండికిని, నిలువనీడకును తమ ప్రేమను అమ్ముకొనవలసి వచ్చును. ఇదియే నేటి నాగరకతయొక్క నిజస్వరూపమని సామ్యవాదుల నిశ్చితాభిప్రాయము.

---





విశ్వపరిణామమునందు ధర్మపరిణామము మహానిర్యాణ తంత్రము. ధర్మపరిణామమునకు సృష్టివలెను సంహారమును పరమార్థ సాధనము. ధర్మపరిణామమునకు ప్రపంచమంతయును శాంతిపాటను పాడుచు సంహార సన్నాహముల నారాధించుచున్నది. సంహారసన్నాహములకు సంగ్రామము సహజ ఫలము. నానాజాతిసమితి చేసెడి ధర్మనిర్ణయములును ధర్మాధారవిరహితములై సంగ్రామ ఫలమును సమకూర్చుటకు వినియోగపడుచున్నవి. సకలజాతులును శాంతిసాధనమైన ఆయుధవిసర్జనమును విడిచి సంహారసాధనమైన ఆయుధ ధారణము నారాధించుచున్నవి. ఐరోపా మహాసంగ్రామము నేర్పిన శాంతి పాఠము శ్మశానవైరాగ్యముగను పరిణమించినది. సకలజాతులును సంగ్రామ సన్నాహములకు జేయుచున్న వ్యయము మహాప్రళయమునకు సాధనభూతముగ నున్నది. శ్వేతజాతులు ప్రళయతాండవమునకు జోహారులొసంగుచు శాంతిగీతములను పాడుచున్న విధమును యూరపు రాజ్యాంగముల యుదంతము విశదము చేయుచున్నది. శాంతిమహారథుడు ముస్సోలినీగారు నాగరక ధర్మారాధన వ్యాజమున నుపక్రమించిన మానవ ధర్మ సంహారయాగము శ్వేతజాతుల నావహించిన ఆసుర ప్రవృత్తికిని, దురభిమాన దురహంకారములకును ప్రత్యక్ష ప్రమాణముగ నున్నది. నానాజాతిసమితి ముహూర్తములను, లగ్నదశాఫలములను గణించుచు కాలయాపనమును జేయుచుండగను ఇటలీసైన్యములు ఎబిసీనియాయందు ప్రళయతాండవమును జేయుచున్నవి. నానాజాతిసమితి ఇటలీకి కల్పింపనిర్ణయించిన ప్రతిబంధకములు మాటలందుత్తరకుమారప్రజ్ఞలవలె నున్నను కార్యములందు వెనుకంజ వేయుచున్నవి. యుద్ధమారంభమై ఆరువారములు గతించినను తన్నివారణోపాయములు మాత్రము దూరస్థమగుచున్నవి. ఎబిసీనియనులు మరణించి, దేశమును ఇటలీసైన్యము లాక్రమించిన యనంతరము ఇటలీకి జాతిసమితి ప్రతిబంధకములను గల్పించుట కుపక్రమించుటసంభవము. మాటలయందు పెద్దఆశను గల్పించుటయును, చేతలందాశాభంగము చేయుటయును బ్రిటీషురాజ్యనీతి యని గతానుభవము వలెను అబిసీనియా వ్యవహారములును విస్పష్టము చేయుచున్నవి.

**అబిసీనియాయుద్ధము**

అబిసీనియాయుద్ధము శ్వేతేతరజాతుల దురవస్థకు ప్రమాణము. శ్వేతేతర జాతులన్నియును శ్వేతజాతులకు దాస్యము చేయుటకు సృష్టింపబడినటు లంతర్జాతీయ వ్యవహారములు విశదము చేయుచున్నవి. అంత

ర్జాతీయ వ్యవహారములందు శ్వేతజాతులకు, ముఖ్యముగను పెద్దజాతులకు ఒక ధర్మము, శ్వేతేతరజాతులకు వేరొక ధర్మము. అబిసీనియా నానాజాతిసమితియందు సభ్యత్వమునకు తగదనియును, ఇటలీ - అబిసీనియాల కొకేధర్మము వర్తింపదనియును ముస్సొలోనిగారు ఘంటాపథముగను వాదించుచున్నారు. తోడేలు మేకపిల్ల కథయే తెల్ల నల్లజాతుల విషయమై పరిపాటియైనది. మానవ సుగుణములన్నియును తెల్లవారియందును, దుర్గుణము లన్నియును నల్లవారియందును మూర్తీభవించినటులు తెల్లవారందరును ఘోషించుట పరిపాటియైనది. "తెల్లవారి భారము" నల్లవారి రక్షణమునకు వినియోగపడుచున్నదియును, భక్షణమునకు వినియోగపడుచున్నదియును ప్రపంచ వ్యవహారములన్ని దేశములందును వేయినోళ్లను విశదము చేయుచున్నవి. ఇండియా, చైనా, ఈజిప్టు మొదలగు దేశముల కథలనే అబిసీనియా కథ స్ఫురింపజేయుచున్నది. అబిసీనియా ఆఫ్రికాఖండమునందలి కడపటి స్వతంత్రరాజ్యము. అబిసీనియాను భక్షించుటకు బ్రిటను, ఫ్రాన్సు, ఇటలీ రాజ్యములు చిరకాలమునుండి చేయుచున్న ప్రయత్నములు సఫలమగుటకు వర్తమానసంగ్రామము వినియోగపడుచున్నది. ఈ మూడురాజ్యముల వైర మింతవరకును అబిసీనియారాజ్యస్వాతంత్ర్యమును రక్షించినది. ఇటలీ నావహించిన సంగ్రామజ్వరము, మిత్రభేదమునకు వినియోగపడినటులు కనుపించినను, ౧౯౦౬-వ సంవత్సరమునందు మూడురాజ్యములు చేసికొనిన రహస్యసంధిని సార్థకము చేయుటకు వినియోగపడగలదు.

ఇటలీసంగ్రామప్రస్థానము నిరభ్యంతరముగను సాగుచున్నది. టాంకులు, మరఫిరంగులు, విమానములు, బాంబులు, విషవాయువులు మానవసంహారమునకును, ఇటలీ విజయమునకును వినియోగపడుటయందు విచిత్రము గనుపడదు. దిగంబరులగు సైన్యమునకు ఇటలీసంకల్పము సఫలమగుట సంభవము. ఇటలీ అవసరమైన దేశము నాక్రమించుకొనుటయును, శేషించిన దేశమును నానాజాతిసమితి పక్షమునను బ్రిటను, ఫ్రాన్సు పరిపాలించుటయును సంభవము. క్రిస్మసు కాలమునకు సంధి కుదురుటయును, సంగ్రామము నిలుచుటయును సంభవము. మాటలం దబిసీనియాస్వాతంత్ర్యము నిలిచియున్నను క్రియకు సామంతరాజ్యము అబిసీనియా స్వాతంత్ర్యమును సంధిపత్రమునందు మాత్రము నిలువబెట్టుట సహజము. పాపము, ప్రపంచ మంతయును అబిసీనియావారలను సానుభూతిని చూపుచున్నను అబిసీనియనుల దురవస్థమాత్రము తప్పకున్నది. బలము లేకను ధర్మరక్షణము దుర్లభమను సిద్ధాంతమునే అబిసీనియాసంగ్రామమును ఋజువు చేయుచున్నది. కాని శ్వేతజాతు లాఫ్రికాఖండమును జీర్ణించుకొనజాలకను క్షీణించుట యనివార్యమని భావికాలము విశదముచేయు

గలదు. అబిసీనియా సంగ్రామధ్వను లాఫ్రికా యందంతటను మారుమ్రోగుచు నల్లజాతుల హృదయములందు మహాసంచలన ప్రబోధములను గలుగజేయుచున్న విధమును ప్రపంచ వాతావరణ మనంతముఖములను రుజువు చేయుచున్నది. ఆఫ్రికా ప్రబోధము శ్వేత ప్రజాహృదయములందు గలుగజేయుచున్న భయసంభ్రమములకు స్మట్సు ప్రభృతుల ప్రసంగములు నిదర్శనములు. కోట్లనల్లజాతులను వృద్ధాప్యదశకు దిగుచున్న తెల్లజాతులు భ[illegible] జీర్ణించుకొనజాలవు. భావికాలమునందిమి సంప్రాప్తముగా నున్నను శ్వేతజాతుల ప్రతిష్ఠను నానాజాతిసమితి కాపాడుచున్నట. బ్రిటీషు రాజ్యాధికారులును ఇటలీమీదను విజయధ్వజమును ప్రకటించినను శ్వేతజాతుల ప్రతిష్ఠను గాపాడుచున్న విధమును మంత్రుల ప్రసంగములు, రాజ్యాంగవ్యవహారములు వేయినోళ్లను చాటుచున్నవి.

* * *

బ్రిటిషు రాజ్యనీతి

సర్ సామ్యుయలుహోరుగారు హిందూస్థానమున కిండియాబిల్లును ప్రసాదించి నటులు అబిసీనియాకు శాంక్షనులను ప్రసాదించినారు. యుద్ధనావలతో మధ్యధరాసముద్రమును సైన్యములతో ఈజిప్టుసోమలిలాండులను నింపి ఇటలీహృదయమునందు భయద్వేషములను గల్పించినారు. ఒకమూలను నీగసునకును, ఒకవైపునను ముస్సోలినికి బ్రిటీషురాజ్యనీతిజ్ఞు లాశను గల్పించుచున్నారు.

జయించిన ఇటలీకిని ఓడిపోయెడి అబిసీనియాకును ఫలముసమానమేయని భావిపరిణామము విశదము చేయగలదు. నానాజాతిసమితి నిర్ణయములు కోతి పిల్లికథను స్మరింపజేయగలవు. సంగ్రామము బ్రిటీషు జాతీయపక్షమున కాయుష్యబలములను సమకూర్చుటకు వినియోగపడుచున్నది. బ్రిటీషురాజ్యాధికారులు సంగ్రామమును ధర్మరక్షణమునకు గాక నుస్వప్రయోజనపరాయణత్వమునకువినియోగించుటకు సామ్రాజ్యాభిమానుల కవకాశము గలిగినది. ప్రజలు రామ్సేమాక్డొనాల్డుగారి కొసంగిన ద్రోహిబిరుదమునె ఇతరనాయకుల కొసంగి జాతీయపక్షాభ్యర్థుల నోడించుట వివేకము, ధర్మము. సామ్రాజ్యాభిమానభరితులై భాగ్యభోగముల ననుభవించుచున్న బ్రిటీషుప్రజలకు లాన్సుబరీగారి త్యాగవైరాగ్యములు దుర్లభములు. బ్రిటీషురాజ్యాధికారులవలెను ఫ్రెంచి రాజ్యాధికారులును లావలుగారి నాయకత్వమున నధర్మాచరణమునకు బూనుకొనుట దురదృష్టము. శాంతివలెను సంహారమును ధర్మపరిణామమునకు వినియోగపడుట ప్రకృతిధర్మమని నిత్యధర్మ మనంతముఖములను బోధించుచున్నను ధర్మఘోష వర్తమానకాలమునందు బలవంతుల చెవులందు జొరబడకున్నది. వర్తమానసందిగ్ధసమయమునందు శాంతికాములు, కాంగ్రెసునాయకులు, స్వధర్మనిర్వహణమునకును, శాంతిరక్షణమున

కును యావచ్ఛక్తిని వినియోగించుట శ్రేయస్కరము.

* * *

**కాంగ్రెసు ప్రతిష్ఠ**

గాంధిమహాత్ముడు స్వదేశ విదేశములందపూర్వమైన బల గౌరవ ప్రతిష్ఠలను గలుగజేసిన విధము ప్రపంచేతిహాసములందు దివ్యాధ్యాయము. హింసా దౌర్జన్యమయమైన ప్రపంచవ్యవహారములందు సత్యాగ్రహ మపూర్వమైన ధర్మాస్త్రము. ఈ ధర్మాస్త్రము నాత్మోద్ధరణమునకును, శాంతిసంరక్షణమునకును వినియోగించుట కాంగ్రెసునాయకుల ధర్మ యున్నది ప్రపంచవ్యవహారమునందు సత్యాగ్రహ సమరమును పరిపాటి చేయుట పురుషార్థమునకు పరమార్థ సాధనముగ నున్నది. కాంగ్రెసు అధ్యక్షులు శ్రీయుత బాబు రాజేంద్రప్రసాదుగారు దేశమునం దంతటను కాంగ్రెసు సందేశమును వ్యాపింపజేయుచున్న విధమును కాంగ్రెసు భక్తులకును, అభిమానులకును మార్గదర్శకముగ నున్నది. కాంగ్రెసు పక్షావలంబను లందరును నిరర్థకమైన వాద ప్రతివాదములతో కాలయాపనము చేయకను రాజేంద్రప్రసాదుగారివలెను కర్మయోగ పరాయణులగుట సంకల్పసిద్ధికి సాధనము. రాజేంద్రప్రసాదుగారికి ఆంధ్రప్రజలు సుస్వాగతంబు నొసంగి వారి మార్గము నవలంబించుచు కృతార్థులగుదురు గాక!

* * * *

**ఆంధ్రుల కర్తవ్యము**

గతమాసమునందు స్థానికసంస్థలందు జరిగిన ఎన్నికలు కాంగ్రెసు బలాబలములను, కాంగ్రెసు గౌరవబల సంరక్షణావసరమును విశదము చేసినవి. ప్రజలయందలి సాంఘిక విభేదములు, మంత్రుల నిరంకుశత్వము ప్రజల స్వధర్మరక్షణావసరమును విశదము చేసినవి. ప్రధానమంత్రి బొబ్బిలిరాజాగారు ఎన్నికలందును, స్థానికసంస్థల వ్యవహారములందును కలుగజేసికొనుచున్న ప్రమేయము వ్యాధిగ్రస్తమైన స్థానికసంస్థలందు నిశ్చేష్టతను కలుగజేసినది. కాంగ్రెసునాయకత్వము క్రిందను దేశయోగక్షేమాభిలాషులందరును సాంఘికపక్షభేదములను మరచి ఆంధ్ర దేశ గౌరవ ప్రతిష్ఠలను గాపాడుటకు దీక్షను బూనుట పుణ్యము, పురుషార్థము. గాంధి మహాత్ముని సత్యాగ్రహసందేశమును, ఆత్మవిశ్వాసమును సార్థకము చేయుట కాంధ్రులు దీక్షను బూని కామితార్థములను బడయుదురు గాత!



Printed and Published by K. Nageswara Rao,
at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor: G. Subbaramayya.